

# భారతి

మార్చి

**1945**

సంపుటము 22 : : సంచిక 3

[విడిప్రతి 8 అణాలు]

క్రొత్త విడుదల

ప్రొఫెసర్ ఈమని శంకరరావు (వీణ)

పాహిమాం (జనరంజని)
కమాచ్ } N- 18925

శ్రీమతి బళ్లారి లలిత (కన్నడము)

మహామాయే బాతాయే
కామిని వనరాణి } N. 8804




మున్ను వెలువడినవి

శ్రీమతి బి. రాజరత్నం

N. 18745

ఘల్ ఘల్లన రా

హోయి హోయి

మాస్టర్ వి. జే. వర్మ &
శ్రీమతి బి. రాజరత్నం

N. 18747

మాస్టర్ రాజేశ్వరరావు &
శ్రీమతి బాలసరస్వతి

N. 18758

టాకీ గీతములు

జగదీశ్ ఫిలిమ్సువారి
" తాసిల్దారు "

N. 18749—53

ప్రతిభావారి
" సీతారామజననము "

N. 18755—57




ది గ్రామఫోన్ కంపెని లిమిటెడ్, మద్రాసు.



# విషయానుక్రమణిక

1945, మార్చి



## చిత్రములు

వర్ణచిత్రము: నివాళి.

సాధారణ చిత్రములు: ఆంధ్రదేశములోని అద్భుతజలపాతములు; తుంగభద్రాప్రాజెక్టు దృశ్యములు - వ్యంగ్యచిత్రములు.



ని వా

కలకత్తా ప్రాంతమందలి ఒకానొక దేవాలయములోని శిల్పఖండమునకు ప్రతిరూపము




సంపుటము 22 | మార్చి, 1945 | సంచిక 3

తారణ - ఫాల్గునము

# పార్థివాబ్దమా!

= శ్రీ శృంగారం అయ్యవాచార్యులు =

పార్థివవత్సరంబ! పరిపాలన నీ దీఁక; లోకశాంతిగా
సార్థకనామమౌనటు మహాద్యుతి వచ్చెదు నీకు స్వాగతం
బర్థి నొసంగి లోకులు ప్రియంబుగ నానెలబాలుఁ జూచుచున్
ప్రార్థనసేయుభంగి ననురక్తిని నిన్ గణుతింతు రెల్లరున్.

అఱువది వత్సరంబులకు నొఁదలయెత్తి జగత్తులోకి నె
త్తెఱఁగున వత్తువో యని మదిన్ దిగులందుచునుండె లోక; మ
వ్వెఱపును బాపి చక్కని పవిత్రచరిత్రకు మూలమౌచు నే
కొఱంతలు లేని సుస్థితిని గూర్పఁగడంగుము పార్థివాబ్దమా!

వంతుప్రకార మిప్పటికి వచ్చితి వీ వొక రాజుభంగి నీ
తం తెటు లుండునో కలికథల్ విని లొంగక లోకమెల్ల ని
శ్చింతగ నుండుపద్ధతిని క్షేమము వర్ధిలఁజేయుచుండి వి
శ్రాంతిని జీవకోటికి నొసంగుము చక్కఁగఁ బార్థివాబ్దమా!

సోమరివై ప్రపంచమును జూడక యే దెటు పోయినన్ సరే,
నా మరియాద నా సుఖము నాకు లభించినఁ జాలునంచు నీ

వేమఱియుంటివా; యసలుకే యింక మోసమువచ్చుసుమ్మి! నీ
కేమియు గౌరవంబు నిడ రెవ్వ రిఁకెన్నఁడుఁ బార్థివాబ్దమా!

ప్రీతిగ దేశ మెల్లెడ సుభిక్షముగా నిరుపద్రవంబుగా
నీతిగ నిర్భయంబుగఁ బునీతచరిత్రగ, నిర్గతారిగా
ఖ్యాతజయంబుగా శుభగుణాఢ్యగ సర్వసుఖప్రదంబుగా
నీ తరుణంబులో నలిపి మెన్నికగాంచుము పార్థివాబ్దమా!

మంచికొ! దేనికో! యధికమాసముగూడను వెంటరాఁగ నే
తెంచుచు నుంటి వెట్టుల విధింతువొ నీఘనశాసనంబు; నీ
యంచితమౌ కటాక్ష మభయం బిడునట్టుల నెల్లదేశముల్
గాంచుచు లోకమంగళముగా నొనరింపుము పార్థివాబ్దమా!

స్థిరముగ నుండలే రెవరు చేసిన చేఁతలె శాశ్వతంబుగాఁ
జరితములందు నిల్చును; ప్రశస్తములైనవె కీర్తి దెచ్చు; ము
ష్కరములు దుర్యశం బిడును గావున నుండెడి కాలమందె నీ
వరనృపధర్మముల్ జరిపి వాసి గడింపుము పార్థివాబ్దమా!

కడచిన వత్సరంబు లటు కల్పనఁజేయుచు యుద్ధరంగముల్
నడపుచునుండెఁగాని కదనంబుల నాపఁగలేకపోయె; నీ
పుడమిని శాంతి యేర్పడఁగ బోరు లడంచి కడింది క్షేమ మిం
దిడి పెనురాచపాడిని రహిన్ నిలబెట్టుము పార్థివాబ్దమా!

వ్యయ యను నేడు నీపిదప వచ్చునటంచును లోకులందఱున్
భయమును బొందుచుండిరి; విపత్తు దలన్ బొడసూపలేని ని
ర్భయమగు ధర్మశాసనపరంపరఁ జేసి భవిష్యదబ్ద మ
వ్యయ యగున ట్లొనర్పుము దివంబును మెచ్చఁగఁ బార్థివాబ్దమా!

తీవ్రదవాగ్నికీలలకు దీటగు క్రోధము నార్పివేసి రా
జ్యవ్రజమున్ బ్రశాంతమగు న్యాయపథంబునఁ బెట్టి ఘోరతృ
ష్ణావ్రతతిన్ మహాత్మశమశస్త్రముచేఁ దెగవేసి నీ వహిం
సావ్రతసత్ప్రచారమును సల్పవలెన్ సుమ! పార్థివాబ్దమా!

# ద్రుత విచారము



= శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి =

నకారమునకు ద్రుత మని మన వైయాకరణులు పేరిడిరి. ఆ నకారము వర్ణసమామ్నాయములోని దని చెప్ప వలనుపడదు. (అఱవమునందువలె తెనుఁగు నందును రెండవ నకార ముండెనేమో!) లోపాదిక విశిష్టమగు ద్రుతగుణముతో పదాంతమం దుండునదియే యిది యని యూహింపఁదగియున్నది. ఉదా మనము, గనయము, నిలువు, చెనకు మున్నగు పదములలోని నకారము ద్రుత మనిపించుకొనదు. వినిచెన్, పలుకన్, వలనన్, కానన్ మున్నగు పదములయం దంతమం దుండునదై యవసరము లేదేని లోపించి, వినిచె, పలుక, వలన, కాన మున్నగు రూపములతో నొప్పారు నకారమే ద్రుతము. దీనికి ని, ను అను స్వత్వరూపములును కలవు.

ద్రుత మంతమందు గల పదము ద్రుతప్రకృతికము. ఈ ద్రుతప్రకృతికముల నేర్పఱచుపట్ల పండితులలో నభిప్రాయభేదము లున్నవి. ద్వితీయాప్రత్యయములైన 'ని, ను' ద్రుతములే యని కొంద ఱనిరి. ద్రుతప్రకృతికములుగాఁ గొంద ఱుపయోగించిరి. 'అందు' ద్రుతాంతమని కొందఱు; కాదని కొందఱు. ఇట్టి యభిప్రాయభేదము లొందుటకుఁ గారణమేమి?

అచ్చతెనుఁగున వాస్తవములగు విభక్తిప్రత్యయములు నాలుగే. అవి 'న్, కున్, నన్, అన్' అనునవి. ప్రథమాప్రత్యయములైన డు, ము, వు అను మూఁడును సంస్కృతపదములఁ దెచ్చుకొనుట కేర్పడినవే కాని అచ్చతెనుఁగువి కావు. అచ్చతెనుఁగుపదములకు ప్రథమాప్రత్యయములు లేవు. ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులుం, గ్లీబసమంబులు నయియుండు నని సూత్రింపవలసివచ్చిన కారణ మిదియే. ద్వితీయాప్రత్యయము 'న్ రామున్, చెట్టున్, గుట్టన్ మొ. ఈ ద్రుతమునకు స్వత్వము గలిగినపుడు రాముని, ట్టును, గుట్టను అని యేర్పడును. షష్ఠీప్రత్యయము 'కు' ఇది ఇకారాంతపదములకు (గీ, మీతక్క) 'కి' అను రూపము నొందును. సప్తమి 'న'. ఇదియు అన్ ప్రత్యయమందు వర్ణవ్యత్యయ మేర్పడఁగాఁ గలిగిన రూపమే. (అన్ = న్ + అ = న) అగుచో మరల ద్రుతము నంటఁగట్టుకొన్నది. ఇఁక తక్కిన చేత, తోడ, వలన, కంటె, పట్టి, యొక్క, లో, లోపల, అందు ప్రత్యయములును, చేసి, పై, పొంటె, కొఱె మున్నగునవియు పదములేకాని ప్రత్యయములు కావు. చేయి, తోడు, వలను పదములకు 'అన్' ప్రత్యయము చేర్పఁగా ఏర్పడిన రూపములే చేతన్, తోడన్, వలనన్. 'కై' అనునది 'కి + అయి' చేరినది. 'కొఱకు' అనునది 'కొఱ + కు' చేరినది. 'పట్టి, చేసి' అనునవి పట్టు, చేయు అనువాని క్త్వార్థకరూపములు. సంస్కృతము ననుకరింపించుటచే వచ్చినరూపములే యివి. ఉండుఁగాక!

“మహతో నితా విభక్తా టాదౌ వచనద్వయే క్రమేణ స్తః”—మహచ్ఛబ్దంబునకుఁ ద్వితీయాదివిభక్తి పరమగునపు డేకవచనంబున 'ని' ఆగమంబును, బహువచనంబున 'ల' ఆగమంబును అగును. (బాలసరస్వతి, చింతామణి.) దీని కాధారముగనే 'నిరమో మహతామ్', 'లుక్చ స్యాత్' (మహచ్ఛబ్దముల ద్వితీయైకవచనమునకు నివర్ణకం బగును. దానికి లోపమును గలుగును. రాముని, రామున్)అని చెప్పఁబడినది.

డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు (బాల. తత్స. ౨౩)నని చిన్నయసూరిగారు చెప్పిరి. బాలసరస్వతియుద్దేశానుసారముగా రాముని,కృష్ణుని,రామున్, కృష్ణున్ అని యేర్పడిన రూపములు సూరిగారి యుద్దేశానుసారముగా రామునిని, కృష్ణునిని యైనవి. ఈ రూపములు వాడుకలో నున్నవా? పూర్వకవిప్రయోగములేని కలవా? తృతీయనుండి యగు 'ని'ఆగమము ద్వితీయకును తెచ్చుటచే నేర్పడిన ప్రయోజనమింతకంటె వేఱు గానరాదు. అగుఁగాక!

ద్రుతమునకు 'ఇ,ఉ'అను అచ్చులు చేర్చుటచేఁగదా 'ని,ను' అను స్వత్వరూపము లేర్పడినవి? అట్లుండ నవి మరల ద్రుతాంతము లెట్లయినవి? వానికి ద్రుతకార్య మెట్లు సిద్ధించును?

ఇతర ద్రావిడభాషలలో లేని విలక్షణమైన ద్రుతము, ద్రుతాంతకార్యము మన తెనుఁగున నెట్లేర్పడినది? అని యోచించుచో సముచ్చయమైన ఉత్వమే దీనికి మూలాధారమని తెలియుచున్నది. అకార ఇకారాంతములకు సముచ్చయార్థకమైన ఉత్వము పరమగుచో యడాగమంబై 'యు'అయినది. (హరియు, సీతయు. మొ.) ఉకారాంతములకు నుగాగమంబై 'ను'అయినది.(రాముఁడును,కృష్ణుఁడును. మొ) ఈ(ను) సముచ్చయమే పెక్కు పదములను, ప్రత్యయరూపపదములను, ప్రత్యయములను ద్రుతాంతములుగాఁ జేసివైచినది. ఉదా: చేత—చేతను; తోడ—తోడను; వలన—వలనను. ఇందలి నువర్ణము సముచ్చయార్థద్యోతక మగుచున్నదేకాని వేఱుకాదు. చేయుచున్నాను, చేసితిని అనుచోట్లఁ గల నకార మిట్టి సముచ్చయమును స్ఫురింపఁజేయుట లేదు. చేసితినిన్, చేయుచున్నానున్, చేయుచున్నాన్ అను రూపములు లేవు. ఇట్లే తోడనున్, వలననున్ మొదలగు రూపములును లేవు. నన్ను, నన్నున్ అను రెంటిలోఁ గల యర్థభేదమును బాగుగా పరిశీలించిచూడుఁడు. 'నన్నున్' అను రూపము'నన్నుగూడ' అను నర్థమునే స్పష్టపఱచుచున్నది. కావున నన్నును, చేతను మొదలగురూపములు 'కూడ' అనునర్థము రానిచోట్ల నుపయోగింపరాదని తోఁచుచున్నది. 'ఉన్నాను' శబ్దమునకు 'ఉన్నానున్'అనికాని, 'ఉన్నాన్'అనికాని రూపములు సిద్ధింపలేదు. 'నన్ను' అను రూపమందుఁ గల యర్థము 'నన్నున్,నన్నును'అను రూపములలో భిన్నించినట్లు 'నన్' అను రూపమున భిన్నింపదు. ఈతీరున మమ్ము, మమ్మును రూపములలోను అర్థభేదము కలదు. 'మమ్' అను రూపము లేదు.

నన్ను—నన్నును; చేత—చేతను; తోడ—తోడను; కొఱకు—కొఱకును; వలన—వలనను; కంటె—కంటెను; వానికి—వానికిని; రామునకు—రామునకును; లోపల—లోపలను; అందు—అందును. వీనియందలి యర్థభేదము సూక్ష్మమతి నారయునది.

'రామునకు ఒక భార్య కలదు' అను వాక్యమందలి యర్థమునకును, 'రామునకును ఒక భార్య కలదు' అను వాక్యమందలి యర్థమునకును కల భేదము పండితపామరవేద్యము. ఇట్లుండ 'కు' వర్ణకమునకు 'కును' రూపాంతరము సిద్ధించుటెట్లు? ఇట్లే తక్కిన వాని నూహింపుఁడు.

నన్ను పిలిచెను—నన్నును పిలిచెను; రాముని చేత రాదు—రామునిచేతనురాదు; రంగనితోడఁ బోకుము—కృష్ణునితోడను పోకుము; నాకొఱకు రమ్ము—నాకొఱకును రమ్ము; ఆపని నీవలన నగును—నీవలనను అగును; నాకంటె పెద్ద—నీకంటెను పెద్ద; బావిలోపలఁ గలదు — బావిలోపలను కలదు; నీయందుకలదు—నీయందును కలదు.

ఈ రెండవ రూపము లన్నియు సముచ్చయార్థమునే తెలుపుచుండుటలేదా? ఇందు ద్వితీయారూపములగు నన్ను, నిన్ను, మమ్ము, మిమ్ము, రాముని, కృష్ణుని, వనమును, తరువును సముచ్చయద్యోతకములు కానట్టివి. ఇవి ద్రుతాంతములు కావు. స్వత్వరూపములు. వీనికి నన్, నిన్, రామున్, వనమున్, తరువున్ అను మొదటిరూపములు ద్రుతాంతములు. ఇట్లే 'అందు' కళ; ద్రుతాంతము కాదు. 'అందును' సము

చ్చుయద్యోతకము. చేత, తోడ, వలన, లోపల అనునవి అక్ ప్రత్యయసహితములుగాన ద్రుతాంతములు. కంటెన్, కోలెన్ లోనగునవియు ద్రుతాంతములే. కాని, వీనిలోని ద్రుతమునకు స్వత్వరూపము వచ్చునప్పు డర్థాంతర మేర్పడుచుండుటచే వీనికి స్వత్వరూపమే లేదేమో యని యూహింపవలసుపడుచున్నది. పూర్వము ద్రుతముల కన్నిటికిని స్వత్వరూప ముండెనా? కొన్నిటికిమాత్రమే యుండెనా?

తెనుఁగున హలంతము లన్నియు నుచ్చారణ సౌలభ్యమునకై ఉకారాంతము లగుచుండెను. వానిలోఁ గొన్నిటికి ద్విత్వమును గలుగుచుండెను. ఉదా: వనమ్-వనము, వనమ్ము; శిరస్, శిరసు, శిరస్సు మొ. ఇట్లే నకారాంతములును. కవివెవీరరాజు రచించిన భారతమునందును, సముఖము వెంకటకృష్ణప్పనాయకుఁడు విరచించిన జైమినిభారతమునందును, నన్నయకంటెఁ బూర్వుఁ డనఁబడుచున్న నన్నెచోడుఁడు వ్రాసిన కుమారసంభవమందును వాండు, వీండు, కలండ్డు, రాముండ్డు, కంట్టె, అంక్కము, లంచ్చము మున్నగు రూపములు కానఁబడుచున్నవి. (నన్నెచోడుఁడు నన్నయకు తరువాతివాఁడని కొందఱి మతము) పూర్వకాలమున మన తెనుఁగులో నఱసున్నలు లేవు. ఇప్పు డవి యున్న స్థానములలో నప్పుడు పూర్ణబిందువులే వాడఁబడుచుండెను. కాని యుచ్చారణమందు మాత్ర మెక్కువ భేదము కనఁబడుచుండెను. ఆ భేదము వ్రాఁతలోఁ దెలియుటకై అర్ధోచ్చారణమునకు సున్నయును, పూర్ణబిందూచ్చారణమునకు సున్నతరువాతి యక్షరమునకు ద్విత్వమును సంజ్ఞలుగా నుపయోగించుచుండిరి. అప్పు డర్ధబిందూచ్చారణము స్పష్టముగా నుండినదికాన సార్ధబిందు నిర్బిందు ప్రాస విషయము చర్చనీయాంశము కాకయే వేఱువేఱై యుండెను. అర్ధబిందూచ్చారణము మనలో నశించి నందువలననే సబిందుక నిర్బిందుకపదములు ప్రాసములైయుండవచ్చు నని పెక్కండ్రచే నంగీకరింపఁబడినది. ఇఁక మనము బలవంతపఱచినను అర్ధబిందువును మనవా రుచ్చరింపరు. ఉచ్చరింపఁజాలరును. కావున మానుటలోను, సబిందు నిర్బిందుపదముల ప్రాసమైత్రి నంగీకరించుటలోను పొరపాటనియు, దోషమనియు వచింపఁజాలము. కాలానుసారములైన మార్పుల నెల్ల రంగీకరింపకతప్పదు. పూర్వము దక్షిణదేశమునకు వలసపోయి యచ్చటనే స్థిరని సము లేర్పఱచుకొనిన తెలుఁగువాండ్రిండ్లలో నిప్పటికిని వదలక తెనుఁగే మాటలాడుచున్నారు. వాండు, వీండు, కూంతురు, చేంప లోనగు శబ్దములలోని వారి యర్ధబిందూచ్చారణమును విని యాంధ్రులు కేకలు వెట్టి నవ్వుట శోచనీయముగదా! మన పూర్వభాషాసంప్రదాయమును వారైనఁ గాపాడుచున్నందులకు చూపఁదగినది కృతజ్ఞతయా, గేలియా? ఆగేలికిఁ గారణము మన భాషకు పూర్వపుస్థితి యది యని యెఱుఁగమియేకదా?

వాక్యాంతమునందక్కఁ దక్కుచోట్లఁ గల ద్రుతమునకు పూర్వము సున్నయే వాడఁబడుచుండెను. సున్నమీఁది పరుషములు సరళము లగుచుండినవి. అప్పు డాసున్నలు పూర్ణోచ్చారణము గలవియే యగుచుండెను. వానిం జూడుము, రాముం గాంచుము, కానం దేలిన మొదలగు రూపములే రూఢియైనవి. అర్ధబిందూచ్చారణమును నశింపకుండెను. కావున నీ విషయమై సంశయజనకములు లేకుండెను. రూపమందు పూర్ణబిందువుగా నుండినది యర్ధబిందురూపము దాల్చినప్పుడును, తదుచ్చారణమే నశించినతరువాతను పూర్వపు సరళాదేశముమాత్ర మట్లే నిలిచిపోయినది. 'వానిఁ జూడుము, రాముఁ గాంచుము' మున్నగు నర్ధబిందు రూపకపదములకును, 'వాని జూడుము, రాము గాంచుము' అను నిర్బిందు రూపకపదములకును ఉచ్చారణమందు భేద మిప్పుడు కానరాకుండుటచే అర్ధానుస్వార ముంచినను, ఉంచకున్నను దోషములేని స్థితి తటస్థించినది. పండితుల వ్రాఁతలందు మాత్ర మయ్యది నిర్జీవక శుష్కశరీరముతో కానఁబడుచున్నది. అది లేకున్న నేమి యను వాదము పుట్టినది; పెరిఁగినది.

ద్రుతముమీఁద సరళాదేశముకూడ జనసామాన్యము వ్రాయు వ్రాఁతయందు కానరాదు. నిందు

సున్నమీఁద నైనచో నిత్యముగాఁ గానవచ్చుచున్నది. పండితుల వ్రాఁతయందుమాత్రము కొంత ఛాందసముగాఁ గానఁబడుచున్నది. అనుస్వారోచ్చారణ మిసుమంతయు లేని స్థలములందు సరళాదేశము స్వభావ విరుద్ధము. 'వాని చూచితిని, రాముని కాంచుము' అను చోటులలో కర్ణపారుష్య మేమికలదు? 'వాని జూచితిని, రాముని గాంచుము' అనుచో సరళాక్షరములు వచ్చినవేకాని శబ్దసారళ్య మింతయుఁ గానరాదు. 'వానిం చూచితి, రాముం కాంచుము' అనుచో పారుష్యము కానవచ్చుచున్నది. వానిం జూచితి, రాముంగాంచుము' అనుటయే సరళపద్ధతి. సరళాదేశము పూర్వ (భారత) కవుల సమ్మతము గాదని పారనంది రామశాస్త్రిగారు చింతామణి వ్యాఖ్యయందు తెలిపియున్నారు. అర్ధబిందూచ్చారణము లోపించినంతమాత్రముననే సరళాదేశము పారుష్య మగుచుండఁగా స్వత్వముమీఁద సరళాదేశము పారుష్యతరము కాకుండునా? అది శాస్త్రసమ్మత మగునా? వైయాకరణులు స్వత్వముమీఁద సరళాదేశమును నిషేధింపలేదుకదా? అటులుండ నది శాస్త్రసమ్మతము కాదను టెట్లు? అని కొంద ఱడుగ వచ్చును.

ద్రుత మనఁగా పదాంతమందలి నకారము. అది అచ్చుతోఁగూడిన స్వత్వ మగును. స్వత్వమైన పిమ్మట నది ద్రుతాంత మెట్లగును? ద్రుతకార్యము దాని కెట్లగును? అదియునుంగాక 'దివంబునుంబోలె' మున్నగువానిలో స్వత్వముపై ద్రుతము కనఁబడుచుండలేదా? అందురా? దీని కేర్పడిన సూత్రమందు 'కొన్నియెడల' అను పదమే దీని వైరళ్యమును తెలుపుచుండుటలేదా? ఇట్టి చిత్రప్రయోగములు నన్నయ మఱియుఁ బెక్కింటి నుపయోగించి యున్నాఁడు. వాని నన్నిటిం జర్చింప నిది యదనుకాదు. ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు (బాల. సంధి. ౧౬ సూ.)—'పూచెను గలువలు, తోఁచెను జుక్కలు, చేసెను డక్కలు, నెగడెను దమములు, మొగిడెను బద్మము.' అని యుదాహరణములతో వ్యక్తీకరించుచుండ దీనిని పొరపాటను టెట్లందురా? కవిత్రయముగాని, తదితర ప్రామాణికకవులుగాని స్వహస్తములతో వ్రాసిన తాటాకుల పుస్తకములు దొరకుచో మనము సుకరముగా దీనిని నిశ్చయింప వచ్చును. అట్లు లభింపవయ్యె. అచ్చైన శుద్ధప్రతు లన్నియు బాలవ్యాకరణమును ప్రమాణముగాఁ గొని సంస్కరింపఁబడినవే. ఇన్నిటిని తప్పించుకొని మనకుఁ గానవచ్చుచున్న దొక్క పద్యము గలదు.

"కవదొనలును గాండీవము
నవల నిడం బనుపు ముంద రరదము డిగు మే
ను విదప డిగియెద శుభకర
మవు నివ్విధ మట్లు సేయు మనుడు నతండున్"
(భార. శల్య. ౨ ఆ.)

'ఏనువిదప' అనుచోట 'ఏనవిదప' అని కొందఱు దిద్దిరి. 'ఏనువెనుక' అన్నచో నిర్వివాదాంశముగా నుండునని యొకరనిరి. ఎవ్వ రేమన్న నేమి? వాదోపవాదములు చాలకాలము పెక్కుండ్రకు జరిగి నను అట్లే యారూపము మాసిపోక నిలిచియున్నది. అట్లే స్థిరముగాను నిలువఁగలదు.

ఏను, నేను శబ్దములు ద్రుతాంతము లైనను స్వత్వరూపము నొందినవి కావున కళ లయ్యెను. కళలకు శ్రవణహితముకొఱకు గసడదవాదేశము చేసినఁ జేయవచ్చుఁగాక. సరళాదేశము తగదుగదా? స్వత్వముపై స్పష్టమైన సరళాదేశము ప్రాసస్థానమందు గల యొండురెండు ప్రయోగములు భారతమందుగాని, మఱియితర ప్రామాణిక గ్రంథములందుగాని కలవా? పెద్ద లింకను విమర్శించి పరిశీలింతురుగాక!

౧. నన్ను, మమ్ములకు సంధి నిత్యము. 'నన్నడిగె'నను రూప మసాధువు. సముచ్చయార్థమునఁ గావచ్చును.

౨. నను, మముల కచ్చు పరమగుట శ్రవణహితము కాదు.

౩. 'అందు' కళ; ద్రుతాంతము కాదు.

౪. స్వత్వరూపముపై సరళాదేశము శాస్త్రవిరుద్ధము; స్వభావవిరుద్ధమును.

౫. స్వత్వ మికారాంతమైనచోఁ బరమగు నచ్చునకు యడాగమం బగు. 'వానినియడుగుము' తొలిరూపము 'వాని నడుగుము.'

# ఉపమ

## = శ్రీ సుందరాచారి =

సృష్టిపరిశీలనజ్ఞానమే విజ్ఞానం. దైవసృష్టి అనంతం, అనేకం. అది అణువణువునా వైవిధ్యభావాన్ని వహించినా, సృష్టికీ సృష్టికీ మధ్య అదోవిధమైన సమానసంబంధబాంధవ్యభావం గోచరిస్తుంది. ఈ భావమే ఆధారంగా విజ్ఞానం విస్తరిల్లుతుంది.

దూరంలో మబ్బులు కొండల్లాగూ, నక్షత్రాలు మెరిసే కమలాల్లాగూ, ఉదయించే సూర్యబింబం నిప్పుబంతిలాగూ, కాకి కోకిలలాగూ, నక్క కుక్కలాగూ కనిపించటం సహజం. వాటిని వొకదానికొకటి పోల్చి చెప్పుకోవటం పొరబాటు కాదు. అసలు శైశవంనుండీ లోకజ్ఞానం వివిధవస్తుసముదాయాన్ని యేదోవొకరీతిగా పోల్చి తేల్చుకోవటంచేతనే ప్రారంభమౌతుంది. బంతికి అలవాటుపడ్డ పసిబాలుడు ఆకాశంలోని చందమామనికూడా కోరుతుంటాడు. అతనికి అదిగూడా బంతిలాగే కనబడుతుంది. గోళాకారం యిక్కడి సమానభావం. ఇంద్రియాల బలానికందని భూమ్యాకారాన్ని బంతికి పోల్చిచెప్పటం ప్రాథమికవిద్య.

బ్రతుకుతో, భావంతో, భాషతో పుట్టిపెరిగిందీభావం. వ్యావహారికజీవితంలో అడుగడుగునా మనం వాడుకునే మాటవరుసలూ, లోకోక్తులూ యీ సైజభావాన్ని అనుసరించి అలవాటులోకి వచ్చినవే. కవికల్పిస్తేనే పుట్టింది కాదీభావం.

అర్థంకాని పట్టుల్నీ, అనూహ్యమైన భావాల్నీ అందరికీ సువ్యక్తం చేయాలంటే, అంతకుముందే వారి అనుభవంలో వున్న విషయజ్ఞానంతో పోల్చిచూపాలి.

### విడరాని జోడు

సామాన్యులు వూహించలేని అంశాలూ, ప్రకృతిరహస్యాలూ కవి కావ్యాల్లో చిత్రించటానికి పూనుకుంటాడు. భాషారూపంతో అలాంటి భావాలకి రమ్యత్వాన్ని ఆర్జించటానికి ప్రయత్నిస్తాడు. భావాలు సువ్యక్తమైతేనేకాని రమ్యత చేకూరదు. దీనికుపకరించే ఉపమని వాడుకుంటాడు కవి యిక్కడ - తెలియని విషయాల్ని తెలిసిన విషయాలతో పోల్చిచూపి.

కాగా, కవితకి ఉపమ విడరాని జోడైంది. వేమనవాణి యీనాటికీ వినిపించటానికి కారణం దానికున్న ఉపమాబలం. కాళిదాసుని కీర్తి ఉపమాశక్తి.

### గీటురాయి

ఉపమని వుచితంగా వాడుకోవటం వొక నేర్పు. కవిప్రతిభా, కావ్యాత్మ అందుమీదనే ఆధారపడి వుంటాయి. అందరికీ అర్థమయ్యే, అనుభవసిద్ధమైన సామాన్యవస్తువుల్ని సేకరించి, ఉపమని చిత్రించటం రమ్యం. మానససరోవరంలోని హంసల్నీ, వెన్నెలని భక్షించే చకోరాల్నీ, యెవ్వరూ చూడని అప్సరోంగనల్నీ, అంతకన్నా అర్థంకాని అలకాపురినీ ఉపమానాలుగా తీసుకోవటం వృథాప్రయాస. అవి సాధించిన కార్యమేమీ లేదు. ఉప్పును కప్పురానికి పోల్చి, రుచులజాడల్ని గమనించి, పురుషులనుండి పుణ్యపురుషుల్ని సరళంగా వేరుచేసిన వేమన వుపమని స్వప్రయోజకంగా వాడుకున్నాడు. 'సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీం తనోతి, ఇయ

మధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ' అనే కాళిదాసుని కంఠం 'ఉపమా కాళిదాసస్య' అనిపిస్తుంది.

## అలంకారం కాదు-ఆయువు

కావ్యాలకి అలంకారం ఉపమ అని ఆలంకారికు లంటే, అది ఆయు వని నే నంటాను. అలంకారాలు కావ్యాలకి కళలు దిద్దుతై. అవి లేకుంటే కావ్యరూపం నశిస్తుందా ? ఔననడానికి వీల్లేదు. కాని, ఉపమ లేని కావ్యం వుత్తది అనిమాత్రం మనం గట్టిగా చెప్పుకోవచ్చు. దీనికి కారణం యిది స్వభావ సిద్ధంగా మానవప్రకృతితో పుట్టి పెరగటమే. ఉపమ ననుసరించే అలంకారా లన్నీ పెరిగినై అని అంటే కూడా సత్యదూరం కాదు. రూపకం, దృష్టాంతం, అర్థాంతర న్యాస- యివన్నీ ఉపమకి దగ్గరిచుట్టాలు. రూపకోపమలు నామభేదంతో వేరువేరుగా వ్యవహరింపబడుతున్నాయే గాని, వాటికుండే తేడా అతి సూక్ష్మం. మబ్బులు ఉరిమిన తోడనే లోకరక్షా దీక్షతో చక్కని వర్షం కురిసేలాగు కరుణాయుతుడు ఆక్రోశించి అరిచిన వెంటనే దానికి తగిన ఫలం కలగక తప్పదు. ఇది దృష్టాంతం. కరుణాయుతుడు మబ్బైతే ఆక్రోశభావం వురుములైంది ; వర్షాలు దానికి తగిన ఫలితాలైనై. ఇది వుపమ కాకపోవచ్చు కాని ఉపమల వరుస. "బ్రాహ్మణో నహంతవ్యః" అని వేద శ్రుతి. ఇతడు బ్రాహ్మణుడు, కాన వధింపదగిన వాడు కాడు. ఇది అర్థాంతరన్యాస. వేదసూత్రంతో ప్రస్తుత పరిస్థితిని పోల్చటమే కదూ యిదికూడ ?

## 'ఏకంసత్ విప్రా బహుధా వదంతి'

ఉన్నతభావాలన్నీ ఉపమబీజంగా వెలువడ్డాయి అంటే విశ్వసించవచ్చు. భవనప్రాంతంలో కాంతార వేల్లితవల్లీనిచయాలు అల్లుకున్నై. కాని, గిరికను వెన్నంటిన వసురాజుచూపులను అవి అరికట్టలేదు. గిరికశిరోజాలు నల్ల మబ్బులుగా కనిపిస్తే, నెమళ్లు పురివిచ్చి నాట్యమాడేయి. అప్పుడు తీవెలు చెదరి చూపులకు దారిచూపాయి. ఈ చిత్రాలంకారం చిన్ని ఉపమమీద పెరిగింది. శిరోజాలు మబ్బుల్లా కనబడకుంటే నెమళ్లూ లేవు, నాట్యాలూ లేవు. అల్లిన వల్లీనిచయాలు తప్పుకోనూ లేవు. ఏ అలంకారమైనా, యిలాగే ఉపమలో లయించిపోతుంది. కవి కౌశల్యా న్ననుసరించి యిదే అనేక రూపాలతో, అనేక నామాలతో అలంకారశాస్త్రంగా బలిసిపోయింది.



# బ్రహ్మాండమైన విడుదల!

## ఉగాది కానుక



బెజవాడ -
మారుతీ సినిమా
గుంటూరు -
సరస్వతీ టాకీస్
బందరు -
మినర్వా టాకీస్
కాకినాడ -
మినర్వా టాకీస్
విశాఖపట్టణం -
పూర్ణా థియేటర్
విజయనగరం -
పూర్ణా థియేటర్
వరంగల్ -
విక్టరీ టాకీస్



ప్రారంభము:
# గురువారం
# 15-3-45

డైరెక్టరు:
K.నాగభూషణం

...శ్రీ రాజరాజేశ్వరి పిక్చర్సు సృష్టి......

DISTRIBUTORS FOR ANDHRA, CEDED& NIZAMS:

MADRAS—BEZWADA—SECUNDERABAD—GUNTAKAL.

For Tamilnad & Mysore:— NARSU PICTURES CIRCUIT. MADRAS.



భాగ్యములలో కెల్ల భాగ్యమగు మీ మెత్తని తల వెంట్రుకలను కేశవర్ధిని నుపయోగించి మీ ముఖాలంకారముగా చేసికొనవచ్చును గడ్డము, ముక్కు మొదలగు ముఖనిర్మాణము మార్చుకోలేరు గాని కేశ కలాపమును మాత్రము, అజంతా చిత్తరువు లట్టు యథేచ్ఛగా చిత్రించుకొనవచ్చును.

ప్రతినిత్యమును మీ అలంకరణమునందు, కేశవర్ధిని మీ కేశముల నలంకరించుటతో నారంభించుచు మీ శృంగారమునకు దోహద మొసంగ నిండు. లేజవ్వనమున మోహనమునగు మీ కేశబంధమును కేశవర్ధిని బలమునిచ్చి పెంచును. 2



నేడే మీకురులకు కేశవర్ధిని వాడుడు
కురులను అందముగా పెంచి బలపర్చును.

| | | |
|---|---|---|
| కేశవర్ధిని | అణాలు | 0-12-0 |
| కేశవర్ధిని షాంపూ | ,, | 0-12-0 |
| కేశవర్ధిని క్రీం | ,, | 1- 0-0 |

ప్యాకింగు పోస్టేజి అధికము
వర్తకులందరివద్దను దొరుకును లేక

158, తిరువెంకటస్వామి రోడ్డు,
ఆర్. యస్. పురము — కోయంబత్తూరు.

బలహీనమైన బిడ్డలకు
పుష్టియున్ను, బలమున్ను
ఆరోగ్యము నిచ్చును

గమనిక :— దీనినిపోలిన యితర యిమిటేషన్ నూనెలనుకొని మోసపోవద్దు. మీరు కొనుటకుముందు, దానిమీద, "కేశవర్ధిని" మరియు "సౌత్ యిండియా కెమికల్సు" అను పేర్లనుచూచి తీసికొనుడు.

# హంస సందేశ



= కీ. శే. కపిస్థలం కృష్ణమాచార్యులు =

హంససందేశం వ్రాసేటప్పుడు వేంకటనాథుని—శ్రీ వేదాంత దేశికులవారి—మనస్సులో మేఘసందేశం తప్పకుండా వుండి వుంటుంది. అయితే, కాళిదాసుని కృతిని అనుకరించటంలో కవి చూపింది కేవలమైన దాస్యం కాదు; అక్కడక్కడా, చాలాచోట్లలో ప్రతిభా, మౌలికత్వమూను. కావ్యం ఒక్కసారి చదివేటప్పుడే యీవిషయం తోచవచ్చు. ఐనా, ఈ విషయాన్ని విమర్శకదృష్టితో, సప్రమాణంగా నిరూపించదలచాను.

ఖిన్నుడైన ప్రియునికి దూత కనిపించటం; ఎక్కడో దూరదేశంలో వున్న ప్రియురాలి విరహార్తిని తలచుకోవటం; పాపిష్ఠివిరహం యింకా యెంతోకాలం వుండదనీ, అందాకా ఎలాగో వోపికతో వుండమనీ ప్రేయసికి సందేశం పంపాలని తోచటం; దూతమీద సోదరభావం కలగటం; సందేశాన్ని అందించటంలో దూతకు ఔదార్యమూ, సామర్థ్యమూ తప్పకుండా వుంటాయని విశ్వసించటం; శుభశకునాలు కనిపించటం; మార్గవర్ణన; దారిలో దూతకు రకరకాల వినోదాలు; పుణ్యక్షేత్రాలలోని ఆధ్యాత్మికానుభూతులు; దూత్యానికి శుభసూచకంగానూ, దూతఆత్మకు వున్నతి కలిగేలాగూ తలవని తలంపుగా పరమాత్మను సేవించగలగటం; గమ్యస్థానవర్ణన; దూత చూడగలప్పటి ప్రేయసిభౌతిక మానసికపరిస్థితులు; ఆమె ఆర్తహృదయానికి ఆవంతైనా ఆందోళన కలగనిలాగు వేళకు సందేశం అందిపోవాలే అని ప్రియుని ఆరాటం; మధురాతిమధురమైన సందేశం; దూతఋజువర్తనకూ, విశ్వాసపాత్రతకూ తగుమైన నిదర్శనం; దూతకు ప్రియుడిచ్చే ఆర్ద్రమైన ఆశీస్సు—ఇవి మేఘదూతనుండి కవి గ్రహించినవి.

సందేశకావ్యరూపనిర్మాణంలో మౌలికత్వం తప్పకుండా కాళిదాసుదే. ఉన్న రూపాన్ని తీర్చిదిద్దటంలోనూ, అలంకరించటంలోనూ తరువాతికవులు ఎంత ప్రజ్ఞా, కౌశల్యమూ, తుదకు మౌలికత్వమూ చూపగలిగినా, ఒక క్రొత్తరకం కావ్యాన్ని సృష్టించే, మౌలికత్వం ప్రదర్శించే విషయంలో కాళిదాసుతో పోటీపడటానికి వాళ్లకెవళ్లకూ ఏమాత్రమైన హక్కూ లేదు. కాని—అలాంటి తరువాతి కవులలో ఎవరు గొప్పవాడు అని నిర్ణయించగలగటం వాళ్లెంతవరకు సంకల్పసిద్ధులైనారు? అన్న ప్రశ్నకు మనమివ్వగల సమాధానాలమీద ఆధారపడివుంటుంది. కాళిదాసు వాల్మీకిరామాయణం చదువుకొని, రసవంతమైన సన్నివేశాలు వల్లించి, ఆనందించే వుంటాడు. కాబట్టి శ్రీరామమూర్తి అశోకవనికలోని సీతాదేవికి సమీరకుమారుని ద్వారా పంపిన మధురసందేశమే కాళిదాసునికి మేఘసందేశంవంటి కావ్యం వ్రాయాలన్న కోరిక కలిగించివుంటుంది. ఐతే, ఇలాంటి ఒక సూచనను గ్రహించి సరిక్రొత్త కావ్యాన్ని సృష్టించటానికీ ఒక కావ్యాన్ని అనుకరించి—ఈ అనుకరించటంలో ఎంతటి ప్రతిభ ద్యోతకమైనాసరే—మరొక కావ్యం వ్రాయటానికీ ఎంతో తేడా వుంది. చూచాయగా వున్న సూచన వాల్మీకిదైతే అయిందికాని, కావ్యానికొక క్రొత్తరూపు కల్పించటం, దాని కనుగుణమైన ఛందస్సును ఏరుకోవటం, అంగాంగాలు మొట్టమొదట తీర్చుకోవటం, వీటిని మేళవించటంలో శిల్పం చూపి, సర్వాంగసుందరమైన అపూర్వకావ్యం నిర్మించటం—ఈవిషయాల్లో గౌరవమంతా కాళిదాసుదే; ఇది ఇతని కావ్యాన్ని అనుకరించిన వాళ్లల్లో అత్యుత్తమకవికీ లభించదు. సందేశకావ్యకర్తల్లో ఎవళ్లూ యిలాంటి గౌరవాన్ని అపేక్షించినట్టూ కనపడదు. అయితే, వీరిలో కొందరు—వేంకటనాథునివంటివారు—అంగాంగ నిర్మాణం విషయంలో చూపిన శిల్పం చూచినప్పుడు, కాళిదాసు కృతిలోకంటేకూడా ఎక్కువగా మెప్పూ, ఆనందమూ కలుగుతూవుంటాయి.

మేఘసందేశాన్నీ హంససందేశాన్నీ ఒకదానివెంట ఒకటిగా చదివేవాళ్ల దృష్టి ఉత్తరంలో కైలాసశిఖరం మొదలుకొని దక్షిణంలో లంకాద్వీపం వరకూ గల యావద్భారతదేశంమీదా పారుతుంది; అంటే, రామగిరికీ, మాల్యవంతానికీ మధ్య వున్న ఆ కొంతప్రదేశం తప్ప.

ఇలా చూస్తే, వేంకటనాథుని కృతి కాళిదాసుని కృతికి పోషకం; కాకుంటే పూరకం.

హంసను దూతగా ఎన్నుకోవటంలో చాలా ఔచితి వుంది. రాముడు లంకమీది దాడికి బైలుదేరటం శరత్తు తోచినవెనకే నని అంటుంది రామాయణం. ఈ ఋతువు లోనే హంసలు హిమాలయంలోని మానససరోవరాన్నించీ దక్షిణాగ్రానికేసి ప్రయాణం సాగించటం ఆరంభిస్తాయి.

ఒక కావ్యాన్ని విమర్శించాలీ అంటే, దాని కవికి చూపవలసిన గౌరవం నిర్ణయించాలీ అంటే ముందు కవి హృదయం గ్రహించాలి; అంటే కవి యెందు కీకావ్యం వ్రాశాడో, ఈకావ్యానికి ఉద్దేశ్యం ఏమిటో తెలుసుకోవాలి. కావ్యంలోని నాయకుని శీలచిత్రణాన్ని పరిశీలిస్తే ఈ కవిహృదయం సాధారణంగా బోధపడుతుంది. కాళిదాసుని యక్షుడు ధీరలలితుడు.మన పురాణాల్లో యక్షుల్ని ఇటు మనుష్యులూ కాక, అటు దేవతలూ కాక చిత్రించారు. అయితే వాళ్లకు మానవులతోకంటే దేవతలతో పోలిక లెక్కువ. వాళ్లు కుబేరుని ప్రజలు కావటంచేత మహాసంపన్నులు. సర్వాంగీణంగా సర్వతోముఖమైన సుఖం అనుభవించటానికి వాళ్లకు వున్న అవకాశాలకు లెక్కలేదు. శక్తిసామర్థ్యాలకు మేర లేదు. యువతీకాంచనమధుపానాలే వారికి జీవితపరమార్థం. ఈ జాతికి చెందిన నాయకుని అనుభూతులకు అనుగుణమైనట్లే మేఘదూతంలో అంతర్వాహినిగా పారుతుంది యింద్రియ లోలుపత—కాయికశృంగారం. కాబట్టే,

"మధ్యే శ్యామః స్తనఇవ భువః శేషవిస్తారపాణ్డుః"
"సభ్రూభంగం ముఖమివ పయో వేత్రవత్యా శ్చలోర్మి"
"లోలాపాంగై ర్యది నరమసే లోచనై ర్వంచితోసి"
"సంసర్పంత్యాః స్ఖలితసుభగం దర్శితావర్తనాభేః,"

తుదకు—

"జ్ఞాతాస్వాదో వివృతజఘనాం కో విహాతుం పమర్థః"
ఇలాంటివన్నీ ఆకావ్యానికి ఔచితిని పోషిస్తాయి,

అయితే వేంకటనాథుని నాయకుడు అమరమూర్తి శ్రీరామచంద్రుడు. అతడు ధీరోదాత్తుడు.

రామాయణంలో ఒకచోట స్వార్థమెరుగని ఆంజనేయుడు శ్రీరాముని ఈలాగు వర్ణిస్తాడు ;

"రక్షితా సర్వలోకస్య స్వజనస్యచ రక్షితా,
రక్షితా స్వస్య వృత్తస్య ధర్మస్యచ పరంతపః.
మర్యాదానాంచ లోకానాం కర్తా కారయితాచ సః,
అర్చిష్మాన్యర్చితో త్యర్థం బ్రహ్మచర్యవ్రతే స్థితః,
సాధూనా ముపకారజ్ఞః ప్రచారజ్ఞశ్చ కర్మణాం....
శ్రుతవాన్ శీలసంపన్నో వినీతశ్చ పరంతపః,
సత్యధర్మపరఃశ్రీమాన్ సంగ్రహానుగ్రహే రతః,
దేశకాలవిభాగజ్ఞః సర్వలోక ప్రియంవదః."

ఇట్టి ఉత్తమనాయకుని పరిచయం అందరికీ కలిగించి ఆనందింపజేయటమే వేంకటనాథుని ఉద్దేశ్యం. కాబట్టి, హంససందేశంలోని వాతావరణం శృంగారార్ద్రం కావాలీ అనుకోవటం ఉచితం కాదు. అంటే, భౌతికశృంగారం లేనే లేదని కాదు—వుంది; ఔచితికి భంగం లేకుండా, మెరుపు మెరిసినట్లు, తరళంగా, సరళంగా వుంది. మహాయుద్ధ సన్నాహాల్లో తలమునకలైనా, రాముడు విరహి— సీతకోసమేగా యింతా? కాబట్టి, అప్పుడప్పుడూ ఆయనమనస్సు సీతమీదా, ఆమె కష్టాలమీదా, ఆమెతో తా ననుభవించిన సుఖాలమీదా నిలుస్తూవుంటుంది। అలాంటప్పు డది శృంగారానికి సమేళమై వుంటుంది, అందుకే—" స్తోకోన్మగ్నస్ఫురిత పులినాం త్వన్నివానేచ్ఛయేవ"—యిలాంటి ఒకటి రెండు చిత్రీకరణాలు కావ్యసౌందర్యాన్ని మెరిపిస్తాయి.

వాల్మీకిరామాయణం చదివిచదివి తనివితీరని వేంకటనాథుడు తన హంససందేశంలో ఆదికవిస్వాదుభావాల్ని చదువరికి చవిచూప సంకల్పించాడు ; ఇందుకు మేఘదూత రూపశిల్పం సాధనంగా చేసుకున్నాడు. ఇద్దరు మహాకవుల భావాలకనుగుణంగా వర్తించాలి ; అట్లని. తన వ్యక్తిత్వాన్నీ త్యజించరాదు—తానై పూనుకున్న యీపని మరీ కష్టమైపోయింది, ఇలాంటి కట్టుదిట్టాలతో కూడా తన కావ్యాన్ని ఆకర్షణీయం చేయగలిగిన కవి సామాన్యుడు కాడు. రావణుని ఆరామంలో ఒకమూల క్రుంగిపోతూన్న సీతాదేవికి రాముని వూసు చెప్పి, హనుమంతుడు అప్పుడే వచ్చాడు తిరిగీ మాల్యవంతానికి. దూత్యం జయప్రదంగా నెరవేరిం దనటానికి ప్రమాణాలుగా రెండు తెచ్చాడు ఆంజనేయుడు—సీతాదేవి చూడామణీ ; ఆమె యంపిన ప్రతిసందేశం: తన్ను ఒక్క నెలరోజుల్లోగా ఎలాగైనా రక్షించక తప్పదని.

" ధారయిష్యామి మాసంతు జీవితం శత్రుసూదన,
మాసాదూర్ధ్వం నజీవిష్యే త్వయా హీనా నృపాత్మజః"

కాబట్టి, సూచితకాలంలో జైత్రయాత్ర ఎలాగైనా ముగించాలని రాముని ఆరాటం, రోజు ఆలస్యమై

నాపరే తీరని నష్టం వస్తుంది. రాముని మనస్థితి ఇలా వున్నప్పుడు, అతని దృష్టి చెంతవున్న కమలవని మీద పడుతుంది. అక్కడొక హంస విహరిస్తూవుంటుంది. దాన్ని చూట్టంతోటే రామునికి సీత జ్ఞాపకంవస్తుంది. దానికీ సీతకూ పోలిక లున్నాయి: దానిది సీతగమనంలాంటిది; ధవళిమలో, ధాళధళ్యంలో దాని యీకలు సీతచీరకు తీసిపోవు; దాని కూజితం సీతమంజీరనినదసదృశం. అంచేత అతని చూపు హంసమీద లగ్నమైంది—సర్వాన్నీ మరిచి, సీతదే లోకంగా ప్రణయస్మృతిలో పడ్డాడు రాముడు.

"తస్మిన్ సీతాగతి మనుగతే తద్దుకూలాంకమూర్తౌ
తన్మంజీరప్రతిమనినదే న్యస్తనిష్పందదృష్టిః,
ధీర శ్చేతోవిలయ మగమ త్తన్మయాత్మా ముహూర్తం
శంకే తీవ్రం భవతి నమయే శాసనం మీనకేతోః"

మేఘాన్ని చూస్తూనే ప్రేయసిని తలచుకుంటాడు యక్షుడు, కారణా లేవీ బలీయం కావు. హంసకూ సీతకూ ప్రబలసాదృశ్యా లుండబట్టి రాముని చర్య మరీ సహజం.

ప్రయాసపడి—తాను 'లక్ష్మణ స్యాగ్రజన్మా' అనుకుని—మేలుకుంటాడు రాముడు. తను అప్పుడప్పుడు బేలతనం తలచూపనిచ్చినప్పుడల్లా లక్ష్మణుడే హెచ్చరించవలసివచ్చేది. సీతాపహరణం పచ్చిపుండుగా వున్నప్పుడు తను, మతిచెడి, పంచవటిలో చెట్టుపుట్టల్నీ కొండగుట్టల్నీ జాలిగా వేడుకుంటున్నప్పుడు

"శోకేనాభిప్రనుప్తం తే జ్ఞానం నంబోధయా మ్యహం,
మహాత్మానం కృతాత్మాన మాత్మానం నావబుద్ధ్యసే"

అని దుఃఖాన్ని దూరీకరించింది లక్ష్మణుడేగా. తమ్మునికి మళ్లీ అలాంటి పని పెట్టటం యిష్టంలేదు రామునికి.

హనుమంతునిమీదకంటేకూడా ఎక్కువగా హంస మీద రాముని కిలా సహజంగా కుదిరిపోయింది సౌహార్దం; హంసద్వారా సీతకు దుఃఖోపశమనంగా, ఆశాజనకంగా మధురాతిమధురమైన సందేశం పంపదలచుకుంటాడు. క్షుభితమనస్కులకు తర్కం రాదు; అంచేత పక్షీ యెక్కడ, సందేశ మెక్కడ, అని రామునికి తోచనైనా తోచదు. రాముని యీదౌర్బల్యం వింతకాదు—

"విశ్లేషేణ క్షుభితమనసాం మేఘశైల ద్రుమాదౌ
యాచ్ఞాదైన్యం భవతి కిముత క్వాపి సంవేదనార్హే."

అచేతనమైన మేఘాన్ని వేడుకుంటాడు యక్షుడు సరిక్రొత్తవిరహంలో రాముని గతి యింతేగా?—

"కచ్చిత్ క్షితిభృతాం నాథ దృష్టా సర్వాంగసుందరీ:
రామా రమ్యే వనోద్దేశే మయా విరహితా త్వయా?
కదంబ యది జానీషే హంస సీతాం శుభాననాం....
యది తాల త్వయా దృష్టా పక్వతాలఫల స్తనీ...."

కాని, యిప్పుడు వేడుకుంటున్నది చేతనమైన ప్రాణిని - పక్షిని; అందులోనూ హంసను. చెట్లూకొండల్లాగు గాక యిది నిస్సంశయంగా సంవేదనార్హం. చేతనప్రకృతి యొక్క సంవేదనార్హత్వం రామునికి అనుభవంలో లేనిది కాదు. 'సీతను మీరు చూచారా? మీరు చూచారా?' అని అడవిలోని జంతువుల్ని తాను వేడుకుంటున్నప్పుడు, అవి తమ దిగాలు స్ఫురింపనీలేదూ?—

"ఏవముక్తా నరేంద్రేణ తే మృగా స్సహసోత్థితాః
దక్షిణాభిముఖా స్సర్వే దర్శయన్తో నభస్థలం,
మైథిలీ హ్రియమాణా సా దిశం యా మన్వపద్యత."

అందుకే హంస రామునికి అవ్యాజబంధువైంది; దాని సహాయం అపేక్షించటానికి అతనికి సంకోచంలేదు. తన కామితం తప్పకుండా అది తీరుస్తుందని రామునికి విశ్వాసం. ఎందుకంటే దాని వంశ మలాంటిది; ధర్మసంస్థాపనార్థం విశ్వస్రష్టే సారథిత్వం వహించిన విషయాన్నీ అది వినివుండవచ్చు."సర్వస్రష్టా విధిరపి యతః సారథిత్వేన తస్థౌ"

కాలతాండవం చెయ్యకుండా ప్రకృతానికి వస్తాడు — పవిత్రకార్యార్థంగా రాక్షసనగరికి-లంకకు పోవాలే అంటాడు. వానకాలం వెళ్లింది; శరత్తు మళ్లీ వచ్చింది. దానితోటే వచ్చింది హంసా. కళ్లు మూసి సుఖించదగ్గ తామరకొలకుల వెదుక్కుంటూ హంస దక్షిణాభిముఖంగా ముందుముందు చాలాదూరం పోయే అవకాశా లున్నై. కాని, దక్షిణాగ్రంలో రాక్షసు లుంటారంటే, మనసు మార్చుకుంటుందేమో. దారిలో వున్న వింతలూ, వినోదాలూ తలచుకుంటే యీఒక్కలోటు సులభంగా మరిచిపోవచ్చు నని రాముడు హంసకు నచ్చచెప్తుతాడు.

"స్థానె ర్ద్విష్యే రుపచితగుణాం చందనారణ్యరమ్యాం
ముక్తాసూతిం మలయమరుతాం మాతరం దక్షిణాశాం
అస్మత్ప్రీత్యై జనకతనయాజీవితార్థంచ గచ్ఛన్
ఏకం రక్షఃపదమితి సఖే దోషలేశం సహేథాః"

దూత్యోద్దేశ్యమే పవిత్రమైనది — జనకతనయాజీవి తార్థం. ఒక సత్కార్యంకోసం యిబ్బందులూ, తుదకు కడగళ్లూ ఓర్చుకోవచ్చు. కాబట్టి, యీ ఒక్కదోషలేశాన్ని సులభంగా అలక్ష్యం చెయ్యవచ్చు (ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతి).

తనచేతే గౌరవాన్నీ, ఆతిథ్యాన్నీ పొందగలిగిన రాజహంసకు సర్వత్రా రాజోపచారాలు జరిగితీరుతాయని రాముని దృఢవిశ్వాసం. అప్పుడే మలయమారుతం సౌహార్దంతో స్వాగత మిచ్చింది, దరవికస్వరమైన కమలకల్హారాల కషాయగంధంతో. సూర్యకిరణాల దారిలోని శారదనీరదం ధవళాతపత్ర మౌతుంది.

"సూక్ష్మకారై ర్దినకరకరైః కల్పితాంతశ్శలాకాః
శారోపాంతాశ్శతమఖధనుశ్శేషచిత్రాంశుకేన,
ఊఢాః పశ్చాదుచితగతినా వాయునా రాజహంస
ఛత్రాయేర న్నభసి భవత శ్శారదా వారివాహాః"

సూర్యోదయాస్తమయాలు వీక్షించేవాళ్లకు, కిమ్మీర వర్ణాంకితప్రకృతిచిత్రాలు — ముఖ్యంగా మబ్బులచిత్రలేఖనాలు—అయాచితంగా, యాదృచ్ఛికంగా నయనపర్వమవటం పరిచితానుభూతే. అలాంటి ఒక సందెవేళలో నా కొక మరువలేని దృశ్యం చూచే భాగ్యం కలిగింది. ప్రొద్దుగ్రుంకే వేళ; సూర్యబింబం చుంబిస్తోంది పడమటికొండల్ని. ఒక నల్లటి మబ్బు వచ్చి తరణిముఖం కప్పింది. చుట్టూ వున్న సన్నటి మబ్బులగుండా విచ్చినట్టు కిరణాలు ప్రసరిస్తూవున్నై. ఈ మబ్బుల చుట్టూ మళ్లీ వీటికంటె కాస్త నల్లనిమబ్బులు అర్థవలయాకారంగా వున్నై. వీటిబైటి అంచులు బంగారపు సరిగల్లాగు ధగధగలాడుతూవుంటే, విచ్చిన గుడిగొడుగును తూర్పుకేసి పండబెట్టిన ట్లనిపించింది నాకు. నిసర్గరమణీయమైన యిట్టి ప్రకృతిచిత్రం చూచినవాళ్లను వేంకటనాథుని పైవృత్తం వింతగా ఆకర్షిస్తుంది.

బైలుదేరేముందు, ప్రియురాలు పద్మినితో చెప్పిపోవాలి హంస. కాకుంటే, ఎంతో కాలానికి మళ్లీ ప్రియుని కౌగిలికి నోచుకున్న పద్మినికి ఆశాభంగం అవుతుంది, తీయని మాటలతో నచ్చజెప్పి, మళ్లీ పొమ్మంటాడు రాముడు.

"ప్రక్షీణాం త్వద్విరహసమయే జాతహర్షా మిదానీం
ప్రత్యాయాస్య న్ననునయ శ్శనైః పద్మినీం స్వాదువాచా

పద్మిని ఒప్పుకుంటుందా? రామునికి సందేహమే లేదు.

"సాతే తస్త్రీస్వనసుభగయా స్వాదితీహాభ్యను జ్ఞాం
మన్యే కుర్యా న్మధుకరగిరా మైథిలీ సౌహృదేన."

సీతా, హంసప్రియురాలూ యిద్దరూ పద్మినులే. కాబట్టి, వారికిదువురికీ గాఢస్నేహం. ఆడుదాని కష్టాలు వింటే ఆడుదాని మనసు కరుగుతుంది. వాళ్ల కష్టాలు వాళ్ల కర్థమైనట్టు మగవారి కర్థంకావు. అందుకే కాబోలు యక్షుడు ఉజ్జయినిలో అభిసారికల్ని పురుములతో బెదిరించవద్దని మేఘాన్ని వేడుకుంటాడు. నగరపు చీకటిదారుల్లో ప్రియులకోసం వెళ్లేవాళ్లకు మెరుపుకన్నెలు దారిచూపాలిట.

"సౌదామిన్యా కనకనికషస్నిగ్ధయా దర్శయోర్వీం
తోయోత్సర్గ స్తనితముఖరో మాస్మభూ ర్విక్లబాస్తాః"

ఇలాంటి సుందరభావమే ఋతుసంహారంలోనూ వుంది. అభిసారికల్ని ఆటంకపరచటానికి మబ్బు లెంత చేసినా, మెరుపుకన్నెలు తోడుపడతారట.

"అభీక్ష్ణ ముచ్చైర్ధ్వనతా పయోముచా
ఘనాంధకారీకృత శర్వరీష్వపి
తటిత్ప్రభాదర్శిత మార్గభూమయః
ప్రయాంతిరాగా దభిసారికా స్త్రియః"

మృచ్ఛకటికలో యిదేభావం మరీ స్పష్టంగా వుంది. వసంతసేన మెరుపును నిందిస్తుంది—

"యది గర్జతి వారిధరో గర్జతు తన్నామ నిష్ఠురాఃపురుషాః
అయి విద్యుత్ ప్రమదానాం త్వమపిచ దుఃఖం నజానాసి?

కొత్తవాళ్ల విషయంలోకూడా స్త్రీల కిలాంటి జాలి వుంటే, సోదరీవిషయంలో వుండదూ? హంసపొందిన యీ వీడ్కోలు మేఘం పొందిన దానికంటే మేలయిందని వేరే చెప్పాలీ ?

(ఆపృచ్ఛస్వ ప్రియసఖమముం తుంగమారుహ్య శైలం....) దూరపు ప్రయాణం కాబట్టి, జాగ్రత్తగా పొమ్మని రాముడు చెప్పటం చూస్తే, వాత్సల్యం పుట్టిపడుతుంది.

"ఉడ్డీయేథా స్సరసి జవనా ద్దక్షిణాశానుసారీ
పశ్యాః దూరాత్ ప్రబలగరుతాం పక్షిణాం దత్తవర్త్మా."

మాల్యవంతశిఖరాన్నించి హంస ఎగురుతూన్నప్పుడు ధవళప్రతిబింబం తోటి ఆపర్వతం మనస్సులోనించి చం

ద్రుని విడిచిపెట్టే శ్రీమహావిష్ణులా వుంటుందట. (చంద్రమా మనసో జాతః). ఇది మేఘసందేశపు సన్నివేశానికి అనుకరణం కానీ ఆ సౌందర్యం లేదు దీనికి.

"యేన శ్యామం వపు రలితరాం కాంతి మాపత్స్యతే తే బర్హే జేవ స్ఫురితరుచినా గోపవేషస్య విష్ణోః"

వేంకటనాథుని చిత్రం సాంకేతికం (మణిమయో మాల్యవా నేష శైలః); అందుకే, అస్వాభావికం.

గాలిలో ఎగిరిపోతూన్నప్పుడు హంస ఎన్నో వింతలూ విశేషాలూ చూడగలుగుతుంది, పల్లెటూరి ఆడువారు (పామరీణాం) తన్నొక వింతగా చూస్తారు. (అభ్రూభఙ్గేష్వ ధికసుభగై ర్నిశ్చింతాఙ్గః కటాక్షైః) ఇక్కడా మహాకవి ప్రభావం కనపడుతోంది (భ్రూవిలాసానభిజ్ఞైః ప్రీతిస్నిగ్ధై ర్జనపద వధూ లోచనైః పీయమానః).

ఆంధ్రకర్ణాటకదేశ మధ్యప్రాంతాల్లో మామిడిచెట్ల నీడల్లో పండుకొని పంటలు కాచే కాపువడుచుల పల్లెపదాలు హంసకు శ్రవణపేయం కాకపోవు. అక్కడ ముఖ్యంగా దర్శించవలసింది తిరుపతికొండల్ని. పైనించి చూస్తే పాములా కనిపించే యీ కొండలకు శేషాద్రినామం సార్థకమే. ఈ కొండలపైభాగంలో ఎర్రటి చందనపురాళ్లు వుంటాయి. అవి రత్నాలలాగుంటాయిట.

దూరప్రయాణాలు మొదలుపెట్టేముందు గుడికివెళ్లి, స్వామిని పూజించిరావటం ఎందుకూ మంచిది. బైలుదేరేటప్పుడు పూజ చేయకున్నా, దారిలో అవకాశం దొరికినప్పుడు, ప్రయాణం యాత్రార్థం కాకున్నా పూజించాలి. కాబట్టే వేంకటేశ్వరస్వామి ఆలయంలో జరిగే పూజల్లో పాలుకొనమంటాడు హంసను రాముడు.

శేషాద్రిని విడిచిపోతూన్నప్పుడు హంసదృష్టి తప్పకుండా సువర్ణముఖరిమీద పడుతుంది. ఈయేరు శేషాద్రికి కొన్నిమైళ్ల దక్షిణంగా పారుతుంది, గట్టుమీది చెట్లనించి పూలు నీటిలో రాలి తేలిపోతూవుంటే, కాళహస్తీశ్వరుని అర్చించటానికి కన్నెనడలతో సువర్ణముఖరి యీ పూలన్నీ తీసుకుపోతూవుందా అనిపిస్తుంది.

"స్తోకోన్మగ్న స్ఫురితపులినాం త్వన్నివాసేచ్ఛయేవ
ద్రక్ష్యస్యారాత్ కనకముఖరాం దక్షిణామంజనాద్రేః,
ఆసన్నానాం వనవిటపినాం వీచిహస్తైః ప్రసూనా-
న్యర్చాహేతో రుపహరతి యా నూన మర్ధేందుమౌళేః"

ఇందులో రమ్యమైన ధ్వని వుంది. జలకమాడిన జవరాలొకర్తు నిండుభక్తితో పుష్పాంజలితో ఆలయానికి పోతూవుంటుంది, ప్రియుని కలుసుకునేవరం పొందటానికి. ఆమె కోరకముందే దేవుడు వరం ప్రసాదించాడా అన్నట్టు ప్రియుడు దారిలోనే కలుసుకుంటే అతని చూపులు కనపడీ కనపడని ఆమె అంగాల్ని వెతుకుతుంటాయి.

సువర్ణముఖరి సైకతస్థలిలో కాస్త సుఖించనిదే బైలుదేరటానికి హంసకు మనస్కరించదు. ఇలాంటి కోరికను అణుచుకున్నా, తుదకెలాగో అది బైటపడి, కార్యభంగం కలిగిస్తుంది— అని రామునికి తెలుసు. అందుకే, ఎవ్వరూ లేనిచోట ప్రియురాలి కౌగిల్లో తన్ను తాను మరిచిపోయే ప్రియునిలాగు, కాస్సేపు ఏటి చల్లని యిసుకతిన్నెలమీద విశ్రమిస్తూ వినోదించుకోమంటాడు హంసను.

"నిర్విశ్రాన్తైః ఽనాం నిభృత మనభివ్యక్త మంజుప్రణాదో
మన్దాధూతః పులినపవనై ర్వంజులామోదగర్భైః,
అవ్యాసఙ్గః సపది పదవీం సంశ్రయాన్యై రలంఘ్యః"

కోరిక తీరింతర్వాత చేతిలో పని మరిచిపోవటానికి వీలుండదు. ఐనా అలాంటి చోటు విడిచిరావటం అంత తేలిక కాదు. అందుకే జాగ్రత్తసుమా అంటాడు రాముడు— "బందీకుర్యు స్తటవసతయో మా భవంతం కిరాతాః" కానీ, యక్షునికి మంచి వుపాయం తోచే అవకాశం లేకపోయింది, పాపం— "మందాయంతే న ఖలు సుహృదా మభ్యుపేతార్థ కృత్యాః."

ఇక్కడినించీ కంచికి. అది భూదేవి కాంచి. ఆమె స్వామి హస్తిశైలేశుని చూపంతా దానిమీదే. అక్కడ హంసకు నదియైన సరస్వతీదర్శనభాగ్యం అబ్బుతుంది. ఆమె హంసల వంశకర్తయొక్క స్వామిని కదా.

"స్వామినీ వః కవీనాం
వేగాసంజ్ఞాం వహతి మహతీం వల్లభా పద్మయోనేః"

సరస్వతి కవుల ఉపాస్యదేవత అన్న ధ్వని వుంది యిందులో. ఈ వృత్తం మొదటిపాదాల్లో మరొకధ్వని వుంది. సప్తభేదైః వర్ణస్తోమైః పరిణతా; స్వచ్ఛస్వాదుప్రసరసుభగా- ఈ మాటలు నదీపరంగా వాడబడటంచేత సూర్యకిరణాల్ని ఇంద్రధనుస్సులోని సప్తవర్ణాలుగా విభజించవచ్చునన్న వస్తుశాస్త్రసత్యం సూచితమౌతోంది. ఈ విషయాన్నే మనం సూర్యునికి సప్తాశ్వా లున్నాయని పౌరాణికంగా చెప్పుకుంటాము.

సరస్వతీజలంలో స్నానంచేయటంమూలాన్ని హంసకు బాహ్యశుద్ధేకాదుట, అంతశ్శుద్ధీ కలుగుతుందట.

"వక్ష్య స్యంతర్బహిరపి పరాం శుద్ధి మక్షేపణీయం"

ఇలాంటి శుద్ధి మేఘునికీ కలుగుతుంది. వింత ఏమిటంటే, అక్కడి నదీ సరస్వతే. అయితే ఒకటి—మేఘుడు నల్లటివాడుకాబట్టి, అతనికి అబ్బగలిగేది. ఒక్క అంతశ్శుద్ధే.

"అంత శ్శుద్ధ స్త్వమపి భవితా వర్ణమాత్రేణ కృష్ణః"

హంసలకు కార్మొయిళ్లంటే భయం. శ్రీవరదరాజస్వామి కాళమేఘంలాంటివాడు. లక్ష్మీదేవి సౌదామినివంటిది. అందుకే, ఆ దివ్యమూర్తుల్ని చూచి భయపడబోకని రాముడు చిరునవ్వుతో అంటాడు హంసతో. అక్కడికి వెళ్లినప్పుడు హంసభాగ్యం పండితే, స్వామి దేవీసహితంగా ఉపవన విహారం చేస్తూవుంటాడు. ఉచితరీతిలో అప్పుడు సేవించితేనే కాని, మళ్లీ అలాంటి అపూర్వావకాశం రానేరాదు.

"వ్యక్తో వాలవ్యజనవపుషా వీజయే స్తం త్వమేవ."

మేఘదూతంలోని సన్నివేశానికి యిది అనుకరణం. దాని సౌందర్యమూ, దాని ఔచితీ దీనికి లేవు. గౌరికోసం తనకు ప్రాణమైన భుజగవలయాన్ని త్యజిస్తాడు శంభుడు. మహోన్నతమైన హిమాలయాలగాంభీర్యంలో కైలాస సౌందర్యం ధ్వనితమౌతుంది, మేఘుడు అర్చించవలసింది శంభుని కాదు — విశ్వమాత గౌరి నట.

"హిత్వా తస్మిన్ భుజగవలయం శంభునా దత్తహస్తా"

అన్న యీ శ్లోకంలోని భావమాధురి చవిచూచిన వాళ్లకు వేంకటనాథుని "మధ్యాస్తం సరసిజమివ వ్విన్న మాలంబమానః" చప్పగా వుంటుంది.

హంససందేశంలో అక్కడక్కడా ఒకటిరెండు విషయాలకు కాస్త యెక్కువ ప్రాముఖ్యత యివ్వబడివుంది. ప్రతిభాశాలి యైన నవకవి యంటే అంతటి ప్రతిభ లేని సమకాలికకవులకు వుండే యీర్ష్యా, వాళ్ల చూపే నిరాదరమూ — ఇది మొదటిది. వేంకటనాథుని జీవికలో యిది కొత్తది కాదు. మరి, రెండవది—రాచవారి వూరేగింపుల వైభవం. మొదటిదాని ప్రసక్తి కావ్యంలో మూడు సందర్భాల్లో వుంది. హంసపరోక్షంలో తమ గొప్పదనాన్నిగూర్చి మహోయిదిగా వాగిన శెమళ్లు, దాని యెదుట మూగలౌతాయట, (వాచాలానా మివ జడధియాం సత్కవౌ దూరయంతే). చోళపాండ్యమండలాల మధ్యవున్న అడవిలో కీచురాళ్లు గొంతు చీలేలాగు కూస్తూవుంటే, రాముడు గంభీరంగా మౌనం వహించమంటాడు హంసను. శబ్దాయంతే నఖలు కవయ స్సన్నిధౌ దుర్జనానాం. ఇక, అశోకవనికలో సీతగతి దుర్జనులైన సమకాలికుల నడుమ సత్కవిసూక్తులుపడే పాట్లు తలపిస్తాయిట, (సూక్తిం రమ్యాం ఖలపరిసరే సత్కవేః కీర్త్యమానాం).

మరి, రాజవైభవంవిషయం — హంస బైలుదేరేటప్పుడు మలయమారుతం ధవళాతపత్రం పట్టే ఘట్టంలో ఇది తొలిసారి తలచూపింది. హంస చోళమండలప్రవేశం చేసేటప్పు డిలాంటి వైభవమే మళ్లీ వొక్కసారి తోస్తుంది. అక్కడి పోకమోకలు కళ్లకు విందు, స్వామి కామదేవుని కోసం బంటు వాయుదేవుడు మహోన్నతంగా స్వాగతం యేర్పాటుచేస్తాడు.

"కుర్వ న్నానాకుసుమరజసా యత్ర చిత్రం వితానం
పూగారణ్యే మృదు విచలయన్ పాళికాచామరాణి,
పాదన్యాసక్షమ మవకిరన్ క్ష్మాతలం పుష్పజాలైః
ప్రాయో వాయుః పరిజనవిధిం పంచబాణస్య ధత్తే॥"

సువర్ణముఖరీ విషయంలోలాగు, కావేరీనది వర్ణనలోనూ మనోహరమైన ధ్వని వున్నది, సహ్యాద్రి అడుగు నుండి సాగరానికేసి మెల్లగా పారుతూన్న నదిని చూస్తే అత్తవారింటికి వెళ్లే కొత్తకోడలు జ్ఞాపకం వస్తుంది-ముత్తైదువలు ముద్దుముద్దుగా తావిగుబాళించే పూలు సింగారించారు, పెద్దలూ బ్రాహ్మలూ ఆశీర్వదించారు; పెద్దతోడుతో బైలుదేరింది కోడలు.

"సహ్యోత్సంగా త్సపది మరుతా సాగరం నీయమానాం
భద్రాలాపై ర్విహితకుశలాం తాదృశానాం ద్విజానాం,
యామస్కన్నా స్సరసకుహళీపత్రపాత్రై ర్నిశాంతే,
మంద స్మేరాం మధుపరిమలై ర్వాసయంతీవ పూగాః"

తర్వాత శ్రీరంగం వెళ్లాలి హంస. అక్కడి గుడిలో పూజలూ అవీ చేసి, పాండ్యమండలం ప్రవేశించాలి. ప్రియునికోసం యెదురుచూచే ప్రేయసిలాగు, హంసరాకను తామ్రపర్ణి నిరీక్షిస్తుం దక్కడ. ముందు మహాసముద్రం దాటాలికాబట్టి, యిసుకతిన్నెలమీద అలసట కాస్త తీర్చు, కొని, మళ్లీ ప్రయాణం సాగించటం మంచిదంటాడు రాముడు-అది వుత్త విశ్రాంతికాదు; ఆశ్లేషసౌఖ్యం (శీతీభూత స్తరళలహరీబాహు సంశ్లేషణేన.)

## హంస సందేశం

హంస తనమీద యెగురుతూన్నప్పుడు సాగరునికి కృతజ్ఞత పొంగుతుంది-సగరచక్రవర్తి శ్రీరాముని వంశకర్తేగా-తనలో దాగిన కొండలమీద హంసను తప్పకుండా విశ్రమించుకో మంటాడు. అవసరం లేకున్నా, యిలాంటి ఆతిథ్యాన్ని స్వీకరించాలి. (అక్రాంతోఽపి ప్రణయ ముచితం నైవ బంధోర్విహన్యాః).

యక్షునికి అలకాపురి చాలా బాగా తెలుసు; అని వానికి గర్వంకూడ. కాబట్టే, అలకాపురివైభవాన్నీ, అందులో అందరి సౌఖ్యోపలబ్ధినీ గూర్చి యక్షుడు గంభీరంగా వర్ణిస్తాడు: కాని, రామునికి లంకావిషయం—అనుభవసిద్ధంగా—ఏమీ తెలీదు. తెలిసినా, విరోధినగరాన్ని అంత యిదిగా,వర్ణించటానికి మనస్కరిస్తుందా? హనుమంతుని ద్వారా, మరీ యితరత్రా, అంతో యింతో తెలుసుకున్నాడయితే-రావణుడు అధికారం దుర్వినియోగంచెయ్యటం మూలాన్ని, బందీలైన అచ్చరల అష్టకష్టాల్నిగూర్చి. కాబట్టి లంకను గూర్చి దూతకు చెబుతున్నప్పుడు రాముడు దాని వైభవాన్ని వర్ణించడు.—దిక్కుమాలిన యీ స్త్రీల జాతిని వర్ణిస్తాడు. తమతో కలిసి సీతవుండటమే వారికి ధైర్యం; అదే వారికి ఆశాలేశం. (ఉత్పశ్యంతో జనకతనయా తేజసైవ స్వరక్షం) ఈసందర్భంలోని మొదటి వృత్తం (లీలాఖేలం లలితగమనా....)రచనలోనూ భావంలోనూ కాళిదాసుని దానికి ప్రతిబింబం (విద్యుద్వంతం లలితవనితాః....)

చాంచల్యం యెరుగని ప్రియులకు పరస్పరమూ వున్న విశ్వాసం అనంతం, అగాధం. ఇలాంటి ప్రణయానుభూతే మానవహృదయానికి అమరత్వం, దివ్యత్వం ఆపాదిస్తుంది. ఆదిలోనూ, నీచస్థితిలోనూ ప్రణయానికి పొయని నీడలు శంకా, అవిశ్వాసమూ. స్వార్థరాహిత్యమూ, ఆత్మార్పణం పరస్పరంగా వుంటేనేగాని ప్రేమమార్గం పూలబాట కాలేదు—వక్రాతి వక్రంగా, కంటకావృతంగా వుంటుంది. ఆత్మత్యాగం చెయ్యగల మనస్సు యెదుటవాళ్ల త్యాగం యెదురుచూడదు; ఒకసారి చేసిన త్యాగానికి పశ్చాత్తాపం పడదు. ఐక్యసిద్ధికీ, ప్రణయసమాధికీ అనురూపమైన హృదయం అగుపించిందంటే, అలాంటిది అందులో శాశ్వతంగా లీనమౌతుంది; తృప్తి అంటూ లేనేలే దీ అనుభూతికి—ఈ తాదాత్మ్యం అంతటిది. సీతారాముల ప్రణయం యిలాంటిది. కాబట్టి, రాముడు చేసే సీతావర్ణనలో అత్యుక్తి వుంటుందని తోచదు మనకు. శింశుపక్రింద కూచ్చున్న సీతను యిలా వర్ణిస్తాడు హంసకోసం.

"సా మే దృష్టి శ్శఫరనయనా సన్నత్రభ్రూ స్సుకేశీ
తన్వీ తుంగ స్తనభరనతా త ప్తజాంబూనదాభా."

ఇవి చదుతువుతూంటే మేఘసందేశంలోని—

"తన్వీ శ్యామా శిఖరిదశనా పక్వబింబాధరోష్ఠీ
మధ్యే క్షామా చకితహరిణీప్రేక్షణా నిమ్ననాభిః"

అన్నవి తోస్తాయి. పైకి రెండూ బాగానే వుంటాయి; కానీ కాళిదాసుమాటల్లో వున్న భావధారం వాటికి లేదు.

హంస చూచేటప్పుడు సీత తన గోడు రామునికి చెప్పమని పిట్టల్ని వేడుకుంటూవుండవచ్చు; హనుమంతుడన్నట్టు, స్వామి వస్తాడేమో నని ఉత్తరానికేసి చూస్తూ వుంటుందేమో; రామచంద్రుని వంటినంటిన హాయినిగూర్చి తన సొమ్ముల్ని అడుగుతూ వుండవచ్చు; లేదా పాతకాలపు మంచిరోజులు మననంచేస్తూ, కళ్లు మూసుకొని సంతోషిస్తూ వుంటుందేమో. సీతరీతి యిలా యిలా వుండచ్చు—

"శుద్ధామిందోః శ్వపచభవనే కౌముదీం విస్ఫురంతీ—
మానీతాం వా విషతరువనే పారిజాతస్య శాఖాం,
సూక్తిం రమ్యాం ఖలపరిసరే సత్కవేః కీర్త్యమానాం;
వర్షాక్లిష్టామివ కమలినీం వ్యాహతార్థా మివోక్తిం,
పంకాక్లిష్టామివ బిసలతాం పత్యపేతామివేభీం
మేఘచ్ఛన్నా మివ శశికలాం విప్నురుద్ధామివాశాం,
వ్యాఘ్రోపేతామివ శశవధూం భూతలే జ్యామివాస్తాం."

ఇలాంటి స్థితిలో సీత బాహ్యాలోకం మరచి, ప్రణయ మధురస్మృతుల్లో రాముని మీదే ధ్యానం నిలిపివుంటుంది. వలపుకలలు చెదిరిపోతాయేమో తొందరపడకు—అంటాడు మేఘునితో యక్షుడు (యామమాత్రం సహస్వ.)

"మాభూ దస్యాః ప్రణయిని మయి స్వప్నలబ్ధే కథంచిత్
సద్యః కంఠచ్యుతభుజలతాగ్రంధిగాఢోపగూఢం."

చెట్టుమొదట సీతను చూచి, తన పని విన్నవించుకోవటానికి తగిన సమయం చూచుకోమంటాడు హంసను రాముడు. ఎందుకంటే వాల్మీకి యన్నట్టూ, (నిశాచరీణాం ప్రత్యక్ష మనర్హం చాపి భాషణం) మన కవి యన్నట్టూ (నిద్రాసమయ ముచితంవీక్ష్య నక్తచరీణాం) హంస అందించవలసింది రహస్యమైన సందేశాన్ని. రాక్షసాంగనలు పగలు తూగుతారుకాబట్టి, హంస ఆ దగ్గరి కొలకుల్లో రాత్రి వుచ్చటం మంచిది. ప్రభాతాయాతవాతాలతో లేచి, శుచియై తగిన సమయం యెదురుచూడాలి హంస.

ఇలాంటి కావ్యాలకు శిరోభూషణం సందేశమే. కాబట్టి, అది నాయకుని హృదయానికి అనుకృతిగా జీవంతో స్పందిస్తూవుండాలి. సందేశంలో మాటలు శ్రోత్రపేయంగా వుండాలి. ఇందుకు విరహంలో రాముడు పడ్డ యాతనకంటే తగుమైనది వుంటుందా? నాయికానాయకులకు తమ తమ కష్టాలు పరస్పరమూ విరహంలో వేగుతూన్నప్పుడర్థమైనట్టు మరొకప్పుడు అర్థమూకాదు, అవి వూహించుకోనూ లేదు. ఈ ఆర్తి ఆదికవి అమరవాణిలో మ్రోగింది మొదట. కాళిదాసునిలాగు స్వీయభావనను నమ్ముకోక, వేంకటనాథుడు వాల్మీకి వాక్కులు ధారాళంగా వాడేశా డిక్కడ. అసలీయన ఉద్దేశ్యమే యిది—వాల్మీకి భావాలకు ప్రచారం హెచ్చించటం.

సీతకు తన్నెరిగించుకోవటానికని హంస జనకుని వంశాన్నీ, దశరథుని వంశాన్నీ, మెల్లిగా కీర్తించాలి. ఆంజనేయుడూ యిలాగే చేశాడు ముందు, ఆమె తనవంక తిరిగి, తన్ను చూచినప్పుడు తాను ఆమె స్వామికి నమ్మినబంటనీ, తను రావటమంటే శరత్తు రావటమేననీ—వీరపత్నికి శరత్తు రాబోయే దాడిని సూచిస్తుందని తప్పక తెలుసు—విన్నవించుకోవాలి హంస.

"శూరాణాం య శ్శరదుపగమే వీరపత్ని వరాణాం
సన్మానార్థం సమయ ముచితం సూచయే త్కాజితైస్స్వైః"

ఈవార్త వింటే ముడుచుకుంటూన్న సీతహృదయం వికసిస్తుంది. మేఘదూతంలోనూ దూతకు యిలాటి వుపదేశం వుంది. అక్కడ,

"యో బృందాని త్వరయతి పథి శ్రామ్యతా మధ్వగానాం
మంద్రస్నిగ్ధై ర్ధ్వనిభి రబలా నీవిమోక్షోత్సుకాని

మన రాజనీతి గ్రంథాలన్నిట్లోను రాజులు శరత్తులో దాడివెళ్లతారనీ: అప్పుడు వెళ్లటమే మంచిదనీ వుంది రామాయణంలోనూ ఈ విషయం ప్రత్యేకంగా చెప్పబడింది, ఇచ్చిన మాట మరచి సుగ్రీవుడు నిద్రపొయ్యాడేమో, వేళ వచ్చిందేనని రాముడు లక్ష్మణునితో అంటాడు.

"అన్యోన్యబద్ధవైరాణాం జిగీషూణాం నృపాత్మజ
ఉత్సాహసమయ స్సౌమ్య పార్థివానా ముపస్థితః"

ఇలా తన సంగతి చెప్పి, హంస శ్రీరాముని క్షేమోదంతం మొదట తెలిపి,ఆతర్వాతే ఆమెవిషయం విచారించాలి:

"..........భవతిభాగధేయేన జీవ
కల్యాణీం త్వాం కుశల మనఘః కోసలేంద్రోఽనుయుంక్తే"

తన స్వామి క్షేమంగా వున్నాడన్న ధైర్యం కలిగిందంటే, సీతకు తక్కిన సందేశం వినేటందుకూ ఓపికా, ధైర్యమూ వుంటాయి. రాము డిలా అన్నాడంటే, అది స్వాభిమానమూ కాదు, ఆత్మోన్నతి కాదు, అందులో వున్నది స్వార్థరాహిత్యం—ఈ విషయంలో యింతటి శ్రద్ధ తీసుకోమనడం, 'ఏమాటంటే ఏమౌతుందో పాపం సీతకు' అన్న బెంగచేతేకదూ. ఆంజనేయుడన్నదీ అంతే. (వై దేహి కుశలీ రామ స్త్వాంచ కౌశల మబ్రవీత్),

వసంతోదయానికి ముందే జరిగింది సీతాపహరణం. ఇది శరత్తు. ఇంతకాలమూ రాముని వేదన అద్వితీయం. పూలకారులో తాను విరహంలో మునిగివుండినా, సీతను తలచుకున్నప్పుడే రాముని కడుపు తరుక్కుపొయ్యేది. అప్పటి ఆతని జాలి సందేశంలో వుంది. సీత వున్న చోటికి పోవద్దని రాము డప్పుడు వసంతుణ్ణి వేడుకున్నాడు, బలిమాలుకున్నాడు.

"సీతాపార్శ్వే న భవతు భవా నిత్యవోచ ద్వసంతం
రామస్త్రాసాదనమితధనుర్మౌళినా సన్నతేన"

రామాయణంలో రాము డేమనుకుంటా డంటే—

"నూనం నతు వసంతోఽయం దేశం స్పృశతి యత్ర సా
కథం హ్యసితపద్మాక్షీ వర్తయే న్మా మయా వినా."

హంససందేశంలోనిదే దీనికంటే మేలైన భావన విరహవేగంలో, త నేమి చేస్తున్నదీ తెలీక, రాముడు దక్షిణానిలమార్గంలో భ్రమింప సాగాడు. కానీ, లక్ష్మణుడు ఆ ప్రమాదం తప్పించాడు. (వారితో లక్ష్మణేన)

సందేశంలో మరోవిషయం యేమిటంటే —'సీత యేమయిందని తన్ను జనకు డడిగితే, అతని కేమనాలి? నిజం యెరిగితే. ఏమనుకుంటాడు? అది యెలా భరిస్తాడు?' అన్నది. అశోకపు ఎర్రనిపూలూ, కురుంజతెల్లనిపూలూ చూచి రామునికి తను పెళ్లి లో చేసిన లాజహోమం తోచింది, వెంటనే జనకుని జ్ఞాపకం వచ్చి యిలా అనుకున్నాడు.

"మందో వక్ష్యే కిమితి జనకం కిన్ను యోగీశ్వరోమాం"

రామాయణంలోనూ యిలాంటి తలపే రాముని వేధిస్తుంది, అందుకే లక్ష్మణునితో అంటాడు—

"నివృత్తవనవాసశ్చ జనకం మిథిలాధిపం।
కుశలం పరిపృచ్ఛంతం కథం వక్ష్యే నిరీక్షితం
కిన్ను వక్ష్యామి రాజానం ధర్మజ్ఞం సత్యవాదినం"

సీతజాడలు కనిపించనప్పుడు యిలాంటి తలపులు కలగటం సహజమూ, ఉచితమూ. అందుకే వీటికి సందేశంలో స్థానం దొరికింది.

వానకారులో మయూరాన్ని చూడటమే కష్టమనిపించేది రామునికి. అది యీడుజోడుగా జంటకట్టి విహరిస్తుందంటే, విహరించదూ మరీ?—దానివరకూ రాక్షసులంటూ వుంటేగా! (రక్షఃపీడారహితదయితాశ్లేషధన్యో మయూరః) రామాయణంలోనూ యింతే. (మయూరస్య వనే నూనం రక్షసా న హృతా ప్రియా: తస్మా న్నృత్యతి రమ్యేషు వనేషు సహ కాంతయా.)

ఇన్ని కష్టాల్లోనూ రామునికి దుఃఖోపశమనం కలిగించేది ఒక్కటే—భౌతికంగా సీతకూ తనకూ ఎంతో అంతరం వున్నా, కదలిపోయిన మధురజీవితంలో తనకూ ఆమెకూ ఎన్నో ముద్దులచేతలు వుమ్మడిగా వుండబట్టి, మానసికంగా సీత యెన్నడూ పార్శ్వవర్తే తనకు.

"దేహస్పర్శం మలయపవనే దృష్టిసంభేద మిందౌ
ధామైకత్వం జగతి భువి చాభిన్నపర్యంకయోగం
తారాచిత్రే వియతి వితతిం శ్రీవితానస్య పశ్యన్
దూరీభూతాం సుతను విధినా త్వామహం నిర్విశామి."

పాపం కాళిదాసుని యక్షునికి యింతమాత్రపు ఓదార్పైనా లేకపోయింది. ప్రేయసిపోలికలు ప్రకృతిలో అక్కడక్కడా కనిపించినా, అన్నీ ఒక్కచోటే వుండవుగా అని వానివేదువు (హంతైకస్మిన్ క్వచిదపినతే చండి సాదృశ్య మస్తి).

అన్నిటికన్నా పెద్ద దుఃఖం—తనవెంట కారడవికి కోరి వచ్చిన సీత, తన కౌగిట్లో కళ్లమూసి సుఖించక ఎక్కడో, దూరదేశంలో ఆ రక్కసిమూకల్లో దిక్కుమాలి ఏడుస్తోందే అని.

"తాతాదేశా త్సపది భరతే న్యస్తరాజ్యాభిషేకం
యా మా మేకా వన మనుగతా రాజధానీం విహాయ
తామేవ త్వా ముచితశయనాం బాహుమధ్యే మదీయే
దూరేకృత్వా గుణవతి ముహు ర్ధూయతే జీవితం మే"

ఈవృత్తంలో వేంకటనాథుడు వాల్మీకిమాటలే కొన్ని వాడుకున్నాడు.

"యా మా మనుగతా మందం పిత్రా ప్రవ్రాజితం వనం
తయా విహీనః కృపణః కథం లక్ష్మణ ధారయే".

దూత వెంటనే తానూ గొప్ప వానరసైన్యంతోటి వస్తున్నాడనీ, ఆగామి సంగ్రామంలో లక్ష్మణుని జ్యాటంకృతి ఆమెకు కర్ణానందం కలిగిస్తుందనీ అంటాడు సందేశంలో రాముడు.(రామాయణంలోని సందేశంలోనూ దాదాపు యిలాంటిదే వుంది—

"క్షిప్రం ద్రక్ష్యసి రాఘవం
లక్ష్మణంచ ధనుష్పాణిం లంకాద్వార ముపస్థితమ్.
అల్పీయోభి స్సుముఖి దివసై ర్యోధయన్యాతుధానాన్
కర్ణే శీధుం తవ రచయితా లక్ష్మణ శ్చాపఘోషైః"

కష్టాలన్నీ దాటి, గద్దెక్కి, మళ్లీ సింహాసనం అధిష్ఠించిం తర్వాత తాము అనుభవించబోయే భావిసౌఖ్యాల సూచనతో సందేశాంతం అవుతుంది—

"సిద్ధారంభే సపది భవతా మాధిరాజ్యాభిషేకాత్
సంప్రాప్స్యేవ శ్చిరవిరహిత స్సంచితాన్ దేవి భోగాన్."

యక్షుడూ తన సందేశాన్నిలాగే ముగిస్తాడు.

"పశ్చా దావాం విరహగుణితం తంత మాత్మాభిలాషం
నిర్వేక్ష్యావః పరిణత శరచ్చంద్రికాసు క్షపాసు."

సందేశం వాస్తవమైనదేనని సీతకు రూఢిపరచటానికని—ఆమెకు చెప్పమని - ఖరదూషణవధానంతరం తనకూ ఆమెకూ జరిగిన ఒక రహస్యవృత్తం హంసకు చెప్పుతాడు రాముడు. యక్షుడూ యిలాగే రహస్యమైన ఒక స్వప్నవృత్తాంతం దూతవశం చేస్తాడు.

హంస తప్పకుండా సీతకు సందేశాన్ని అందిస్తుందని రాముని విశ్వాసం. ఎందుకంటే నలునికీ దమయంతికీ తోడ్పడిందీ ఒక హంసేగా?

"ప్రాగ ప్యేవం పరిణతగుణాం నైషధే వీక్ష్యవార్తా
మార్తత్రాణం వ్రతమితి విదు ర్హంత శుద్ధాత్మనాం వః"

యక్షుని నమ్మికా యిలాంటిదే—

నిశ్శబ్దోఽపి ప్రదిశసి జలం యాచిత శ్చాతకేభ్యః
ప్రత్యుక్తంహి ప్రణయిషు సతా మీప్సితార్థక్రియైవ."

దూత్యం నెరవేటందుకు హంస బైలుదేరేముందు దానికి రాము డిచ్చిన దీవన యిది—

"స్వైరం లోకాన్ విచర నిఖిలాన్ సౌమ్య లక్ష్మ్యేవవిష్ణుః
సర్వాకారై స్త్వదనుగుణయా సేవితో రాజహంస్యా."

యక్షుడిచ్చిన దీవన యింతకంటే మేలనిపిస్తుంది, విరహమంటే ఏమిటో తను తెలుసుకున్నాడు కాబట్టి,

"మాభూ దేవం క్షణమపి చ తే విద్యుతా విప్రయోగః"

అంటాడు.

హంససందేశంలో అక్కడక్కడ వ్యాకరణ—దోషాలనకూడదేమో-విశేషాలు కొన్ని వున్నై. మహాకవులందరూ భాషావిషయంలో యిలాంటి—వైయాకరణులు ఆమోదించని—స్వాతంత్ర్యం క్వాచిత్కంగా ప్రదర్శించేవున్నారు. ఈ ప్రయోగాలకు భాషలో కాలక్రమేణా ఒక పూజ్యస్థానం యేర్పడిపోయింది. ఇవి వ్యాకరణానికి అతీతమైనవి. (మహాకవి ప్రయోగాః). పాణిని వ్రాశాడన్న ప్రతీతి గల కావ్యంలోనూ యిలాంటి స్వాతంత్ర్యం కవబడుతుంది. కాళిదాసు ప్రయోగాలూ వున్నవి. రఘువంశంలో 'దశపూర్వరథం యమాఖ్యయా' అన్నాముకదా ఆని మేఘసందేశంలో 'దేవపూర్వగిరిం తే' (I-42) అని వాదాదు. రఘువంశప్రయోగం శిష్టం. ఎందుకంటే అక్కడ అది సూచించేది నామం; వస్తువు కాదు. కాని, మేఘసందేశంలో అది వస్తుసూచకం. కాబట్టే, మల్లినాథుడుకూడా యీ ప్రయోగాన్ని సమర్థించలేదు. అంచేత హంససందేశంలోని విశేషప్రయోగాలు సమకూర్చటంలో వేంకటనాథునికి గౌరవహాని రానేరాదు. అయితే ఒకటి-కాళిదాసు రచనలోకంటే మన కవి కృతిలో యివి కాస్త యెక్కువ. మైసూరు పరకాళస్వాములవారివంటి మహావ్యాఖ్యాతలు యీప్రయోగాల్ని సమర్థించేవున్నారు.

తీర్థే పుంసాం శమితకలుషే" (I-30)

ఇక్కడ 'పుంసాం' అన్నది 'కలుషే' అన్నమాటకు అన్వయిస్తుందే కాని 'శమితకలుషే' అన్న సమాసానికి గాదు. దీనికే 'ఏకదోషాన్వయః' అని పేరు (I-39) లో యిలాంటిదే మరోప్రయోగం వుంది.

"యుగ్మం నైషై ర్దివి సుమనసాం సేవ్యమానం విమానైః" (II-6).

"కమలముకుళే లీయతాం షట్పదానాం" (II-26)

"వదనకమలం మందమున్నమ్య భీరుః" (II-29)

"కుసుమ ధనుషః చిత్రపుంఖైః" (II-35)

"రామస్త్రాసా దనమితధనుః" (II-35)

కాళిదాసుని మేఘసందేశంతో పోల్చుకుంటూ వేంకటనాథుని హంససందేశాన్ని పరిశీలించాం. కావ్యనిర్మాణం విషయంలోనూ, అక్కడక్కడ అంగాంగాలు తీర్చిదిద్దటంలోనూ వేంకటనాథుడు కాళిదాసుకు ఎంతవరకూ ఋణపడ్డాదో చూచాం. మరి, కొన్నికొన్నిభావాలకు కవి వాల్మీకిమీద యెలా ఆధారాపడ్డాడో స్పష్టమైంది. ఇంతకన్నా యెక్కువగా యెన్నో సన్నివేశాల్లో కవి ప్రతిభనూ, భావనాబలాన్నీ చూచి ఆనందించాం. ఒక్క కావ్యాన్ని విమర్శించి, దానికి విలువ కట్టేటప్పుడు వీలైనంతవరకూ కవిని దూరంగా వుంచటమూ, మరిచిపోవటమూకూడా మంచిదే. హంససందేశంలోని కవితా, భాషా మేఘసందేశంలోనివాటికి తీసిపోలేదు. ఈ విషయం రుజువుపరచటానికి యీవ్యాసంలో వుదాహరించిన వృత్తాలే చాలు. కానీ, మొదటనే నేనన్నట్టు, అన్ని విషయాలూ చూస్తే, మొత్తంమీద, హంససందేశం కాళిదాసుని కృతికి తరువాతిదే. అట్లని, కవికి వున్న గౌరవం పోదు, వేదాంతవిషయికమైనవీ, సాహిత్యవిషయికమైనవీ దాదాపు వందకుమించిన ఉద్గ్రంథాలు రచించిన శ్రీ వెంకటనాథుని కీర్తి హంససందేశం మూలాన్ని ద్విగుణీకృతమే అవుతుంది.



# మీకు బాగా యిష్టమైన ఆహారములను మీకు అధికశక్తి నొసంగునట్లు చేసుకోండి!




మనకు ప్రియమైన కొన్ని ఆహార పదార్థములు మన ఆరోగ్యమున కేమాత్రము మంచివికావన్న విషయం మీకసలు తెలుసా? అవి ఆకలిమాత్రము తీరుస్తవి — గాని మనము పనిపాట్లవల్ల కోల్పోవుచున్న శక్తినైనా తిర్గి యివ్వజాలవు. ఇది బాగా ఆలోచించ వలసిన విషయమే సుమా; ఏమంటారు? మన ఆరోగ్యము. సంతోషము, పనితనము, యివి అన్నియు మన శక్తిమీద ఆధారపడి వున్నప్పుడు, మనం తినే ఆహారం పూర్తిగా బలాన్ని చేకూర్చలేకపోతే, మనం ఎప్పుడో ఒకప్పుడు మూల పడవలసిందేగా మరీ.

అన్ని పదార్థములు యేదో కొంతవరకు బలాన్ని చేకూర్చగలవు. కాని మనం నిత్యం తినే వాటిలో కొన్ని బలము యేమాత్రము యివ్వలేవనే చెప్పాలి. అటువంటప్పుడు యీ రకపు ఆహార పదార్థములను మంచి పుష్టినివ్వగల యితర పదార్థములతో కలపటంవలన బలము వృద్ధిచేసుకో వచ్చును. ఆహారమును విటమిన్లతోనిండిన డాల్డాతో వండినయెడల దీనికి బాగా తోడ్పడుతుంది. ప్రకృతి సిద్ధముగా బలమును, ఆరోగ్యమును, చేకూర్చగల శక్తి డాల్డా మీకు యివ్వగలదు. డాల్డాతో వండటం చాల మంచి పద్ధతి — మనకు క్షేమకరము.



ప్రతి గృహిణి ఏ ఆహార పదార్థములు శక్తి నిచ్చునవో తెలుసి కొనవలెను. డాల్డా పాకశాస్త్రమను పుస్తకము (ఇంగ్లీషులో అచ్చువేయ బడినది) 150 ఇండియన్ వివిధ తినుబండారములు తయారుచేయు పద్ధతులతో కూడినది. మిక్కిలి వుపయోగకరమైన విషయములు గలవు. మీకు ఒక కాపీ వుండుట ముఖ్యావసరము. 4 అణాల బిళ్లలు *Dept.* C110 *P. O. Box No.* 353, *Bombay*, పంపుడు.




**విటమిన్లతోనిండిన**

**బలమునకు**

MVM. 34-23-40 TL

THE HINDUSTAN VANASPATI MANUFACTURING CO., L

# సౌందర్యముయొక్క ప్రాముఖ్యత నిలబెట్టుట

ముఖ్యమైన అన్ని విషయాలలో వనితలకు చిన్నతనములో తమ తల్లులకంటె మంచి సలహాను ఎవరు యివ్వలేరు. ఈ తల్లి తనకుమార్తెకు ముఖ్యముగా బోధించినదేమంటే, పియర్సు సబ్బు నిర్మలమైన నీటితో తన చర్మసౌందర్యమును నిలబెట్టుకొనుటయే. ఈ పద్ధతిని తన తల్లివద్దనుంచి నేర్చుకొని అనుసరించుచున్నది. ఇదే ఆమె సౌందర్యము చెడకుండా వుండుటకు కారణము. తన కుమార్తెకూడా యీ విధంగానే చేయుచున్నది. కనుక ఆమెయొక్క సౌందర్యము కూడా ఏమాత్రము చెడకుండా వుంటుంది.

ఇండియాలో నలభై సంవత్సరములనుంచి అందమైన స్త్రీలు ప్రత్యేకముగా పియర్సునే వాడుచున్నారు. దీని పరిమళము, మృదువైన నురుగు దీనికి సబ్బులలో ప్రాముఖ్యత నిచ్చినవి.




## పియర్సు సబ్బు

శాశ్వతముగా సౌందర్యమును కాపాడుటకు

39-172 TL

A. & F. PEARS, ISLEWORTH, ENGLAND

# శివకవి యథావాక్కుల అన్నమయ్య

౨



= శ్రీ నిడుదవోలు వేంకటరావు =

అన్నమయ్యకృతియందు పండ్రెండవ, పదమూఁడవ శతాబ్దముల నాంధ్రదేశమున వెలసిన వీరశైవమతము ప్రతిపాద్యమైనది. అన్నమయ్య యాంధ్ర వీరశైవమతమున పండితసంప్రదాయమని పేర్వడసిన యారాధ్యసంప్రదాయమునకుఁ జెందినవాఁడు. కావుననే తత్సంప్రదాయప్రవర్తకులగు మల్లికార్జునపండిత పాల్కురికిసోమనాథుల గ్రంథములనుండి భావముల నేర్చి వారివాక్యములనే యథాక్రమమున ననుసరింపుచు, వలసినయెడల విపులీకరించుచు నీలఘుకృతిని రచించినాఁడు.

అన్నమయ్య పండితారాధ్యుల పాల్కురికి సోమనాథుల గ్రంథములనేగాక, శైవులకుఁ బారాయణగ్రంథములగు శివపంచస్తవముల (మహిమ్నము, మల్హాణము, మలయరాజీయము, అనామయము, హాలాయుధము)నుండియు భావముల నేర్చినాఁడు. ఈ స్తవములు పండితారాధ్యులు లింగార్చనాసమయముననుు, శివరాత్రియందు శ్రీశైలమున భక్తులును పఠించుచున్నట్లు సోమనాథుఁడు పండితారాధ్యచరిత్రమునఁ జెప్పియున్నాఁడు. కావున నీశివస్తవములును నన్నమయ్య కృతికి మూలములని చెప్పనొప్పును.

అన్నమయ్య యీ కృతియందు నిరూపించినది యారాధ్యసంప్రదాయికమగు సవైదిక వీర శైవమే యైనను, నిందుముక్తికి పరిశుద్ధమైన భక్తియోగము సాధనమనియు, భూతసేవాపరమైనజంగమభక్తియోగము మూలసాధన మనియు నిరూపింపఁబడినది. విధ్యుక్తకర్మల నాచరించుచు గురులింగజంగమజ్ఞానసంపత్తిఁ బడసి, తత్సేవాధర్మముల నిర్వర్తింపుచు, నిశ్చలభక్తియోగమున ధ్యానమార్గమున శివానందము భక్తుఁ డనుభవించు నని యన్నమయ్య యిందు వివరించినాఁడు. మఱియు కర్మ, భక్తి, జ్ఞాన, ధ్యానమార్గములను నాల్గు యోగములలో భక్తియోగమే దక్కినవానికిఁ బ్రాణ మని భక్తియోగప్రకృష్టతను నిర్వచించినాఁడు.

సహజైకభక్తినిష్ఠాపరతంత్రుఁడగు భక్తునకు బాహిరములగు కేవలప్రకృతివిషయములఁ గూర్చిగాని యన్యదేవతావిషయముగాని యవసరమే యుండదు. కావుననే యన్నమయ్యకృతియందు, పండితారాధ్యులు శివతత్త్వసారమున వివరించిన, శివాపచారులను జంపవచ్చును, శివభక్తునకు పరలోకవిధులు వలదు, శివభక్తు లేవిధముగ ప్రవర్తించినా పూజ్యులు మున్నగు శివభక్తియోగమునకు సంబంధించినలౌకికవిషయములు కన్పట్టవు. మఱియు పాల్కురికి సోమనాథుని గ్రంథములయందు శివభక్త్యుద్రేకమున నచ్చటచ్చట కన్పట్టు నన్యదేవతాదూషణము, బ్రాహ్మణనింద మున్నగు విషయము లిం దేమాత్రమును కన్పట్టవు. అన్నమయ్య కృతియం దెచ్చట చూచినను, శివమహత్త్వము, భక్తి నిశ్చలత, శాంత, సాత్త్విక, వైరాగ్యప్రవృత్తి యుద్దీపించుచున్నది.

ఇట్టి భక్తియోగనిర్వచనము ననుసరించి యన్నమయ్య తనకు ముందు గల శైవగ్రంథముల ననుసరించె ననియు, తన్నిర్వచనమునకు వలయు భావము లందుండి గ్రహించెననియు, తాను ప్రత్యేకముగఁ జెప్పఁదలఁచిన విషయముగూర్చి యాయా గ్రంథములలోని భావములను విపులీకరించె ననియు, ముందు చూపఁబోవు నుదాహృతులఁబట్టి తెలియనగును. తా ననేకగ్రంథములు శోధించియే యీకృతినిరచియించిన ట్లన్నమయ్య యిట్లు చెప్పియున్నాఁడు.

"ధాత్రిం భక్తజనానురంజకముగాఁ
దత్త్వప్రకాశంబుగా
చిత్రార్థాంచితశబ్దబంధురముగా
సేవ్యంబుగా, సజ్జన
స్తోత్రానందముగా శుభాన్వితముగా
శోధించి సర్వేశ్వర
స్తోత్రం బన్నయ చెప్పె యిజ్జగములో
శోభిల్ల సర్వేశ్వరా! (౧౩౩ ప.)

అన్నమయ్య సర్వేశ్వర శతకమునకుఁ బూర్వము చూపిన మూలములలో సంస్కృతమున మహిమ్నము, మల్హణము, అనామయము, హలాయుధము నను స్తవములు, మల్లికార్జునుని శివతత్త్వసారము, పాల్కురికి సోమనాథుని గ్రంథములు (అనుభవసారము, పండితారాధ్య చరిత్రము) నని చెప్పనగును.

అన్నమయ్య స్తోత్రములలో ముఖ్యముగ మహిమ్నమునుండి పెక్కు భావముల నిందు కూర్చినాఁడు. వానిఁ గూర్చి తొలుత తెలిపెదను.

మహిమ్నమునుండి (సంస్కృతమున పుష్పదంత రచితము.)

"బహుళరజసే విశ్వోత్పత్తౌ భవాయ నమోనమో
జనసుఖకృతే సత్త్వోత్పత్తౌ మృడాయ నమోనమః
ప్రబలతమసే తత్సంహారే హరాయ నమోనమః
ప్రమహసిపదే నిస్త్రైగుణ్యే శివాయ నమోనమః. (౩౧)

"భువనోత్పత్తి విధించుచో భవుఁడవై
పాల్పొందఁగా దాని ను
త్సవలీలం బ్రభవించుచో మృడుఁడవై
సర్వంబు గల్పాంత భై
రవసంక్షోభ నటించుచో హరుఁడవై
త్రైగుణ్యశక్తిం దుదిన్.
శివనామాంకముఁ దాల్చు నీ మహిమ దాఁ
జిత్రంబు సర్వేశ్వరా!" (౧౦౦)

"హరి స్తే సాహస్రం కమలబలి మాధాయ పదయో
ర్యదేకోనే తస్మిన్ నిజ ముదహరన్ నేత్రకమలం
గతో భక్త్యుద్రేక పరిణతి మసౌ చక్రవపుషా
త్రయాణాం రక్షాయై త్రిపురహర జాగర్తి జగతాం." (౧౯)

"సమయోద్దిష్టసహస్రపంకరుహ పూ
జాపూరణార్థంబు నే
త్రము విష్ణుండు సుభక్తి యేర్పడ భవ
త్పాదంబు లర్చించి చ
క్రము నీచేఁ గొని దైత్యకోటి ననిలో
ఖండించె దానీపద
క్రమతానేవ సమస్తదేవతలకు
న్సత్త్వంబు సర్వేశ్వరా." (౧౩౭)

మఱియు సర్వేశ్వరశతకమున ౩, ౧౩, ౧౪, ౧౭, ౧౫, ౯౬, ౯౭ పద్యము లన్నియు మహిమ్న స్తవానుసరణములు. విస్తరభీతి నుదాహరింపనైతిని.

మల్హణము (మల్హణకవిరచితము.)

శ్లో. "బాలోపి సంస్మరణమాత్ర మచేతన స్తే
లింగం కరోతి హరపాంసుమయం వినోదాత్
అత్యంతదేశధనధాన్య సమృద్ధిభాజి
రాజ్యం కరోషి హతకంటక మున్నతంచ" (౩౪)
"క్రీడాప్రపంచనిరతా శ్శిశవో భవంత
మారాధయంతి......" (౧౭)

అను శ్లోకభావములును మూఁడునాల్గు పాదములలో మార్చి యీక్రిందిపద్యము రచింపఁబడినవి.

"ఆడంబోయిన చోట బాలురు వినో
దార్థంబు పాషాణముల్
గూడంబెట్టి శివాలయం బనుచు పే
ర్కొన్న నతటంజేసి వా
రాడంబోయి సురాంగనాకలితది
వ్యారామచింతామణి
క్రీడాశైలవిహారులై వెలయుటల్
గీర్తింతు సర్వేశ్వరా!" (౧౨౭)

అనామయము - దండిమహాకవిరచితము.

శ్లో. "యోగీ భోగీ విషభుగమృతశ్శస్త్రపాణి స్తపస్వీ
శాంతః క్రూర శ్శమితవిషయ శ్శైలకన్యాసహాయః

భిక్షావృత్తి స్త్రిభువనపతిః కృత్తిమా నస్థిమాలీ
శక్యో జ్ఞాతుం కథమివ శివ త్వం విరుద్ధస్వభావః"

"సకలాధీశ్వర పట్టభద్రుఁడవు భి
క్షాగామి వత్యంతశాం
తకళాత్ముండవు, రౌద్రమూర్తి, పతిసాం
దర్యాంబికా సంగమా
ధికలోలుండవు దివ్యయోగివి మదిం
దెల్లంబుగా నెట్టివా
రికి దా శక్యమె నీనిజం బరసి చ
ర్చింపంగ సర్వేశ్వరా!"

**హాలాయుధము - హాలాయుధ విరచితము -**

శ్లో. "యత్ప్రత్యక్షం సకలభువనాశ్చర్యభూతం విభాతి
జ్యోతిర్లింగం కనకకపిశం శ్రీగిరౌ వ్యోమ్ని దివ్యం
తత్పశ్యంతః శివసుకృతిన స్త్యక్తసంసారబంధా
స్త్వత్తారుణ్యా చ్చిరగణపదప్రాప్తిభాజో భవంతి."

"ధరణిం బ్రాక్తనభక్తనిర్మితమహా
స్థానంబులై యొప్పు శ్రీ
గిరిముఖ్యంబగు దివ్యతీర్థముల భ
క్తిం జూచిరే వారి దు
స్తరదోషంబులు వాయు నన్న మఱి సా
క్షాద్భక్తులం జూచినం
బరమార్థంబుగఁ బాయదే నరుల పా
పంబెల్ల సర్వేశ్వరా!" (౨౫)

మరియు నిందు ౯౭, ౯౫, ౧౩౮ పద్యముల భావములును హాలాయుధస్తవమునుండి గైకొనఁబడినవి.

మల్లికార్జునపండితుని శివతత్త్వసారమునుండి భావములకు విపులీకరణములు.

## శివతత్త్వసారము

"ఏదేశంబున నేపురి
నేదెస వసియించియుండు నిల శివభక్తుం
డాదేశంబున నాపురి
నాదెస వసియించియుండు హరతీర్థంబుల్" (౨౦౭)

## సర్వేశ్వరశతకము

"ఏదేశంబున నేదిశాముఖమునం
దేయూర నేవాడ మీ
పాదాభ్యర్చన సేయు నిర్మలుఁడు స
ద్భక్తుం డొకండుండు నా
యాదేశంబును నాదిశాముఖమును
న్నాయూరు నావాడ గం
గాదిస్నానసదీప్రవాహఫలదం
బై యొప్పు సర్వేశ్వరా! (౧౯౯)

"వేదవిదులైన కోటిమ
హీదేవోత్తములు గుడిచియిచ్చు ఫలం బా
హ్లాదంబుగ శివయోగికి
నాదట భిక్షంబు పెట్టినంతన పొందున్" (౨౭౩)

"సుముఖుండై శివయోగిమోదము మదిన్
శోభిల్లఁ జేకొన్న భి
క్షము విప్రోత్తమకోటిభోజనసదృ
క్షంబన్న సౌభాగ్యయో
గమునం దారయ నమ్మహామహుఁడు వే
డ్కం గోరి యారోగిణం
బమరం జేసిన పుణ్యమెట్లుగురిసే
యన్వచ్చు సర్వేశ్వరా!"

"ఎచ్చో నీపదభక్తు డుండు మదినిం
పెక్కం బ్రయత్నంబుతో
నచ్చో నీ వనిశంబు నుండుదు త్వదీ
యధ్యానచిన్మూర్తులై
అచ్చో సన్మునులెల్ల నుండుదురు మం
త్రాంగాక్షరాయుక్తులై
అచ్చో తీర్థములెల్ల నుండునిది వే
దార్థంబు సర్వేశ్వరా!"

"జలజాసనాచ్యుతాద్యమ
రులకును [నిదియిట్టిదని] నిరూపింప(ఁగ) న
గ్గలమగు నీనిజరూపముఁ
దొలఁగక నీభక్తులెఱుఁగుదురు సర్వజ్ఞా!"

"జలజాతప్రభవాచ్యుతాదులుమదిం
జర్చించి చర్చించి నీ
కలరూపారయలేక చిక్కులబడం
గా నిన్ను హస్తార్పితా
మలకవ్యాప్తికిఁ దెచ్చి యేర్పఱచి సం
బంధించి చేకొన్నభ
క్తుల శౌర్యం బుపమింపనెవ్వఁడు సమ
ర్థుం డింక సర్వేశ్వరా!"

శివతత్త్వసారమునందలి ౧౫౯, ౧౬౧, ౧౬౨, ౪౬౭, ౪౬౯, ౪౭౦ పద్యముల ననుసరించి సర్వేశ్వర శతకమున ౨౧, ౧౦౧, ౧౨౨, ౧౨౩ పద్యము లనుస్మృతులు.

శివతత్త్వసారములోని పద్యములు సోమనాథుని పండితారాధ్యచరిత్రమున ద్విపదరూపము దాల్చినను, అన్నమయ్య యాయాపద్యభావములను సోమనాథుని గ్రంథములనుండియే గ్రహించె ననియు, శివతత్త్వసారానుకరణముకంటె పాల్కురికి సోమనాథుని గ్రంథములకును, నన్నమయ్యకృతికిని స్పష్టముగను నధికతరముగను శబ్దభావసాదృశ్యము లనుకరణము లున్నట్లీక్రింది యుదాహృతులనుబట్టి యెఱుఁగనగును.

## విపులీకరణములు

సోమనాథుఁడు :—

"దృష్టంబు మఱియును దేవాళ్చ పశవ
స్సృష్టా యనఁగ శ్రుతిదృష్టంబులుగను
కౌన యీశుండు జగత్సృష్టికర్త
.........తనదు గర్భాంబుధిలోన
జనియించు బుద్బుదజాలంబులట్ల
నెనయంగ లింగమధ్యే జగత్సర్వ
మనఁగ తన్మధ్యంబునంద కావించు:"

(పండితవాదప్రకరణము, ౫౩౦ పుట.)

అన్నమయ్య :—

"జలజాతప్రభవాండ బుద్బుదము
లక్షాంతంబునుం బుట్టుచుం
గలయం గ్రాఁగుచునుండు నీ పృథుల
లింగస్ఫారగర్భాబ్ధిలో
పలఁ దద్బుద్బుదగర్భవాసులు
హరి బ్రహ్మాదిదేవాళియుం
గలదే వారికి నీమహత్త్వ మెఱు
గంగా శక్తి సర్వేశ్వరా."

(౭ పద్యము.)

సోమనాథుఁడు :—

"కాలగళుం డుండ కాలంబునకును
హరునియాజ్ఞాశక్తి యనుటయుగాక
పరమకర్తృక మెద్ది పరికించిచూఁడ."

(పండిత వాదప్రకరణము ౫౫౧ పుట.)

అన్నమయ్య :—

భువనాండంబులు రత్నకాంగములుగాఁ
బుట్టించు నత్యద్భుతో
త్సవలీలావిభవంబుతోడ భవదా
జ్ఞాశక్తి సర్వేశ్వరా !

(ఈయాజ్ఞాశక్తి విషయము ప్రత్యేక శీర్షికగా గ్రంథమునఁ గలదు.)

సోమనాథుఁడు :—

ఏచి విష్ణుండు దధీచిపై నలిగి
వైచుడు బడివిగ్గె వరచక్ర మపుడ
తుత్తుమురగుడు దైత్యులు విజృంభింప.

(పండిత మహిమ ౧౦౩ పుట.)

అన్నమయ్య :—

కింకం దన్ను నదల్చి చక్రమున దాఁ
గృష్ణుం డని పై వ్రేచినం
బొంకం బొప్పఁగ దానిఁ
దుత్తుమురుగాఁ బోఁదట్టి యుప్పొంగె ని
శ్శంకాత్ముండు దధీచి శాశ్వతులు నీ
సద్భక్తు లూహింపఁగా
సంకల్ప ప్రభవప్రతాప వన
భాస్వద్భావ సర్వేశ్వరా !

(౪౩ పద్యము.)

సోమనాథుఁడు:—

తలఁప "వేదాశ్చ శాస్త్రాణి" యనంగ
నిల నుపమంత్రి రనేకధా యనఁగ
తఱితఱి శ్రుతులు శాస్త్రములు మంత్రములు
నెఱి పుర స్తత్రైవ నిర్గతా యనఁగ
బరగుచు సకలశబ్దప్రపంచంబు
వరుస నట్ల యథా శివ స్తథా యనఁగ
నడఁగు జనించు పంచాక్షరియందు.

(మహిమ ౧౮౪ పుట.)

అన్నమయ్య:—

అమితోద్యద్భవదీయ తత్త్వము మహీ
యస్తోత్ర వాణీవిలా
సములై యొప్పు సమస్తవేదములు శా
స్త్రశ్రేణియుఁ దివ్య వి
భ్రమనాదంబులు నెన్నిచూడనివి నీ
పంచాక్షరీ మంత్ర భా
వములై యుండు సమస్త లక్షణముల
న్వర్ణింప సర్వేశ్వరా!

సోమనాథుఁడు :—

అటుగాక యీపుష్ప మంతయు నొకఁడు
పటుభక్తి మీపదాబ్జములపైఁ బూన్ప
మఱి పూర్వజన్మసమాధులు లేని
నెఱిముక్తి గలిగింపు నిజమట్లుగాక.

(పర్వత ౪౯౦ పుట.)

అన్నమయ్య :—

ఒక పుష్పంబు భవత్పదద్వయము పై
నొప్పంగ సద్భక్తి రం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికి పున
ర్జన్మంబు లేదన్నఁ బా
యక కాలత్రితయోపచారముల ని
న్నర్చించుచోఁ బెద్ద నై
ష్ఠికుఁడై యుండెడువాఁడు నీవగుటఁ దా
జిత్రంబె సర్వేశ్వరా!

సోమనాథుఁడు:—

...............పరివార
దేవతలును వాసుదేవవిరించి
రవిగజాస్యగుహభైరవమాతృకాది
దివిజగణంబు నందియు నట్లయుండ.

(పండిత. మహిమ. ౧౧౩ పుట)

అన్నమయ్య:—

ఇనవిఘ్నేశ్వరమాతృకాద్రుహిణబ్రా
హ్మీస్కందదుర్గారమా
వనితాధీశ్వరభైరవుల్ బలసి భా
స్వద్భక్తిసంయుక్తినీ
కనిశంబుం బరివారభృత్యనికరం
బైరన్న నిన్నింకఁ గొ
ల్వనివా రెవ్వ రజాండభాండములలో
వర్ణింప సర్వేశ్వరా!

సోమనాథుఁడు:—

సకలేశు భక్తుల చరణోదకంబు
సకలతీర్థములకు జనయిత్రి యనియు
పలుతీర్థములఁ గ్రుంకబఱచుటకంటె
నిల భక్తపాదాంబువులు గొను టుఱవు
నెట్లన్న తీర్థంబు లేగుట భార
మట్లును గాక స్వర్గాదిఫలంబు
లారుద్రభక్తపాదాంబువుల్ ద్రావ
భార మేమియు లేదు ప్రాపించు ముక్తి.

(పండిత. పురాతనప్రకరణము, ౨౪౭ పుట)

అన్నమయ్య:—

పలుతీర్థంబులఁ గ్రుంకుకంటె మహిలో
భక్తాంఘ్రిపానీయముల్
తలమీఁదం జిలికించుకోఁదగును తీ
ర్థంబాడ భారంబు త
త్ఫల మత్యల్పము భక్తపాదయుగళాం
భస్స్పర్శనిర్భరమై
యలరుఁ శాశ్వతభుక్తిముక్తిఫలదం
బైయుండు సర్వేశ్వరా!

సోమనాథుఁడు:—

మాతయై కొనియాడు మహి గురుభక్తి
భ్రాతయై ప్రాపగు పటుగురుభక్తి
తాతయై శిక్షించుఁ దా గురుభక్తి
దాతయై రక్షించుఁ దగ గురుభక్తి
వైద్యుఁడై రుజబాపు వరగురుభక్తి
ఆద్యుఁడై బోధించునది గురుభక్తి.

(పురాతనప్రకరణము, ౩౨౦ పుట)

అన్నమయ్య:—

పెంపం దల్లి యగున్ రుజాపటలదు
ష్పీడావిధిక్షోభ వా
రింపన్ వైద్యుఁడగున్ కుమార్గవిధులం
గ్రీడింపబోకుండ శి
క్షింపం బల్లిదుఁడైన తండ్రియగుచున్
శ్రీమంతుగా నెంతయున్
సంపద్వృద్ధియొనర్పదాతయగు నీ
సద్భక్తి సర్వేశ్వరా!

సోమనాథుఁడు:—

జంగమభక్తిలింగపరి
చర్యల మీఱుట యుత్తమంబు త
జ్జంగమలింగపూజ లవి
సామ్యముసల్పుట మధ్యమంబు మున్
జంగమలింగపూజ యెడ
సల్పక లింగము గొల్చు చున్కి యె
న్నంగఁ గనిష్ఠమాట శర
ణప్రతిపత్తియెముఖ్య మెమ్మెయిన్.

(అనుభవసారము, ౨౧౪ పద్యము)

అన్నమయ్య:—

తమ లింగార్చనకంటె జంగమము సొం
దర్యంబుగాఁ గొల్చు టు
త్తమభక్తిస్థితి, లింగజంగమలస
త్సామ్యంబుగాఁజేత మ
ధ్యమభక్తిస్థితి లింగపూజ నధికం
బై జంగమోపాసనా
క్షముఁడైయుండుట భక్తియందదికని
ష్ఠత్వంబు సర్వేశ్వరా!

సోమనాథుఁడు:—

జంగమపరాఙ్ముఖుండై
లింగార్చన సేయునతని లీలఁ దలిర్పన్
వెంగలియై శవమునకును
శృంగారము చేసినట్లు శివభక్తినిధీ!

(అ. సా. ౨౧౯)

అన్నమయ్య:—

లింగారాధన జంగమార్చనము లో
లిం భక్తికంగంబుప్రా
ణాంగవ్యాప్తియునై స్ఫురించు నిది త
త్త్వార్థంబగుంగాక నా
యంగాభ్యర్చనజంగమాహితకరుం
డైచేసినం దా శవ
శృంగారంబగువానిభక్తితుదిఁజ
ర్చింపంగ సర్వేశ్వరా!

పైభావము పండితారాధ్యచరిత్రమున నున్నను, శబ్దసాదృశ్యమునుబట్టి యనుభవసారమునుండి గ్రహింపఁబడినది. ఇందు చివఱిపాదమున 'శవశృంగారము' అనుచో గణభంగమైనను, కవి పూర్వగ్రంథములోని వాక్యములు యథాక్రమముగ ననుసరింపవలెనుగావున నీవిషయము పాటింపలేదు. ఇది యన్నమయ్యకుఁ గల సోమనాథకృత్యనుకరణాభిమానమేగాక శైవకవి సంప్రదాయాభిజ్ఞతయుఁ దెలుపుచున్నది.

సోమనాథుని వాక్యములనే యుపయోగించి శ్రీనాథుఁడు పండితారాధ్యచరిత్రమును రచించినాఁడు. పిడుపర్తి సోమనాథుఁ డీవిషయమై సాక్ష్యమొసగుటయేగాక తాను ద్విపదబసవపురాణములోని సోమనాథుని వాక్యములనే తన పద్యబసవపురాణమున పాదిగించి యున్నాఁడు. శైవకవి నాగులూటి శేషనారాధ్యుఁడు శ్రీశైలఖండ మనుపేరఁ బర్వతపురాణమును రచించి యందు పండితారాధ్యచరిత్రమునఁ గల పర్వతప్రకరణము ద్విపదలనే పద్యములం దిమిడ్చి

యున్నాఁడు.[1] వేయేల, పాల్కురికి సోమనాథుఁడే తనకు ముందు వెలసిన ప్రశస్తశైవకవి నన్నిచోడని కుమారసంభవమునుండి యథావాక్యములుగా నెన్నియో గ్రహించినాఁడు. అన్నమయ్యయు శివకవిపద్ధతిని తనకు ముందు గల గ్రంథములలోని పదపద్యభావములను గ్రహించినాఁడని చెప్పనగును.

ఈపట్టున పాల్కురికి సోమనాథుని కాల విషయముగూడ ప్రసక్తమగుచున్నది. పైయుద్ధృతాంశముల ననుసరించి పాల్కురికి సోమనాథుని యన్నమయ్య యనుసరించినట్లు స్పష్టమగుచున్నది. మఱియు నన్నమయ్య క్రీ. శ. ౧౨౮౫ లో కృతిని రచించుట నిర్వివాదమగుటచే సోమనాథుఁ డంతకుముందుగాని, లేక యన్నమయ్యయు, సోమనాథుఁడును సమకాలీను లగుటగాని తేటపడుచున్నది. అన్నమయ్యకృతియందుల చివఱపద్యములలో

“అభిరమ్యంబుగ దూదికొండమహనీ
యారాధ్యసోమేశ్వర
ప్రభుకారుణ్యవసంతసంజనితమ
త్పద్యప్రసూనావళిన్
విభవంబొప్పఁగ గూర్చి యొంతయు లస
ద్విఖ్యాతిసంపత్సుఖ
ప్రభవంబైన భవత్పదద్వయము నా
రాధింతుసర్వేశ్వరా. (౧౩౧ ప.)

అని యొక సోమేశ్వరారాధ్యుని పేర్కొనినాఁడు.

పైపద్యమున నారాధ్యసోమేశ్వరుఁ డన్నమయ్య గురువనియీవఱకు విమర్శకులు నిర్ణయించియున్నారు.[2] ఈతఁడు పాల్కురికి సోమనాథుఁడే కాఁదగునని నేనూహింతును. సోమనాథుని సోమనారాధ్యులని యాంధ్రవీరశైవకవులును, సోమేశ్వరుఁ డని కర్ణాటక కవులును పేర్కొనిరి. అయిన నీ యైక్యనిరూపణమున కొక యాక్షేపణ. సోమనాథుఁడే పండితారాధ్య చరిత్రమున శివతత్త్వసారమున కందములను ద్విపదలుగా ననువదించిన ట్లన్నమయ్య కృతినుండి గ్రహించి యనువదింపకూడదా యని రావచ్చును. దానికి సమాధానము మొదటనే కలదు. వీరశైవమతమును, బసవపండిత సంప్రదాయములను సర్వతోముఖముగఁ దొలుత ప్రపంచించినవాఁడు సోమనాథుఁడు. అన్నమయ్య కృతియందు సమగ్రముగ తనకు ముందున్న వానిలోఁ గొన్నిటి మాత్రమే గ్రహించినట్లు స్పష్టము. మతవిషయ మట్లుండ సోమనాథుని కాలముకూడ నీయాక్షేపణమునకు సమాధానమే. పాల్కురికి సోమనాథుఁడు క్రీ.శ. ౧౨౮౫ ప్రాంతముల బ్రసిద్ధుఁడై పండితారాధ్య చరిత్రాది గ్రంథముల నానాఁటికే రచియించియుండు ననుటకు సాధనములు గలవు. వానినిఁగూర్చి ప్రత్యేకము స్థలాంతరమునఁ జర్చించెదను.

అన్నమయ్య పేర్కొనిన దూదికొండ కర్నూలు మండలమున ప్రత్తికొండ తాలూకాయందు గలదు. కర్నూలు మండలమున ప్రసిద్ధశైవక్షేత్రమగు శ్రీశైలమున కవితాప్రాభవమును వెలయించిన సోమనాథుఁ డా మండలమున కొంతకాలము సంచరించిన ట్లైతిహ్యము

1. భారతి ౧౫ సం. ౧ సంచిక-‘ప్రాచీనాంధ్ర కవులు: నాగులూటి శేషనారాధ్యుఁడు’—ఈవ్యాసమున పండితారాధ్యచరిత్రద్విపదలను షనారాధ్యుని పద్యములను చూపియున్నాఁడను. విస్తరభీతిచే నిందు విడచితిని.

2. ‘దూదికొండసోమేశ్వరారాధ్యు లీతని గురువు’ (శతకకవుల చరిత్ర. వంగూరిసుబ్బారావుగారు (౧౯౨౮) ౫౩ పుట)

‘ఈతఁడు వీరశైవుడు. దూదికొండసోమేశ్వరారాధ్యులవారి శిష్యుఁడు’ (వావిళ్లముద్రణపీఠిక. భక్తిరస శతక సంపుటము I. ౫౩ పుట)

‘దూదికొండనివాసియగు సోమేశ్వరారాధ్యుని శిష్యుఁడు’ (శతకమంజరి, ఆంధ్రగ్రంథమాల, పీఠిక తొలిపుట).

గలదు.[1] అన్నమయ్య తొలుత గోదావరీ మండలమున పట్టిసక్షేత్రవాసి యనియు, నాతఁడు శ్రీశైలయాత్రకు బోయి యా వెనుక పల్నాడులో స్థిరపడెననియు తద్వంశీయులు చెప్పుచున్నారు. అన్నమయ్య సోమనాథుని శిష్యుఁడగుట దేశకాలపాత్రానుగుణ్యముగనే యున్నదని చెప్పనగును.

ఈకృతిని శతక మనుటకంటె స్తోత్ర మని చెప్పుటయే లెస్స యని ముందు నుడివితిని. సర్వేశ్వర స్తోత్ర మనియు, సర్వేశ్వర స్తవ మనియుఁ గవి దీనిఁ బేర్కొనినాఁడు. 'శతక'మని యున్న పద్యము నీకవిది కాదనియు నీవఱకే తెల్పినాఁడను. ఇందు మకుట నియమ మున్నను, నిందు కేవలశతకములలోవలె ముక్తకములుగాక కొన్ని శీర్షికలతో నున్నవి.

ఆజ్ఞాశక్తి, భక్తతీర్థ ప్రభావము, భక్తమహిమ, పూజామాహాత్మ్యము, శివయోగానందము, భక్తిప్రభావము, భక్తియోగము, చిత్తవశీకరణము, భక్తిసంస్కారఫలము, పంచాక్షరీమహిమ మున్నగు శీర్షికలచే నీకృతి సోమనాథుని యనుభవసారమువలె చిన్న కావ్య మని యెన్నఁదగియున్నది. నేఁటి ముద్రితప్రతులయం దీశీర్షికలలో పద్యములు తారుమారైయున్నవి. ప్రత్యేకముగఁ గొన్ని విషయములఁగూర్చి కవి చెప్పఁదలఁచినట్లే శీర్షికలయందలి విషయములు తెల్పుచున్నవి. ఇట్లే శివతత్త్వసారమును శతకములలోఁ జేర్పఁబడినది. అది పండితారాధ్యచరిత్రమున 'శతకంబు శివతత్త్వసారము' అను పాదమున శతకంబు అనునది శివతత్త్వసారమునకు విశేషణముగఁ జేయుటచే గలిగిన పొరపాటు.[2] ఈపట్టున సంస్కృతాంధ్రశైవస్తోత్రములు, గ్రంథములు పెక్కులు పేర్కొనఁబడినవి. ఇందు శతకము, శివతత్త్వసారము వేఱువేఱు గ్రంథములు. శతకము మల్లికార్జునపండితుని శ్రీగిరిమల్లికార్జున శతకమ కావచ్చును. శివతత్త్వసారపీఠిక ననుసరించి శతకకవుల చరిత్రమునను, నింకను రెండుమూఁడు వ్యాసములందును శివతత్త్వసారము శతకమను పొరపాటు దొరలినది.

సర్వేశ్వరస్తోత్రము సరిగ పునర్ముద్రణమునందె నేని యిది శతకము కాదని శీర్షికలు విభజించి చూపనగును.

అన్నమయ్య కృత్యంతరము లీలానంద సర్వేశ్వరశతకమునం దేఁబదిపద్యములు లభించినవి. ఆద్యంతపద్యంబుల నిం దుదాహరించుచున్నాఁడను.

శ్రీసర్వేశ్వరుఁగా సదాశివునిఁగాఁ
జిద్రూపునింగా నిరా
భాసాఖ్యాతునిఁగా నిరంజనపర
బ్రహ్మంబుగా బ్రహ్మవి
ద్యాసారాంగునిఁగా నిరంతరము నే
ధ్యానింతు హృత్పద్మపీ
ఠాసీనస్థిరుఁగా గురుప్రభుని లీ
లానందసర్వేశ్వరా !

అంతర్మధ్యసబాహ్యలక్ష్యత్రివిధా
కారంబులన్ ఖేచరీ

1. పాల్కురికి సోమనాథుఁడీ ప్రాంతముననే 'మల్లమదేవీపురాణ' మను కృతి రచియించె నని యిప్పటికి ముప్పదేండ్లకుముందు శ్రీ పసపుల నాగయ యోగిగారును, కీ. శే. మానాయనగారును చెప్పగా వింటిని. ఇర్వదేండ్ల క్రిందట కర్నూలు మండలమున సంచారము గావించి, 'నా కర్నూలుమండల యాత్ర' అను వ్యాసమున బ్రహ్మశ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారీ గ్రంథమునుగూర్చి వ్రాసిరి. శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వ్యాసము 'సారస్వత సర్వస్వము' అను పత్రికయందు ప్రకటితమైనది. ప్రస్తుత మీ పత్రిక వ్యాప్తిలో లేదు.

2. శివతత్త్వసారపీఠిక, ౩వ పుట.

3. ఈశతకమును బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారు గుర్తించియున్నారు.

ఈశతకమున వారు గుర్తించిన పద్యము మదరాసు విశ్వవిద్యాలయమున తాళపత్ర గ్రంథసంచయమున సంకలనఛందోగ్రంథములలో (నెం ౩౩౦) నొకదానియందు గలదు.

ప్రాంతంబై విలసిల్లు నందునను మ
ధ్యాబాహ్యముల్ రెండున
త్యంతం బెన్న నిరర్థకంబగును నం
తఃఖేచరీముద్రస

ర్వాంతర్యామి యనం బ్రసిద్ధియగు శ్రీ
లానందసర్వేశ్వరా !

ఈపద్యములు సముద్రితములు.[1] సర్వేశ్వరస్తో త్రముతోడ వీనిని ముద్రించి, మూలములఁ జూపుచు ప్రాచీన భాషాసంప్రదాయానుసారముగ పరిష్కరణము గావించిన ప్రాచీనశైవవాఙ్మయమునకు, ప్రాచీనాంధ్రభాషా వాఙ్మయ వికాసమునకు నిది బహూపకారక మగు ననుటలో సందియము లేదు.

1. ' ప్రాచ్యలిఖిత పుస్తకభాండార సూచిక. (Descriptive Catalogue of Telugu Manuscripts. Vol. VII—Satakas. No. 1694 Page 1958.)

# అర్చ

## = శ్రీ మాడభూషి గోపాలాచార్యులు =

పర్వతాగ్రంబులఁ బ్రభవించు నదులకు సాగరు నిండారు సంగమంబు,
పవనవీథిఁ జరించు బాలార్కమూర్తికి సరసిజాంగనతోడి సరసమైత్రి,
గంభీరమేఘౌఘఘనగర్జలకు మెచ్చి వనవీథి నటియించు బర్హిప్రేమ,
మబ్బులోపలి చిన్కు మౌక్తికంబుగ మార్చు ముత్యంపుచిప్పల ముద్దువగలు.
ప్రస్ఫుటంబుగ నెవ్వాని ప్రతిభఁ దెల్పు - విశ్వమంగళకర మగు ప్రేమసూత్ర
మెవఁడు ధరియించి యానంద మెపుడు గొల్పు - నతనికర్పింతు నే వందనార్చనములు.

# ఇంటిపేరంటే?

శ్రీ వేరుసోమయాజుల వరహాలు

ఎన్నికోటుల యింటిపేర్లిలను గలవొ?
ఏతదతిసంఖ్య నాఖ్యల వెందుకొరకొ?
ఎపుడు పుట్టెనొ పరిణామ మెట్లు గనెనొ?
ఎరిగి యిదమిత్థమనువార దెంతవారొ?

ప్రతీవ్యక్తికీ పేరుతోపాటు యింటిపేరు అనేది ఒకటి జతగూడివుంటోంది. వ్యావహారికంలో యీ యింటిపేరు అనేది కొన్నిచోట్ల పేరుకు ముందుగాను, మరికొన్నిచోట్ల పేరుకు తరువాతను వాడబడుతోంది. ఇంచుమించుగా ప్రపంచకంలో వుండే అన్ని దేశాల్లోనూ, అన్ని జాతుల్లోనూ, అన్నిమతాల్లోనూ కూడా యిది స్థానాన్ని పొందేవుంది. ఆ విశ్వప్రపంచకాన్ని అంతా విమర్శించి యీ యింటిపేరును యిదమిత్థంఅని సమన్వయించాలంటే పెద్ద గ్రంథం అవుతుంది; చాలాకాలం పడుతుంది.

ఇంట గెలిచి రచ్చగెలవడం మంచి మార్గం కాబట్టి, ఆ విశ్వప్రపంచకాన్ని అలా వుంచి ముందుగా మన యింటి సంగతి విమర్శించి చూచుకోవడం మన ప్రథమకర్తవ్యం. అదీ కష్టమైన పనే. ఏమంటే, మూడు కోట్లకు పైగా వున్న ఆంధ్రులలో అధమం ఒక కోటి అయినా యింటిపేర్లు వుంటాయి. వాటి నన్నింటినీ సంగ్రహించి పరిశోధించడం చాలా కష్టమైన పని. కాబట్టి ముందుగా మనకు బాగా అందుబాట్లో వున్న కొన్ని యింటిపేర్లను గ్రహించి వాటిన్ని విమర్శించి చూచుకుంటే ఫలితాన్నిబట్టి మిగిలినవాటి సమన్వయానికికూడా యేదైనా మార్గం గోచరం కాకపోదు.

అంటే యీ నా వ్యాసంలో యింటిపేరంటే యేమిటో ప్రవచిస్తున్నా ననుకోకండి. నిజానికి అది నాకూ దురూహ్యమవడమే యీ వ్యాసరచనకు కారణం. మరిఒక మనవి. ఈ వ్యాసంలో నాచే వుదాహరింపబడినయింటిపేర్లుఅన్నీకూడా యథార్థంగా అమల్లో వున్నవేగాని తమాషాకల్పితాలు యెంత మాత్రం కావు. కావాలంటే వారివారి పూర్తివివరాలు పంపగలను. చాలా యింటిపేర్లు వుదాహరించాలంటే వ్యాసం పెరిగిపోతుంది. కాగితాలకు కరువుపట్టిన యీ రోజులలో అది ప్రచురణానికి ప్రమాదకరంగా వుంటుంది. గనుక కొద్దికొద్దిగామాత్రం వుదాహరిస్తాను.

## గ్రామనామం

ఇంటిపేరు అంటే యేమిటి అనేసరికి చట్టున వస్తోంది గ్రామనామం అన్న జవాబు. ప్రప్రథమంలో ఆయా కుటుంబాలవారు ఆయాగ్రామాలలో నివసిస్తూ వుండేవా రని దాని అన్వయం. దీనికి వుదాహరణ – అండలూరివారు, వేమూరివారు, కొల్లూరివారు, చెన్నూరివారు, గూనూరువారు యిత్యాదులు. పైవాటి తుదిని గల "వూరి", లేక "వూరు" అనే పదాలు యీ అన్వయానికి ఆధారం. దీన్నిబట్టి "పల్లి" లేక "పిల్లి", "పూడి", "పాటి", "ప్రోలు", "పురపు" మొదలైన పదాలకుకూడా గ్రామార్థం సమన్వయించుకుంటే ఆయాపదాలు తుదిని గల యింటిపేర్లుకూడా యీ గ్రామనామశీర్షిక క్రిందికే వస్తాయి. చూడండి: బజ్జెపల్లివారు, బొమ్మిరెడ్డి పిల్లివారు, మంగిపూడివారు, పారుపూడివారు, భమిడిపాటివారు, పూసపాటివారు, చేబ్రోలువారు, రాయప్రోలువారు, అయినాపురపువారు, విజాపురపువారు, యిత్యాదులు. ఇంతగా వూహించుకోవడం అవసరం లేకుండా ప్రస్తుతంకూడా వ్యవహారంలో వున్న గ్రామాల పేర్లుకూడా యింటిపేర్లలో వున్నాయి. వుదాహరణ: వడ్డాదివారు, సాలూరివారు మొదలైనవి. ఇట్టివిగూడా యీ తెగ

లోకే వస్తాయి. ఇక్కడి కిది బాగానే వుంది; అంగీకరించవొచ్చు.

### వృత్తిసూచకం

అయితే యీ అనంతమైన యింటిపేరులలో పై తెగక్రిందికి గానివాటి మాట యేమిటి అంటే, వృత్తిసూచకం అన్నారు కొందరు పెద్దలు. అంటే ఆదిలో ఆయాకుటుంబాలవారు ఆయావృత్తులను అవలంబించి బ్రతికేవా రని దాని అర్థం. చూడండి—అధికార్లవారు, పంతులవారు, ఉపాధ్యాయులవారు, పురాణంవారు, భాగవతులవారు యిత్యాదులు.

### బిరుదావళులు

బాగుంది, యిదీ అంగీకరించతగ్గదే. తరవాత బిరుదావళులు అన్నారు మరికొందరు పెద్దలు. అనగా ఆయాకుటుంబాలలో మొట్టమొదట యెవరికో ఆయా బిరుదాలు వుండేవి అని భావం. వుదాహరణ - కేసరివారు, బక్షీవారు, షరాబ్ ఖానావారు యిత్యాదులు.

### ప్రజ్ఞాప్రకర్షలసూచకం

తరవాత ప్రజ్ఞాప్రకర్షల సూచకం అన్నారు. అనగా ఆయా యింటిపేరులు గలవారి పూర్వులు యెవరో ఆయావిద్యలలోనో, సామర్థ్యాలలోనో ప్రజ్ఞో, ప్రకర్షో చూపించి పేరుగన్నారని అభిప్రాయం. వుదాహరణ: భాట్టృంవారు, సర్వసిద్ధివారు, జనమంచివారు యిత్యాదులు.

సరి: యిక్కడికి యివన్నీ బాగానే వున్నాయి గాని యింకా వున్నవాటి సంగతి యేమిటీ అంటే, యీలాగానే అన్నిటినీ సమన్వయించుకోవాలన్నారు. నూతివారు అంటే ఆదిలో ఆ గ్రామంలో ఒక్క వాళ్లయింట్లోనే నుయ్యి వుండేది అన్న అభిప్రాయం అన్నారు పెద్దలు కొందరు. ఇది కేవలం అన్యాయం. కొంతవరకూ అసందర్భంగాకూడా తోస్తోంది. ఏమంటే తుమ్మలవారు అనే యింటి పేరుకు యీ వాదంప్రకారం ఆదిలో ఆ కుటుంబీకులలో యెవరో తుమ్మేరు అంటే యేమైనా సమంజసంగా వుంటుందీ? అదిని ఆధునికంలోనూగూడా తుమ్మనివారు యెవరైనా వున్నారా? అయితే మరి అందరి యింటిపేర్లూ తుమ్ములవారే అని యెందుకు లేవు అన్న సంశయం కలగకమానదు. కాబట్టి పిడుక్కీ బియ్యానికీ ఒకటే మంత్రం అన్న వాదన పనికిరాదు.

ఈ యింటిపేరంటే యేమిటి అన్న సమస్యను పరిశోధించి యిదమిత్థం అని పరిష్కరించా లన్న కుతూహలంమట్టుకు గాఢంగా వుండి ధైర్యంగా బయలుదేరేను రీసెర్చికి. ఏ ఒక్క యింటిపేరైనా ఒక వర్ణానికీ, ఒక జాతికీ చెందివుంటోందా అంటే లేదు. ఒక్క యింటిపేరు నానాజాతులలోనూ, నానావర్ణాలలోనూ కూడా గోచరిస్తోంది. నేమానివారు ద్రావిడులలోనూ, వేగినాట్లలోనూ వున్నారు. మండపాకవారు అగ్రవర్ణులలోనూ, శూద్రులలోనూ కూడా వున్నారు. యింకా యిత్యాదులు అనేకం వున్నాయి. ఈ యింటిపేర్లలో యేదైనా అర్థం, క్రమం వుందా అని కొన్నింటిని యేర్చి అయిటం వారీగా కేటగిరీచేసి చూసేసరికి మహా చిత్రవిచిత్రాలు గోచరించేయి. గ్రంథవిస్తరభీతిచేత అందులో కొన్నిటిని మాత్రం వుదాహరిస్తున్నాను చూడండి.

దేవుళ్ల పేర్లు—విశ్వనాథవారు, గోవిందవారు.

దివ్యస్థలాల పేర్లు—శ్రీరంగంవారు, ద్వారకావారు, వారణాశివారు.

దివ్యగ్రంథాల పేర్లు—పురాణంవారు; రామాయణంవారు.

భూతాల పేర్లు—ఆకాశపువారు, గాలివారు.

మనుష్యుల పేర్లు— అన్నంరాజువారు, మాదిరెడ్డివారు.

జంతువుల పేర్లు ఏనుగవారు, గుఱ్ఱంవారు, ఎడ్లవారు.

పక్షుల పేర్లు—కోడివారు, పిచికలవారు.

చెట్లపేర్లు—మామిడివారు, మర్రివారు, వెంపలవారు.

అవయవాల పేర్లు—కాళ్ల వారు, ముక్కువారు, బొడ్డువారు.

అలంకారాల పేర్లు—కడియాలవారు, బొట్టు వారు.

పరికరాల పేర్లు—తాపీవారు, గాదివారు, గంపల వారు.

కాయగూరల పేర్లు—వంకాయలవారు, బీర కాయలవారు.

భోజనపదార్థాల పేర్లు—చేబియ్యంవారు, నూకలవారు, పప్పువారు.

రంగుల పేర్లు—కర్రివారు, ఎర్రవారు.

కొలతల విశేషాలు—పొడుగువారు, ముప్పిడి వారు.

వాద్యవిశేషాలు—మద్దిలవారు, డప్పులవారు.

వ్యాయామ విశేషాలు—దాట్లవారు, కప్పగంతులవారు.

వ్యవహారవిశేషాలు — దావాలవారు, వేలాల వారు.

ఈలాగ్గా వివిధవిషయాలక్రిందకి వస్తున్నాయి యీ మన యింటిపేర్లు. అందుచేత ఆదిలో ఆలా వుండేది అన్న అర్థం అన్నిటికీ అనువర్తించదు. భావాతీతమైన రహస్యం యేదో విధిగా యీ యింటి పేరులో వుండివుండకతప్పదు. పైన ఉదాహరించిన కేటగిరీలు చేస్తూవుండగా కొన్నికొన్ని యేదో దగ్గర చుట్టాలయినట్టూ, వాటిలో వాటికి యేదో పక్షిణీ చుట్టరికం, యేదో అవినాభావసంబంధం, వాగర్థ ప్రణయం వున్నట్టూ, వాటివాటి మాతృకలు వేరువేరు కానట్టూ లీలగా స్ఫురించింది. అందుమీద ఆ అయిటంవారీ కేటగిరీ పని మాని కొన్ని కుటుంబవిభజనలు కూడా చేసిచూసేను. అందులోనూ వింతవింతసొగసులు గోచరించాయి. అందులో మచ్చుకు కొన్ని కుటుంబాలనుమట్టుకు క్రింద వుదాహ్రరిస్తున్నాను :

గంటికుటుంబం:—గంటివారు, మాగంటివారు, చాగంటివారు, కాపుగంటివారు, పానుగంటివారు యిత్యాదులు.

పంతులకుటుంబం:—పంతులవారు, చిట్టిపంతులవారు, ఎల్లాపంతులవారు, అన్నాపంతులవారు, అనంతపంతులవారు యిత్యాదులు.

సోమయాజులకుటుంబం:— సోమయాజులవారు, అయలసోమయాజులవారు, మేరుసోమయాజులవారు యిత్యాదులు.

ఇంకా యిత్యాదులు చాలా కుటుంబాలు వున్నాయి. వీటినన్నింటినీ బట్టి చూస్తే యీ యింటి పేర్లుకూడా కాలగర్భంలో వింతపరిణామానికి గురిఅయినట్లు తోస్తోంది. పరిణామమేకాకుండా మధ్యమధ్య మానవబుద్ధిజాడ్యజనితోన్మాదాలుకూడా యీ యింటి పేర్లకు వికృతులనుఘటించినట్లు చూచాయగా గోచరిస్తూ వచ్చింది. ఈ సందర్భంలో ఓ చిన్న యితిహాసం విన్నాను. అది యథార్థమే అని రుజువుచేయడానికి తగిన రికార్డు దొరికేవరకూ దాన్ని యితిహాసంగానే భావిస్తున్నాను. అదేమిటంటే ఒకప్పుడు మన ఉత్తర సర్కారులలోనే ఒక పట్నంలో "బొక్కా"వారు అనే యింటిపేరు గల కుటుంబీకులు వుండేవారట. వారు సంసారులు, యోగ్యులుకూడానట. కొంత కాలానికి ఆ కుటుంబంలో కొందరు బుద్ధిమంతులు ఆవిర్భవించి, పురాణవిద్యాపారంగతులై "బొక్కా"వారన్న యింటిపేరు చాలా యేహ్యంగా వుందని దాన్ని మార్చి "బ్రహ్మాండంవారు" అని తమ ఇంటిపేరు సమోజు చేయవలసినదిగా కలెక్టరుగారికి అర్జీ పెట్టుకున్నారట. అప్పటికి ఓ ఛాందస వ్యక్తి కలెక్టరుగా వుండి "సనాతనంగా వున్నదాన్ని మానేయడం మంచిపని కాదు. ప్రాజ్ఞులై మీరు క్రొత్తదాన్ని పెట్టుకోడానికి అభ్యంతరంలే" దని, ఆ రెండింటినీ కలిపి "బ్రహ్మాండం బొక్కావారు" అని గజెటులో గుద్దించేసేడట. అప్పటినుండే ఆదిలోని "బొక్కావారు" తరవాత "బ్రహ్మాండం బొక్కావా'' రయేరట. ఇట్టివిధంగానే ఒకప్పుడు "పందికొండ'' వారన్న యింటిపేరే యిప్పటిలో "వరాహగిరి"వారుగా వాడుకలో వుండటం కూడాను.

# ఇంటిపేరంటే?

ఇట్టి యితిహాసాల యాథార్థ్యం యేలా వున్నా ఈ మన యింటిపేర్లు వింతవింతపరిణామాలు పొంది నేటి స్థితికి వచ్చివున్నాయి అనుకోడానికి ఆటంకం యేమీ లేదు. అందుచేత యీ యింటిపేరు రీసెర్చిలో క్లిష్టాలు చాలా వొచ్చేయి. ఏ యింటిపేరు పుట్టుపూర్వోత్తరాలు గ్రహించాలన్నా ఆదిలో దాని నిజస్వరూపం యేలా వుండేదో తెలుసుకోకుండా వూహాలు పరుగెత్తిస్తే ప్రయోజనం వుండదు.

ఇంక యీ యింటిపేరుపుట్టుపూర్వోత్తరాలు కాస్త పరిశీలిద్దాం. వేదాలలోనూ, శ్రుతులలోనూ, స్మృతులలోనూ, ఉపనిషత్తులలోనూ, పురాణేతిహాసాలలోనూ యెక్కడాకూడా యీ యింటిపేరు వినబడదు. అందుచేత ఆ కాలాలలో, అనగా ముందటి మూడు యుగాలలో కేవలం ప్రాకృత సంస్కృతభాషాకాలాలలో యింటిపేరు అనేది వ్యవహారంలో లేదనుకోడానికి అభ్యంతరం వుండకూడదు.

అవి అలా వుంచి ఆంధ్రుల చరిత్ర పరికిద్దాం. క్రీ. పూ. ౭౩ వరకూ, అనగా శ్రీముఖ శాలివాహనునికి ప్రాచీనకాలంలో నివసించిన ఆదినివాసులలో నైతేనేమి ద్రావిడులలో నైతేనేమి, ఆర్యాంధ్రులలో నైతేనేమి, యింటిపేరు వ్యవహరింపబడలేదు. అయితే శాలివాహనులకు యింటిపేరు వుందా అంటే లేదు. ముందు ఆ సంగతి మనవిజేస్తాను. ఈ శాలివాహనులలోనే యింటిపేరు భ్రమజనకం అవుతూవుండడంచేత నా యింటిపేరురీసెర్చికి యీ శాలివాహనుల కాలాన్ని ఓ లేండుమార్కు (**Land mark**) గా గ్రహించేను. శ్రీముఖశాలివాహనుడి తరువాతివాడు కృష్ణశాలివాహను డని చూడగానే యీ శాలివాహనుడనేది యింటిపేరా అన్న భ్రమ కలిగింది. నేను మొదటనే మనవి జేసేను యీ యింటిపేరు కొందరికి పేరుకు ముందు, కొందరికి పేరుకు తరువాత వాడబడుతోందని. కాని ఆంధ్రులలో యింటిపేరు యెప్పుడూ పేరుకు పూర్వమేగాని అనంతరంలో వ్యవహరింపబడక పోవడంచేతను, మొదటి శాలివాహనుని తండ్రి దీపకర్ణికి యీ శాలివాహనపదం వాడబడకపోవడంచేతను, కృష్ణశాలివాహనుని తరువాతివాడైన శ్రీ శాతకర్ణికికూడ యీ పేరు వాడబడకపోవడం చేతను, యీ శాలివాహనుడు (లేక శాతవాహనుడు) అన్నది యింటిపేరు అనడానికి యెంతమాత్రం అవకాశం లేదు. ఇదేప్రకారం శాతకర్ణి తరువాత చాలామందికి యీ శాతకర్ణిపదం పేరుతో జతకూడి వున్నప్పటికీ దాన్ని యింటిపేరుగా భావింపరాదు. యేమంటే, యీ ఆంధ్ర భృత్య వంశంలో క్రీ. శ. ౧౩౦-౧౬౦ కాలంలో పాలించిన శ్రీపులమాయికి శాతకర్ణి పదం వాడబడివుండలేదు. ఈ ఆంధ్రభృత్యవంశం తరువాత ఆంధ్ర పల్లవుల కాలంలోగాని, ఆంధ్ర చాళుక్యుల కాలంలో గాని యింటిపేరు వాడుకలో లేదు.

చాళుక్యులలో పేరు కెక్కినవాడు, ఆంధ్ర భాషాయోషను పరిపోషించినవాడు రాజరాజ నరేంద్రుడు (క్రీ.శ. ౧౦౨౨-౬౩). వీని ఆస్థానకవి, ఆంధ్ర కవిత్వ విశారదుడు అయిన నన్నయకు గాని, యీ రాజుకు గాని యింటిపేరు లేదు. ఈ నన్నయభట్టు యుగం మన యింటిపేరురీసెర్చికి రెండవ లేండు మార్కుగా గ్రహించాలి. ఏమంటే- నన్నయభట్టుకు యింటిపేరు లేకపోయినా యీతని కాలంలో చిన్న విశేషం ఒకటి కనుపిస్తోంది. ఈ రాజరాజనరేంద్రుని చేత నవఖండవాడ అను గ్రామమును బహుమానముగా బడసినవాడు, తెలుగులో గణితశాస్త్రం ఒకటి వ్రాసినవాడు పావులూరి మల్లనకవి మన రీసెర్చికి కొంత గడబిడ కలుగజేస్తున్నాడు. ఈ మల్లనకవి పావులూరి కరణమైయున్నట్టు చరిత్రలవల్ల తెలుస్తోంది. అందుచేత పావులూరిమల్లనకవి యని వ్యవహరింపబడివుండడం సమంజసం. అయితే పైన ఉదాహరించిన గ్రామనామంగా యీ పావులూరిని యింటిపేరుగా యేల పరిగణింపకూడదు అంటే యీ మల్లనతరువాత యీతని వంశంలో పావులూరి బుచ్చన్నో, అచ్చన్నో మరి కనబడలేదు.

చాళుక్యులతరువాత కొంతకాలం పాలించిన కాలచుర్యవంశంలో (క్రీ. శ. ౧౧౮౨ వరకు) బిజ్జలుని

కాలమున శైవమతోద్ధారకుడైన బసవేశ్వరుడు హింగుళేశ్వరఅగ్రహారికుడగు మండంగిమాదిరాజుకు జనించినట్టు చరిత్రలవల్ల తెలుస్తోంది. ఈ మండంగి అన్నది మాధిరాజు యింటిపేరే అయివుంటే బసవేశ్వరునికి యెక్కడా వాడబడివుండలేదు. బిజ్జలాదులగు కాలచుర్యులలో యింటిపేరు కానబడలేదు.

పిమ్మట చోడుల కాలంలోకూడా యింటిపేరు వాడుకలో లేదు. నన్నెచోడుడికి యింటిపేరు లేదు. ఆంధ్రచోడులలో మనుమసిద్ధికి యింటిపేరు లేదు. తిక్కనసోమయాజికి యింటిపేరు లేదు. ఈ తిక్కన యుగం మనం మూడవ లేండుమార్కుగా గ్రహించాలి. యేమంటే దండివిరచితదశకుమారచరిత్రను తెనిగించి దానిని తిక్కనకు అంకితంచేసి అభినవదండి యని పేరుకెక్కిన కేతనమహాకవి తన ఆంధ్రభాషాభూషణ మను గ్రంథంలో—

“వివిధకళానిపుణుడ నభి
నవదండి యనంగ బుధజనంబులచేతన్
భువి పేరు గొన్నవాడను
గవిజనమిత్రుడను మూలఘటికాన్వయుడ౯

అని వ్రాసుకున్నాడు. పై పద్యంలో తుదిని గల అన్వయశబ్దమునకు యింటిపేరు అని అర్థం చెప్పి కేతనకవియింటిపేరు మూలఘటికవారు అని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తమ ఆంధ్రులచరిత్రలో ప్రవచించేరు. వారి అన్వయశబ్దాన్వయాన్ని పూర్వపక్షం చేయడానికి నేను అసమర్థుణ్ణేకాని నా మితప్రజ్ఞతో నేను మాత్రం వారి అన్వయశబ్దార్థంతో యేకీభవింపజాలను. అన్వయము అన్నప్పుడు వంశ మనే గ్రహించాలిగాని యింటిపేరు అనడానికి వీలులేదు. కౌరవాన్వయ అన్నప్పుడు దుర్యోధనుడి యింటిపేరు కౌరవవారు అంటే ఒప్పుకుంటారా? యాదవాన్వయ అంటే శ్రీకృష్ణుడి యింటిపేరు యాదవవారా? యీవిషయంలో యిదమిత్థం అనడానికి నాకు శక్తి చాలదు. తెలిసిన పెద్దలు విశదీకరించాలి.

పిమ్మటిది కాకతీయుల యుగం. ఈ కాకతి అనే పదం ప్రోలరాజాదులగు కొంతమందికి పేరుతో కలిపి వాడబడియుండుటచేత యిది యింటిపేరా అన్న భ్రాంతిని గలిగిస్తోంది గాని కాకతీయులలో యీ పదం పేరుతో కలిసి వ్యవహరింపబడని రాజులు అనేకులు గోచరించడంవల్ల దీనిని నేను యింటిపేరుగా భావింపక కాకతీయులలో యింటిపేరు లేదు అనే భావంతోనే వున్నాను. ఈ కాకతీయులలో మొదటి ప్రతాపుని కాలంలో వుండిన పాలుకుర్కిసోమనాథ కవికిమాత్రం స్పష్టంగా యింటిపేరు కనబడుతోంది.

తదుపరి కమ్మవారిలో నైతేనేమి, పల్నాటి వీరులలోనైతేనేమి, వెలమలలో నైతేనేమి యింటిపేరున్నట్టు కనబడదు. రెడ్లకాలంలో రేచర్లవారు, అల్లాడివారు, కోమటివారు యిత్యాది యింటిపేర్లు కొన్ని గోచరిస్తున్నాయి.

బమ్మెరపోతన్నకు యీ బమ్మెర అన్నది పైన ఉదాహరించిన పావులూరిమల్లనకవిఅన్వయమే అనువర్తిస్తుంది. ఏమంటే యీతని సమకాలికుడు, బావమరిది యైన శ్రీనాథుడికి యింటిపేరు లేదు.

రాయల అష్టదిగ్గజాలలోనూ ంటిపేరు బాగా కనబడుతోందిగాని రామరాజభూషణుడికి మాత్రం కనబడలేదు

చామకూర వేంకటకవికి యింటిపేరుందిగాని రఘునాథరాయలకు లేదు.

ఈ యింటిపేరురీసెర్చికి ప్రాచీనశాసనాలు, గద్యలు, వంశవర్ణనలు తప్ప వేరు సాధనాలు కనబడవు. అందులో యెక్కడా యీ యింటిపేరు కనబడదు. శ్రీనాథాదులకు యింటిపేరు లేదా? వుంటే యెందుకు వ్రాసుకోలేదు? ఇటు యెడుతరాలూ అటు యెడుతరాలూ దిబ్బా తీర్థం యేకరువుపెట్టిన గద్యలలో, వంశవర్ణనలలో, శాసనాలలో యెందుకు వ్రాసుకోలేదు? ప్రస్తుతం మనలో కొందరికి యింటిపేరేగాని పేరు అనవసరం అని తోచి, అద్దంకి, పారుపల్లి, స్థానం అని వ్రాసుకుంటూ వున్నట్టే అప్ప

టిలో శ్రీనాథాదులకు పేరే గాని యింటిపేరు అనావశ్యక మని తోచిందా?

కాగా యిప్పటికి తేలింది యేమిటి అంటే —

౧. ఇంటిపేరు అనేది మొదట ఆంధ్రులలో లేదు. ఏదో మధ్యకాలంలో వొచ్చింది. ఆ కాలం సిసలుపడాలి.

౨. ఆ కాలంలో యిట్టి యింటిపేరు కావలసి వచ్చిన వ్యావహారిక యిబ్బంది యేమిటో స్పష్టపడాలి.

3. ఆ అవుసరం యిప్పటికీ వుందా? లేక తీరిపోయిందా? తీరిపోతే మరి మనకీ యింటిపేరు బరువెందుకు? యెత్తేయజ్ఞం అనీయొచ్చా?

ఈ యావత్తు విషయాలను యిదమిత్థమంటూ పరిష్కరించమని ఆంధ్ర దేశంలో వున్న పెద్దలందర్నీ వేడుకుంటున్నాను. ముఖ్యంగా కోరాడవారిని కోరుతున్నాను. తాపీవారిని తొందరపడమంటున్నాను. వేటూరివారిని వెతకమంటున్నాను. కట్టమంచివారిని కటాక్షించమంటున్నాను. చెళ్లపిళ్ల వారిని చెప్పమంటున్నాను.

సూత్రంబు గోత్రంబు క్షేత్రంబులేగాని గద్యల నింటిపే ర్కానరాదు
తాతముత్తాతలు తండ్రు లన్నలె గాని వంశవర్ణన నిది విశదపడదు
వారాలు వర్జాలు వత్సరాలేగాని చూపట్ట దిది నాటి శాసనముల
తర్జించి భర్జించి గర్జించిరేకాని మరిచి రీ వూసు విమర్శలందు
ఎచట నున్నదొ ఎందుకై పీడబడెనొ - యెరుగుదురయేని దెల్పుడా యెరిక నాకు
విమలమతులార కవులార విబుధులార - ముందుగా జేతు నిదె మీకు వందనములు.

## ఆడవారి గానసభ



# కాళిదాసుని శకుంతలాచిత్రణము



= శ్రీ నండూరి బంగారయ్య =

శాకుంతలనాటకమునందలి ఆకర్షకసాధనములలో శకుంతలాచిత్రణ మమూల్యమైనది. ఈచిత్రణమున కవికులగురువు చూపిన ప్రాగల్భ్యము శాకుంతలమునకు అఖండవైభవమును జేకూర్చుచున్నది.

శాకుంతలనాటకము నొక యాలయముగ గ్రహించినచో అందు సుప్రతిష్ఠితమైన విగ్రహము శకుంతల. ఇతర పాత్రములన్నియు ఈవిగ్రహమునకు అర్చకులు. ఈవిగ్రహ సౌందర్యమునకు రసజ్ఞతాశూన్యము లనదగిన నీచపాత్రములు సహితము చకితము లగుచున్నవి.

"ఈదృశంనామ సుఖోపనతం రూపం దృష్ట్వా కోఽన్యో విచారయతి" అని దుష్యంతుని పరిజనుడు శకుంతలాసౌందర్యమునకు నివాళు లిచ్చుచున్నాడు! మోదకఖాదనమే జీవితపరమార్థముగ గ్రహించిన విదూషకుడుకూడ

"యైషా శిథిలబంధోద్వృత్తకుసుమేన కేశాంతేనోద్భిన్నస్వేదబిన్దునా వదనేన విశేషతోఽపసృతాభ్యాం బాహోభ్యాం అవసేకస్నిగ్ధతరుణపల్లవస్య చూతపాదపస్య పార్శ్వే ఈషత్పరిశ్రాన్తే వాలిఖితా"

అని చిత్రపటమునుండియే శకుంతలామూర్తివిశేషమును గ్రహించుటలో వైదగ్ధ్యమును బ్రకటించుచున్నాడు. అట్టిచో "ననుశకుంతలాయా స్సౌభాగ్యదేవతా అర్చనీయా" అని వివేకవతులగు శకుంతలసఖులు పూజ కుపక్రమించుటలోగాని, "అయే లబ్ధం నేత్రనిర్వాణమ్" అని రసజ్ఞచక్రవర్తియగు దుష్యంతుడు దర్శనమాత్రముననే ఆనందలహరిపై నుయ్యాలలూగుటలోగాని ఆశ్చర్యము లేదుగదా!

శకుంతలాసౌందర్యోపాసనమునకు ఎన్నో కొన్ని పూలను సేకరించుకొని అన్ని పాత్రములును ఆయత్తము లగుచునేయున్నను అగ్రతాంబూలముమాత్రము దుష్యంతునిదే. కాళిదాసు శకుంతలసౌందర్యమును వర్ణించుచు చెప్పిన శ్లోకములలో అత్యుత్తమములయిన వన్నియు దుష్యంతుని నోటనే వెలువడుచున్నవి. సౌందర్యము సర్వజనసమ్మోహనకరమే యయ్యును, ఉపాసకుని సంస్కారమును బట్టికూడ దాని విశేషములు బ్రకటమగుచుండునుగదా!

ఈ చిత్రణమునందలి విశిష్టలక్షణము మూర్తిమత్త్వము. ఏ యవస్థ కాయవస్థలో బ్రతినిమేషము శకుంతల మన యెదుట బ్రత్యక్షమగుచున్నది. ఇప్పటి బంగాళీచిత్రణములందువలె అస్పష్టముగగాని, ఆత్మైకప్రధానముగగాని గోచరింపక సుపుష్టమైన విగ్రహముతో కన్నులపండువొనర్చుచున్నది. వల్కలధారిణి యైన శకుంతలవర్ణనము—

"సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి
ఇయ మధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్."

వృక్షసేచనమొనర్చుటకయి కేసరవృక్షకముచెంత నిలువబడినపుడు బాహ్యప్రకృతితో మానవసౌందర్యమును సమన్వయించుచు తీసిన ఫోటో!—

"అధరః కిసలయరాగః కోమలవిటపానుకారిణీ బాహూ
కుసుమమివ లోభనీయం యౌవన మంగేషు సన్నద్ధమ్."

అంతలోనే మధుకరముచే కాతరీభూత యగుచున్న శకుంతలా విగ్రహము!—

"యతో యత షట్చరణో భివర్తతే
తతస్తతః ప్రేరితలోలలోచనా
వివర్తితభ్రూ రియ మద్య శిక్షతే
భయా దకామాపి హి దృష్టివిభ్రమం."

ఈరీతిగ సినీమారీలు త్రిప్పినటులుగ ననుక్షణము వర్ణించుకొనుచువచ్చినాడు కాళిదాసు. "అహో సర్వావస్థాసు రమణీయత్వ మాకృతివిశేషాణామ్" అను వాక్యము వేరొక సందర్భమున జెప్పినదయినను శకుంతలావర్ణనమునకుగూడ ఎంతగ నన్వయించునో చూడుడు! మధురావస్థలలోమాత్రమే కాక

"ఇతః ప్రత్యాదేశా త్స్వజన మనుగన్తుం వ్యవసితా
తత స్తిష్ఠేత్యుచ్చై ర్వదతి గురుశిష్యే గురుసమే
పున ర్దృష్టిం బాష్పప్రసరకలుషా మర్పితవతీ...."

అని విషమావస్థలో జిక్కుకొన్నపుడును, "వసనే పరిధూసరే వసానా నియమక్షామముఖీ ధృతైకవేణీ" అని విరహవ్రతమును ధరించుచున్నపుడును చేసిన వర్ణనములు గూడ ఎంత రమణీయములుగ నున్నవి :

సుపుష్టవిగ్రహ మనగనే స్థూలచిత్రణ మని భావింపరాదు. ఎక్కడను వ్యంగ్యమర్యాదను అతిక్రమింపకుండ కవి పూర్ణమైన యాత్మనిగ్రహమును వహించి వర్ణించుచున్నాడు గాని లౌల్యముతో చేసిన వర్ణన మెచ్చటను గానము. అంగప్రత్యంగవర్ణనము లున్నను కుమారసంభవమున పార్వతీప్రథమవర్ణనమువలె దీర్ఘమైనవిగను, ప్రౌఢతావిహీనములుగను, విసుగు జనింపచేయునవిగను లేవు. ఇంకొకటి. కొన్ని ప్రబంధములలో నాయికా వర్ణనములవలె గతానుగతికముగ లేక అవస్థావైశిష్ట్యమును, ఆకృతి వైశిష్ట్యమును ప్రతిపాదించునవిగ నున్నవి.

కాళిదాసుని నాటక నాయికలలో మాళవిక కేవలము మనుష్య స్త్రీ. ఊర్వశి కేవలము అప్సరస్త్రీ, శకుంతల యన్ననో కేవలము మనుష్య స్త్రీ గాదు ; కేవలము అప్సరస్త్రీ గాదు, మేనకా విశ్వామిత్రుల సంబంధమును పురస్కరించుకొని మానవత్వము, దైవత్వమును ఈమె యందు లెస్సగ సమ్మిశ్రితములైనవి, అందుచేతనే ఈమె వర్ణనమునందుకూడ కాళిదాసు అనురూపశిల్పమును గానబరచుచున్నాడు.

" అభ్యున్నతా పురస్తా దవగాఢా జఘనగౌరవాత్పశ్చాత్
ద్వారేఽస్య పాండుసికతే పదపఙ్క్తి ర్దృశ్యతేఽభినవా."

అని దృఢముగ పాదమును భూమిమీద మోపనిచ్చి వర్ణించుచున్నను

" మానుషీషు కథంవా స్యా దస్యరూపస్య సంభవః,
న ప్రభాతరలం జ్యోతి రుదేతి వసుధాతలాత్."

అని యొక్కమారుగ గగనమున కెత్తివైచుచున్నాడు. కాళిదాసుని నాయికలలోగూడ ఏ యితర నాయికకును లేని వైభవము శకుంతలయందు నిరూపితమైనది.

" చిత్రే నివేశ్య పరికల్పిత సత్త్వయోగా
రూపోచ్చయేన మనసా విధినా కృతాను
స్త్రీరత్న సృష్టి రపరా ప్రతిభాతి సా మే
ధాతు ర్విభుత్వ మనుచింత్య వపుశ్చ తస్యాః."

ఈ సౌందర్యమును నిష్కామవృత్తితో వీక్షించినను ఆత్మ కొక యపురూప హర్షము సిద్ధించుచున్నది, ఒక్క దుష్యంతుడు మాత్రమే కాక నాటకమును చేతబట్టిన ప్రతి పాఠకుడును,

" అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధు నవ మనాస్వాదితరసం,
అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూప మనఘం."*

అని గానము చేయవలసియున్నది.

మాళవికపట్లను, ఊర్వశిపట్లను లభింపని యవకాశ మొకటి కాళిదాసునకు శకుంతలపట్ల లభించినది. అది శకుంతల తాపసాశ్రమమున బెరుగుటయే. ఈ యవకాశము నాతడు పూర్ణముగ వినియోగించుకొన్నాడు. సహజమయిన లావణ్యమును సహజమయిన పరిస్థితులం దుంచి వర్ణించుట కెంతయో వీ లిచ్చినది. ఏ రాజాంతఃపురములోనో ఉన్న కన్య యైనచో ఆమె యెంతటి లావణ్యవతి యైనను శకుంతలవలె మన చిత్తము నాకర్షింప లేకపోయెడిది. "అవ్యాజ మనోహర" మయిన లావణ్యము కావుననే శకుంతలా చిత్రణము దేశకాల పాత్రముల నతిక్రమించి సర్వకాలములయందు సర్వజనులను సమ్మోహింపజేయజాలి యున్నది. ఈమెకు అలంకారముగ కాళిదాసు పేకరించుకొన్న సామగ్రికూడ కడు మనోహర మయినది.

---

*"కన్యను అనాఘ్రాతపుష్ప మని వర్ణించుటలో విశేష మేమున్నది ? మీదు మిక్కిలి అశ్లీలద్యోతకముగ కూడ లేదా?" అని కొందరు విమర్శకులు ప్రశ్నించుచున్నారు. ఈ శ్లోకమునకు 'అనఘం' అను పదము ప్రాణపదము, దుష్యంతు డిదివరలో సుందరుల నెందరినో చూచినాడు. కాని ఎక్కడను వ్రేలుపెట్టి చూపుటకైన వీలులేని- ఏమాత్రము మాలిన్యము లేని- రూపసంపద ఒక్కచో మూర్తీభవించి ఇచ్చట ప్రత్యక్ష మైనది. అందును అట్టి రూపసంపద ఉండు ననుకొనుటకు వీలులేని ఆశ్రమమున ప్రత్యక్షమైనది. ఒక నూతనజ్యోతిని సందర్శించిన శాస్త్రజ్ఞునివలె ఆతడు వివశుడయి వర్ణించుచున్నాడు. ఉపమానముల మూలమున ప్రతిపాద్యమయినది సౌందర్యముయొక్క అకృత్రిమత్వము మాత్రమే. నాగరకతాసంపర్కము కలుగగనే దానికి కృత్రిమత్వము (Artificiality) సంభవించు నని దుష్యంతుని యాశయము. ఈ సందర్భమున " శుద్ధాన్త దుర్లభ మిద " మను శ్లోకమును గూడ జ్ఞప్తియం దుంచుకొనదగును.

" కృతం న కర్ణార్పితబంధనం సఖీ
శిరీష మాగండ విలంబి కేసరం,
నవా శరచ్చన్ద్ర మరీచి కోమలం
మృణాలసూత్రం రచితం స్తనాంతరే."

ఇక ఈమె మాంగల్యసమాలంభనములు,తీర్థమృత్తిక! గోరోచనము! దూర్వాకిసలయములు! అత్తవారింటికి ప్రయాణ మగునపుడు సఖులు ఈమె కొసంగు కానుకలు ఫొటోలు కావు; సెంటుబుడ్లు కావు; నగలు కావు; నాణె ములు కావు. నారికేళసముద్గక నిక్షిప్తమగు కేసరమాలిక! ఇట్టి అత్యంత సులభసాధ్యమగు సామగ్రితో కాళిదాసు త్రిలోకసుందరి అయిన యామె విగ్రహము నలంకరించి నాడు.

తాపసాశ్రమమునందలి బాహ్యప్రకృతికిని, శకుంతల కును ఒకవిధమయిన అన్యోన్యత, అవినాభావసంబంధము నేర్పడుచున్నవి. ఈ రహస్యమును గుర్తించియే—

" కార్యా సైకతలీనహంసమిథునా స్రోతోవహా మాలినీ
పాదా స్తా మభితో నిషణ్ణహరిణా గౌరీగురోః పావనాః
శాఖాలంబితవల్కలస్య చ తరో ర్నిర్మాతు మిచ్ఛామ్యధః
శృఙ్గే కృష్ణమృగస్య వామనయనం కణ్డూయమానాం
మృగీం"

అను శ్లోకములో కేవలము వ్యక్తిచిత్రణము మాత్రమే కాక ప్రాంత చిత్రణముకూడ ఎంత యావశ్యక మైనదియు విస్పష్టపరచినాడు. ప్రథమాంకముననే "ఏతా స్తపస్వికన్యాః స్వప్రమాణానురూపైః సేచనఘటై ర్బాలపాదపేభ్యః పయో దాతు మితఏ వాభివ ర్తన్తే" అను వాక్యముతో చదువరి హృదయమువయి నొక సమ్మోహనాస్త్రము వేసిన ట్లగు చున్నది. "శుద్ధాంత దుర్లభ మిదం" అను దుష్యంతుని శ్లోకముగూడ ఈసమ్మోహనశక్తికే సాక్ష్య మిచ్చు చున్నది. "నకేవలం తాతనియోగః అస్తి మమాపి ఖలు సోదరస్నేహ ఏతేషు" అను శకుంతలావాక్యము ఈశక్తిని మరింత సాంద్రమొనరించుచున్నది. దీనినిబట్టి ఆశ్రమవృక్షములపయి నామెకు-విలాసవతులకు సాధారణ ముగా పూవులమొక్కలపయి నుండు మొగ్గరము మాత్రమే కాక వానియందు సోదరస్నేహ మున్నదని వ్యక్తమగు చున్నది. "సఖి శకుంతలే, ఇయం స్వయంవరవధూ బాలసహకారస్య త్వయా కృతనామధేయా వనజ్యోత్స్నేతి నవమాలికాఖలు-ఏనాంవిస్మృతాసి?" అను ప్రశ్నవలన మొక్కలకు ఆమె ముద్దుపేర్లు పెట్టుకొనుచు వానిలో నొం డొంటికి వివాహములొనర్చుచు వినోదించు ననుట తేట పడుచున్నది. దీనికి శకుంతల యిచ్చిన "తథా యది ఆత్మా నమపి విస్మరిష్యామి" అను సమాధానము ఆమెప్రేమను "సోదరస్నేహ" మనునంతరువునుకూడ దాటిపోయి ఆత్మ సాదృశ్య మను నంతరువునకు జేర్చుచున్నది.

నాలుగవ యంకమున శకుంతలాచిత్రణము పరమా వధి నందుచున్నది.

"పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మా స్వపీతేషుయా
నాద త్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యా పల్లవమ్
ఆద్యే వః కుసుమప్రసూతి సమయే యస్యా భవ త్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతిగృహం సర్వైరనుజ్ఞాయతామ్"

అను తాతపాదుల వాక్యము శకుంతలాహృదయ మును చక్కగ చిత్రించుచున్నది, ఆమెప్రేమ ఎట్టి స్వార్థ త్యాగబుద్ధిచే నుత్తేజితమయినదియు నిరూపితమగుచున్నది. ఆశ్రమమృగములయందుకూడ ఆమెకు ఎట్టి యగాధమయిన ప్రేమ మున్నదో తిలకింపుడు :

"యస్య త్వయా వ్రణవిరోపణ మింగుదీనాం
తైలం న్యషిచ్యత ముఖే కుశసూచివిద్ధే
శ్యామాక ముష్టి పరివర్ధితకో జహాతి
సోయం న పుత్రకృతకః పదవీం మృగస్తే."

ఇట్టి ప్రేమకు అడవిమృగముల హృదయములు సైతము సంచలించి ద్రవీభూతములు కావలసినదేగాని ఊర కుండగలవా ?

"ఉద్గళితదర్భకబలా మృగాః పరిత్యక్తన ర్తనా మయూరాః
అపసృతపాండుపత్రా ముఞ్చ త్యశ్రూణీవ లతాః"

చతుర్థాంకము కాళిదాసు కల్పించిన ప్రత్యేకస్వర్గసీమ. ఈయంకము లేకున్నచో శకుంతలాచిత్రణములో నున్న సౌందర్యము సగమునకు పైగా లుప్తమయ్యెడిదేమో !

శకుంతలకు బాహ్యప్రకృతితో నున్న యన్యోన్యతను చిత్రించుటలో కాళిదాసు మూలమునం దున్న యంశములే విపులపరచినాడు. కాని శకుంతలకు అనసూయాప్రియంవద లను జతగూర్చుటలో క్రొత్తదారి ద్రొక్కినాడు. స్థూలదృ ష్టికి ఈ అనసూయాప్రియంవదలు శకుంతలను దుష్యంతు నితో సంధానించుట కుపయోగపడు కథానిర్వహణ సాధన ములుగ మాత్రమే గోచరించుచున్నవి. కాని సూక్ష్మదృష్టితో బరికించినచో శకుంతలాచిత్రణమునకుగూడ ఈచిత్రణ మెట్టి యమూల్యసాధనమో బోధపడకమానదు. కళాదృ

ష్టమై కొన్ని యపురూప సౌందర్యమయము లగు వస్తువుల మధ్య వాటినన్నిటిని మించిన ఇంకొక వస్తువు నుంచి తిలకించినచో దాని రామణీయకము మరింత విస్పష్టముగ విరాజిల్లును. "కవినాం కవిమండలే" అనినట్లు ఇట్టి కళారహస్యములకు పుట్టినిల్లగు కాళిదాసు శకుంతల నొక్కతెనే చిత్రింపక ఆమెకు "తోడిపెండ్లికూతులు"గ నుండుటకయి మరి ఇరువురు సౌందర్యవతులనుగూడ చిత్రించినాడు. అందువలన శకుంతలశోభ యినుమడించినది. ఈ రహస్యమును రసజ్ఞశేఖరుడగు దుష్యంతుడుకూడ గుర్తించియే "అహో సమవయోరూపరమణీయం సౌహార్దం భవతీనాం" అని తబ్బిబ్బగుచున్నాడు.

ఈ అనసూయాప్రియంవదల చిత్రణమువలన శకుంతల కెట్టి శోభ చేకూరినదియు "అపి జానాసి కింనిమిత్తం శకుంతలా వనజ్యోత్స్నాం మతిమాత్రం పశ్యతి?" అనునప్పటి నిర్మలపరిహాసములును, దుష్యంతుడు సమీపించిన వెనుక "సఖి శకుంతలే, యద్యద్య తాతః సన్నిహితో భవేత్" అనునప్పటి నర్మగర్భిత పరిహాసములును, శకుంతలను దుష్యంతుని సన్నిధిని నిలుపుటకు వ్యాజముగ "వృక్షసేచనే ద్వే మే ధారయసి. తస్మా దేహి తావ దాత్మానం మోచయిత్వా తతో గమిష్యసి" అనునప్పటి కుహనాకలహములును విశదీకరింపగలవు. శకుంతలను దుష్యంతునితో సంధానించుటకు వారు చేటికలు. గాంధర్వవివాహమునకు వారు పెండ్లిపెద్దలు. శకుంతల యావేదనలో సమభాగినులు. శకుంతలా ప్రస్థానసందర్భమున బాలసహకారమును, నవమాలికను "ఏషా ద్వయో ర్వాం హస్తనిక్షేపం" అని శకుంతల వారి కొప్పగించినపుడు "అయం జన స్త్వయేదానీం కస్య హస్తేఽర్పితః" అని వారు బాష్పములు విడుచుచు పలికిన వాక్యము ఎంత హృదయంగమముగ నున్నది !

పాత్రపరిణామము(Evolution of character) అను ప్రక్రియకు శకుంతలాచిత్రణము చక్కని నిదర్శనము. నాటకమున ప్రవేశపెట్టిన పాత్రము మొదటినుండి తుదివరకు ఒకేతీరున నిలిచిపోవుట అసంభవము. లోకములో ఏవ్యక్తియైన గైకొనుడు. ఆతని స్వభావమునుబట్టి యాతని జీవితము నడచుచుండును. కాని ప్రపంచమున నాత డొక్కడేగాక ఇంకను ఎన్నో వ్యక్తు లున్నవి, శక్తు లున్నవి. వీనివలన తలవనితలంపుగ కొన్ని యుదంతము లాతని జీవితమున ప్రవేశించుచున్నవి. ఈ యుదంతములనుబట్టి యాతడును, ఆతనినిబట్టి ఈ యుదంతములును పరస్పరపరిణామము నందుచుండును. ఈ పరిణామమును నాటకపాత్రములతో నిరూపించు కథాప్రక్రియకు పాత్రపరిణామ మందురు. శకుంతల మొదట ఆశ్రమవృక్షములను, ఆశ్రమమృగములను, ఆశ్రమవాసులను తప్ప ఎరుగని అమాయకహృదయ. మున్ముందు ఆమె ప్రేమము వీనినే ఆశ్రయించుకొని ప్రకాశించుచున్నది. దుష్యంతుడు ఆమెదృక్పథమున పడువరకు సరళమైన ఆమెహృదయమును కవి మొదట చిత్రించుకొనివచ్చినాడు. దుష్యంతుని ఆమె ఆహ్వానింపలేదు, అది యాదృచ్ఛికముగ- అదే దైవికముగ నడచిన యుదంతము. ఈ యుదంతము వలన, అనగా దుష్యంతదర్శనమువలన ఆమెహృదయమున నొక వికార ముదయించినది. ఇది తపోవనవిరోధి యని కూడ ఆమె గ్రహింపకపోలేదు. మూడవ అంకము తుదివరకు ఈ వికారపరిణామము చిత్రితమైనది, వివాహ మైనది, దుష్యంతుడు స్వనగరమునకు పోయినాడు, అది గాంధర్వవివాహ మగుటచే గురుజనుల యనుజ్ఞ లేదు. ఇటు కణ్వుడేమనునో అని ఒక భయము. అటు దుష్యంతుని అనంతర ప్రవర్తన మెట్లుండునో అని ఒక ఆందోళనము. పంచమాంకమున దుష్యంతపునర్దర్శనమువరకు ఈ ఆందోళనము చిత్రితము. తుదకు పతివలన సిద్ధించినది ప్రత్యాదేశము, ఈ ప్రత్యాదేశసందర్భమున ప్రదర్శితమైనది దైవశక్తియొక్క దురూహ్యత-అనివార్యత. "తావ ద్విధినా దర్శితం ప్రభుత్వమ్" ప్రతికూలముగ నున్న ఈ దైవశక్తిని ప్రసాదపరచుటకే దీర్ఘదృష్టి గల- ఆర్షదృష్టి గల- కణ్వుడు సోమతీర్థమునకు పోయినది. ఏమయిననేమి, ఈ దైవశక్తి దాని పని నది చేయకమానినదిగాదు, అంగుళీయకము మాయమైన , దుర్వాసుని శాపము ప్రకోపించినది, పతికి సమ్మోహము ముదయించినది, తనకు ప్రత్యాదేశము సిద్ధించినది. ఇది శకుంతలాజీవితమున పెద్ద ఘట్టము. ఆత్మహత్యకుగూడ ఆమెను పురికొల్పవలసిన- పురికొల్పిన-ఘట్టము, తరువాత మారీచాశ్రమమున ఆమె విరహవ్రతమును భరించినది. జీవితమునందలి భోగవాంఛలు పటాపంచలైనవి, ఈ కష్టాగ్నిలో క్రాగుటవలన ఆత్మ కొక నైర్మల్యము సిద్ధించినది, దుష్యంతుడు మరల ఆమె నంగీకరించినను ఆమె కప్పటికే ఇహజీవితమునందలి మోజు తగ్గి ఆశ్రమాంతరమును స్వీకరించుటయందు ఆసక్తి హెచ్చియుండవలెను, కాని ఈ యవస్థయందుకూడ స్త్రీజనోచితమగు మాధుర్యము ఆమెను వీడలే దనుటను "జిహ్రేమి ఆర్యపుత్రేణసహ గురుసమీపం గంతుం" అను వాక్యములో కాళిదాసు మిక్కిలి ప్రౌఢముగ నిరూపించినాడు. తాపసకన్యగ వృక్షసేచన మొన

డ్పుచు ప్రవేశించిన శకుంతల ప్రణయినియై, పెండ్లికూతురయి, గర్భవతియయి, శాపోపహతయై, దుర్భరదుఃఖాగ్నిస్థితయయి, ఆత్మవధోద్యుక్తయయి, తుదకు మరల పుత్రవతియై, పతిసమ్మానితయై ప్రౌఢనిర్భరవయఃపరిపాకమున ప్రత్యక్షమగుచున్నది.

కాని సూక్ష్మముగ విచారించినచో ఈ చిత్రణమున ఒక్క లోపముకూడ పొడకట్టుచున్నది. అది కవిసంస్కృతి ననుసరించినది. వాల్మీకియో, వ్యాసుడో ఈ నాటకమును రచించిరేని వారి శకుంతలాచిత్రణము వేరుగ నుండెడిది. కేవలము మూలానుసరణ మొనర్చినను కాళిదాసు శకుంతలా చిత్రణము వేరుగ నుండవలసినది. మూలమునుబట్టి శకుంతలజీవితము రెండుభాగములుగ విడిపోవుచున్నది. హస్తినగరమున దుష్యంతుని మరల గలసికొనువరకును ఒక భాగము. అటుతరువాత, అశరీరవాణి ననుసరించి దుష్యంతు డామెను స్వీకరించువరకు రెండవభాగము. శకుంతలయాత్మవిశ్వాసమును, అనన్యదుస్సాధ్యమగు తేజమును నిరూపింపజాలినది, అనగా శకుంతలకు భారతమహిళామండలిలో అగ్రస్థానమును చేకూర్చినది ద్వితీయభాగమే. కాళిదాసు తన చిత్రణమున లాలిత్యసీమయగు మొదటిభాగమును ఎంతో మనోహరముగ పెంచుకొనివచ్చి మాహాత్మ్యఖనియగు ద్వితీయభాగమును మిక్కిలి కుదించివైచినాడు. అత్తవారింటికి చేరుకొనువరకు, అనగా చతుర్థాంకాంతమువరకు ఆతని చిత్రణము అతిమనోహరముగ నున్నది. కాని తరువాత మిక్కిలి సంకుచితమైపోయినది. పంచమాంకమున బాహాటముగ రాజసభలో జయభేరి మ్రోగింపవలసిన శకుంతల "నవగుంఠనవతి"గ నొనర్చి పెరటిదారిని నిష్క్రమింపజేసినాడు.

# కోయిల



శ్రీ కె. అన్నమరాజ శర్మ

ఆమని చెలికాని కాతిథ్య మొసఁగ
మంగళగీతి లేమావు లందుండి
కోయిలా, వినిపింతె కుహూకుహూధ్వనుల
నిత్యసమ్మోహనాన్విత మంజురుతము
నిద్రాణ నిరసిత నీరవ సృష్టి
గానసుధాతరంగములఁ దేలించి
యెచటికో, యెచటికో యీడ్చికొంపోవు.
పంచమస్వరాన భౌతికజగతి
పరమసంతోష కవాటముల్ తెఱచి
స్వర్గలోకం బొందు సమకూర్చె త్రుటిని
ప్రాతర్విభిన్నాబ్జ పత్రంబుపగిది
నవవసంతోదయానంద భాగ్యమున
సర్వంబు చైతన్య సంఫుల్లమాయె
కమ్మని గానాబ్ధి కల్లోలహతిని
కవికుమారుని మనఃకావ్యంబునందు
భూరిప్రమోద సమ్మోహనాశ్వాస
మారంభమయ్యెఁ బ్రాయంపులేజిగికి

కన్నుమిన్నెఱుఁగని గడుసుమిటారి
కోకిలా! నీపునః కూజితశ్రుతిని
కుహూకుహూయని మాఱుకూతగూసెడిని,
వలవంత యెంతటి బాధాకరంబొ
పడుచుజంట యెఱుంగు ప్రాయం బెఱుంగు
శోణితాక్షమ! ప్రేమసూత్రంపుటురుల
బంధింప నెంచెదే పడుచుదంపతుల!
ఏ యతీంద్రియ బలం బే యోగశక్తి
యే యైంద్రజాలికం బే మహాశక్తి
మిళితమైయుండె త్వన్మృదుగానలహరి
ఊహింప నగునె రసోర్మిలతన్మ
యానందగతి దేలియాడుటదక్క -
ప్రణయినీసంగత ప్రశ్రయధ్వనియొ
భగ్నమనోదిత పరిదేవనంపుఁ
గేకలో నీ రుతి గీలింపఁ బడుట
వచియించు భారంబు పాఠకావళికె
వదలితి నే స్నేహ వాల్లభ్యవశత.



[ కథానిక ]

# దృక్పథాలు

= శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న =

ఆనాడు జూనియర్స్‌కి సీనియర్సు ఆహ్వానపు విందు. కాలేజీ కళకళలాడుతోంది విద్యార్థి విద్యార్థినీ సమూహంతో. ప్రొఫెసర్లు, స్టూడెంట్లు అందరి మొహాల్నీ చిరునవ్వు తాండవ మాడుతోంది. చక్కగా అలంకరింపబడ్డ క్లబ్ రూమ్‌లో సుఖాసీనోపవిష్టులయి అంతమందీ కబుర్లు చెప్పుకుంటున్నారు. ఒకరి నొకరు ఎరికపరుచుకుంటూ కరస్పర్శలు చేస్తున్నారు. ఆడా మగా కలిపి ఓ పాతికమంది వుంటారు; అంతా ఎం. ఏ. తరగతివాళ్లే. కృష్ణమూర్తి భువనైక మోహనమూర్తి; ఆహ్వానసంఘ కార్యదర్శిన్నీ. విశాలమయిన ఫాలభాగం, కుడిప్రక్కని కొంచెం వంకీలు తిరిగి పైకి నొక్కి దువ్విన క్రాపింగు, నిమ్మపండులాంటి శరీరచ్ఛాయ, సమమయిన ఒడ్డూ పొడుగూ—అతన్ని చూడగానే కలగజేసుకుని మాట్లాడా లనిపిస్తుంది. ఎప్పుడూ మడతలు తప్పని దుస్తులు అతను గొప్పయింటివాడని చెప్పకచెబుతూ వుంటాయి. ఆవేళ మరీ యిదిగావుంది అతని ముస్తాబు. అల్‌స్టర్ కాలరు, డిన్నరుసైక్ కాశ్మీరుసూటూ, నిగనిగలాడే బూటూ అతని అందాన్ని ద్విగుణీకరించేయి. సిగరెట్టు వయ్యారంగా పెదిమచివర నంటించి, సిల్కు రుమాలుతో కళ్లద్దాలు తుడుస్తూ తోడిస్నేహితుడితో మాట్లాడుతున్నాడు. "అయిదు నిమిషాలుంది అల్పాహారాలు పుచ్చుకునే వేళకి; యింకా ఒకరిద్దరు విద్యార్థినులు రావాలికూడాను." అంటూనే మేడ కిటికీలోనించి వాళ్లకోసం తొంగి చూస్తున్నాడు. సరీగా రెండు నిమిషాల వ్యవధి వుండనగా రత్నం, సరోజా వచ్చేరు. సరోజ కృష్ణమూర్తి స్నేహితుడి చెల్లెలు; క్లాసుమేటున్నూ. ఆమెద్వారా జూనియర్‌లో అప్పుడే చేరిన రత్నాన్నికూడా పరిచయం చేసుకున్నాడు.

వచ్చిరావడంతోనే అందర్నిలాగే కృష్ణమూర్తినికూడా ఆకర్షించింది రత్నం. కేవలం నూతన వ్యక్తి అవడంచేతనే కాదు; ఆమె మూర్తీభవించిన రతీదేవిలాగ వుండడంచేతనే. కాని రత్నం సంసారుల పిల్ల. మెడలో సన్నని గొలుసూ, చేతికి చిన్నవాచీ తప్ప యింకే అలంకారాలూ లేవు. అయినా అతి అందంగా కనిపిస్తుంది చిత్తరువులో బొమ్మలాగ. అంత మరీ గుండ్రంకాని ముఖం, సన్నని చాదుబొట్టూ,

గులాబి రెక్కల్లాంటి పెదిమెలూ, కూర్చిన ముత్యాల కోవలాంటిపల్వరుస, ఎప్పుడూ ప్రసన్నభావాన్ని తెలుపుడుచేసే మందహాసం—యివి చాలవూరత్నాన్ని సానపట్టిన రత్నంలాగ ప్రదీపింప చెయ్యడానికీ ?

అందరూ టీ ఫలహారాలు పుచ్చుకుంటున్నారు. మర్యాద తప్పకుండా ప్రతీవారితోనూ ఒకటి రెండు నిమిషాలు మాట్లాడి కృష్ణమూర్తి సరోజా, ఆమె అన్న వెంకట్రావూ ఉన్న మేజాదగ్గిరికివచ్చి కుర్చీలో కూర్చున్నాడు. మూర్తిమొహంలో ఏదో వెలితి కనిపించింది వెంకట్రావుకి. అడిగేడు "ఇవాళకొంచెం హుషారు తక్కువగా కనిపిస్తున్నావేఁవి"టని

కృ— ఏమిటో మొన్న గ్రేండుహోటలు మీటింగులాగ లేదు. అంతా మీడియోకర్.

వెం—ఏవిషయంలో ?

కృ—ఈ సమావేశమయిన వాళ్లకి అసలు స్టేటస్సేలేదు, నువ్వూ నీ చెల్లెలికీ మినహా. అంత బొత్తిగా నేలను ప్రాకులాడేవాళ్లతో కలిసికట్టుగా వుండడం కష్టం.

వెం- -బాగానేవుంది. ఇది సంఘానికి సంబంధించిన సమావేశం. ఎం. ఏ. రెండు క్లాసుల్లోనూ వున్న వాళ్లు ఒకరి నొకరు బాగా తెలుసుకోవాలనీ. విషయాలు సహకారంగా సేకరించాలనీ కొదూ దీని అభిమతం?

సరోజ—సొసయిటీలో చిన్నా పెద్దాకూడా ఉంటుంది అంతస్తు అంతమాత్రంచేత ఉల్లాసభంగం ఎందుకు చేసుకోవాలి కృష్ణా?

కృ—మీ ఉపన్యాసాలు వరవట్లు వ్రాసుకోడానికి చాల్కగా పనికొస్తాయి. కాని ఒక్కవిషయం మీరు వుభయులూ మరిచిపోయేరు. ఉల్లాసం అనేది దానంతట అది కలగాలి; ఎరువుతెచ్చుకో తగ్గది కొదు. నటించినంత మాత్రాన్ని ఆత్మకి ఎంతమాత్రం సంతృప్తి కలగదు.

సరోజ—నటించవలసినంత అగత్యం ఏమొచ్చిందీ అంట.

కృ—సమానవియ్యం, సమానకయ్యం కొక పోయినప్పుడు నటనకాక మరే ముంటుందీ?

వెం— అందరమూ పోస్టుగ్రాడ్యుయేట్సుఁ వే గదట్రా.

కృ—ఏప్పుడూ పుస్తకాల గొడవేనా ?

వెం — ఏసందర్భమయినాను. అందరమూ బి. ఏ. ప్యాసయినవాళ్ల మవడంచేత ఆత్మ-బుద్ధీ ఒక పరిణతికి వచ్చి సమస్యల్ని సమానంగా బోధపరుచుకుని చర్చించగలమని నే ననుకుంటాను.

కృ—అబ్బాయ్, నువ్వు ఎన్ని చెప్పినా ఆదర్శాలే మాట్లాడుతున్నావు. అనుసరణకీ ఆదర్శానికీ చాలా తేడావుంది.

సరోజ—సరేలే. కోడిగ్రుడ్డంత బంగారంలేనివాడున్నాడా అని వాడికోసమే వెతుక్కోవడం దోషం కాదూ?

కృ—అదే దోషమయితే నాఖర్మం. అడ్డమయిన వాళ్లతోటీ, రెండక్షరాలున్నాయి గదా అని, నేను కలిసిమెలిసి తిరగలేను.

"ఈప్లమ్ కేకు చాలారుచిగావుంది, యింకోముక్క పుచ్చుకుంటావా కృష్ణా" అంటూ ధోరణిమార్చేసింది సరోజ అర్థవంతంగా అన్నవంక చూస్తూ. ఎప్పుడూ యింతే. ఇలాంటివి ఎన్నో సంఘట్టనలు వచ్చేయి; కాని తెగేవరకూ లాగే స్వభావంకాదు సోదరీ సోదరులది. ఇంక కృష్ణమూర్తి మనస్సు చివుక్కుమంటుందనేసరికి ఎవరో ఒకరు పట్టా తప్పించేస్తారు.

కృష్ణమూర్తి తండ్రీ, వెంకట్రావు తండ్రీ బాల్యస్నేహితులు; ఇరుగుపొరుగు గ్రామాలకి ప్రొప్రయిటర్లున్ను. కృష్ణమూర్తి తండ్రి చిన్నతనంలోనే కాలం చెయ్యడంచేత అతనివ్యవహారాలన్నీ వెంకట్రావునాన్నగారే చూస్తూ ఉండేవారు. అదే కారణం కృష్ణుడూ, సరోజా-వెంకట్రావులూ 'ఏకగర్భజనితుల్లాగ వుండడానికీ, ఒకరినొకరు అర్థంచేసుకోడానికిన్నీ. వెంకట్రావుతండ్రి నాలుగుదేశాలు తిరిగినవాడు; అతని ప్రొప్రయిటరీ అంతా స్వార్జితం. కష్టం సుఖం అనుభవించినవాడవడంచేత హృదయ వైశాల్యం ఏర్పడింది. ఆ అంకురాలు సంతతిలోకూడా నాటు

కున్నాయి. కృష్ణమూర్తి తండ్రి ఆగర్భ శ్రీమంతుడు. తాతముత్తాతలనాటినుండీ వస్తూన్న జమిందారీ. చిన్నప్పట్నుంచీ గుర్రబ్బగ్గీల్లోను, మోటరుకార్లలోను కాలం వెళ్లబుచ్చినవాడు. అంచేతే కృష్ణమూర్తికి కూడా దర్జా ప్రధానం. ఎంతచదువుకున్నా మాటల్లో నూ, చేష్టల్లోనూ అహం కనిపిస్తూ ఉంటుంది. తను అవగాహన చేసుకోలేని విషయం లేదనే తొందర పాటుకూడాను.

ఈ పరిస్థితుల్లో రత్నం పక్కలో బల్లెంలాగ ఉండేది అతనికి. రత్నం ప్రపంచకాన్ని ఎప్పుడూ సరళంగా అర్థంచేసుకునేది. తన అంతస్తూ, ఎదటివారి మనస్సూ గుర్తించి మెలగనేర్చిన మనిషి. అనవసర విషయాలలో ఎప్పుడూ జోక్యం కలుగజేసుకునేది కాదు; కాని తాను కలగజేసుకోవలసేవస్తే, విషయాన్ని కూలంకషంగా గ్రహించి మథించి తన వ్యక్తిత్వాన్ని స్థాపించుకుంటూవుండేది. ఈమె అంటే అందరికీ అంతగౌరవం ఏర్పడ్డానికి ఈమెకుశాగ్రబుద్ధే కారణం. కాని కృష్ణమూర్తిమాత్రం ఎంతైనా తనకంటె పై చెయ్యికాదని అపోహపడుతూవుండేవాడు. అసలామెవిషయంపట్టించుకునేవాడుకాదు. సమానవియ్యం (Statusquo) కావలసినవాడాయిరి! అలాగని ఊరుకోనూలేకపోయేవాడు ఆమెనిగురించిన ప్రశంసలని వింటూ.

ఇంతట్లోకి "కాలేజిడే" ఉత్సవంసమీపించింది. ఆటపాటలపోటీలు జరిగే సమయం; సత్తా తెలియవలసిన ఆవశ్యకమున్నా. ఒకనాడు సాయంత్రం వెంకట్రావు, సరోజ, రత్నం కలిసి టీ త్రాగుతూవుంటే కృష్ణమూర్తి వచ్చేడు. సరోజప్రక్కని రత్నాన్ని చూడ్డంతోటే అతని ఉత్సాహం కొంత తగ్గింది. ఆ విషయం సరోజా వెంకట్రావులు గమనించకపోనూ లేదు. మాటలధోరణి కాలేజీ పోటీలవైపు మళ్లింది. రత్నం విజ్ఞానాన్ని వెంకట్రావు, అతని చెల్లెలు హృదయపూర్వకంగా మెచ్చుకుంటూ మాట్లాడుతున్నారు. కృష్ణమూర్తికి యిది కష్టంగా తోచినా, బాగుండదని, ఏమయినా "టిప్స్" యిమ్మన్నాడు రత్నాన్ని సంబోధిస్తూ.

"మీరు నాకంటె సీనియర్సు. మీకు నేనేం హింట్సు యివ్వగల్ను? మీదగ్గర నేర్చుకోవాలిగాని" నిజమే నమ్మకోండి. అయినా..."అని అర్థోక్తిలో వదిలేసేడు కృష్ణమూర్తి. దాని ధ్వని రత్నం వెంటనే గ్రహించింది. డబ్బుగలవాడయినంత మాత్రాన్ని అన్నిసుగుణాలూ తనకైవసం అయినట్టు భావిస్తున్న వంగలి గదా అని విచారించింది; కోపం తెచ్చుకుంది. ఈమధ్యలో యింకోపొరపాటుకూడా చేసేడు కృష్ణమూర్తి. "ఎల్లుండి నా పుట్టినదినం. మీరు ఉభయులూ భోజనానికి రావాలి" అన్నాడు సరోజ వైపు చూస్తూ; ఆమె కళ్లతో ఏమందోమరీ, ఉత్తరక్షణంలోనే "మీరున్నూ" అన్నాడు రత్నంవంక తిరిగి. దీంతో ఆమెకి అతనితత్వం బాగా బోధపడిపోయింది. ఆమెహృదయం హేయభావంతో నిండిపోయింది. అయినా మర్యాదభంగం కలగకుండా "చాలా సంతోషం" అంది. యింటికి వచ్చి వెంటనే "మీపుట్టినరోజు పండగకి నా అభినందనాలు. కారణాంతరాలచేత మీయింట భోజనానికి రాలేను. క్షమించండి" అని ఓ ఉత్తరం ముక్క వ్రాసి టపాలో పడేసింది.

ఆరోజు స్వర్ణాక్షరాలతో లిఖించుకుందిరత్నం. అదే ఆమెకి ప్రథమవిజయం లభించిన దినం. రంగు కాగితాల దండలతోను, అరటి స్తంభాలతోను అలంకరించిన షామియానాలో పౌరులూ, విద్యార్థులూ అంతా కూర్చున్నారు. అయిదుగురు తనుమనుష్యులు మేజా వద్ద వేదికపైని వున్నారు. ఉపన్యాసాలపోటీ సరిగా వేళకి ప్రారంభించేరు. ప్రేక్షకులలో ఉత్సాహం, చర్చలూ బయలుదేరేయి. ఇంతట్లోకి కృష్ణమూర్తి వంతు వచ్చింది. అతను వేదికమీద కనిపించగానే చప్పట్లు మిన్నుముట్టిపోయినాయి. లోకం గొర్రెల మందలాంటిది. ఒకడు దారితీస్తే సరి. ఒకడు ఓడు అంటే కంచమంతా ఓడే. లేకపోతే అతను నోరు విప్పకుండానే అంతగల్లంతు ఎందుకూ? కృష్ణమూర్తికి సత్తా ఒక యెత్తూ, అంగులు రెండెత్తులూనూ. అసలు

పసలోవున్న వెలితిని పోకూ, పోజూ, గ్రేసూ కప్పేస్తూ వుంటాయి. గత నాలుగైదుఏళ్ల బట్టీ ఆకాలేజీలోనే చదివినవాడేమో స్థానికబలంకూడావుంది. ఉపన్యాసం ముగిసేసరికి ప్రేక్షకలోకంలో హర్షధ్వానం మరీ యినుమడించిపోయింది. ఆఖరుకి రత్నం మాట్లాడవలసి వచ్చింది. ఈమె పూర్వోత్తరాలు ఎవ్వరికీ తెలియవు. ఆమె ఆరంభించేసరికి నిష్పాక్షికదృష్టులే ప్రసరించేయి. కాని మొదటి అయిదునిమిషాలు అయేలోపలే ముమ్మారు "హియర్ హియర్" అనే కేకలు విన వచ్చేయి. ఒకానొక సందర్భంలో కరతాళధ్వనులకి అంతం లేనట్టు కనపడి, ఆమె చెప్పేమాట వినపడ కుండా పోయేసరికి, ఒక్క క్షణం తాత్కాలికంగా ఉప న్యాసం ఆపి మరీ అందుకోవలసివచ్చింది. అయిదుగురు న్యాయమూర్తులూ — ఒక్కవీరేనేవిఁటి ? — యావన్మంది సభ్యులూ ఆమెకే చెవులు అప్పగించేరు. ఒకసారి కృష్ణమూర్తే అన్నాడు "భేష్" అని అప్రయత్నంగా, తరవాత నొచ్చుకొన్నానూ. చివరకి ఫలితాలు చెప్పేరు. మొదటి బహుమానం రత్నానిది ; రెండోది కృష్ణుడిదిన్నీ. న్యాయం సరిగ్గానే జరిగిందని కృష్ణుడి అంతరాత్మకీ తెలుసును. అయితేనేం ? అతనిలోని అహం ఆ భావాన్ని వెలికి రానిచ్చింది కాదు. ఒకళ్లిద్దరు ఆత్మీయులు కృష్ణుడి ప్రవర్తనకి కించపడి మందలించేరుకూడాను.

సరే యీ ఆడదాన్ని ఆటల్లోనైనా ఓడించలేక పోతానా అనుకున్నాడు మూర్తి. యిద్దరూ మర్నాడు టెన్నిసుకోర్టులో నిల్చున్నారు. ప్రేక్షకజనంలో ఉత్సాహానికి అంతు లేదు. సమాన ఉజ్జీ అన్నారు కొందరు. కృష్ణమ్మూర్తి నెగ్గేస్తాడన్నారు మరి కొందరు. ఏమో చెప్పలేం; నిన్నమా యిలానే అనుకున్నాం అన్నారు యింకా కొందరు ఆత్మప్రబోధం కలిగినవాళ్లు. ఆ అమ్మాయి గంభీరమయిన ముఖవర్చస్సులోనే తెలియడంలేదూ విజయసూచన అన్నారు పెద్దలు. ఆట మొదలయింది. స్నేప్ షాట్సుకోసం సిద్ధమయినవాడిలాగ ఎడమచేత్తో బంతి నెగరేసి విల్లు వంపుగా కుడిచెయ్యి చాచి సెర్వ్ చేసేడు కృష్ణుడు. బంతి రివ్వున ఎగిరి "నెట్టు" ని డీకొని ప్రక్కకి తొలిగింది. కట్. చేతిలో రెండోబంతిని ప్రయోగించేడు. రత్నం అణుమాత్ర మయినా చలించకుండా బేటు బల్లపఊపుగా వుంచి బంతిని అధోతలాన్ని స్పృశించింది. "బ్యూటిఫుల్ స్మాష్" అన్నది ప్రేక్షక లోకం. వయ్యారంగా భ్రమిస్తూ వస్తూన్న బంతిని ఆచిపెట్టి తట్టేడు కృష్ణుడు. తగిన సమయస్ఫూర్తితో బేటుఅంచు అడ్డుపెట్టి తిరిగి వచ్చినచోటికే దాన్ని పంపించింది రత్నం. "ఫైన్ కట్" అని కేకలు చెలరేగేయి. కృష్ణుడు అందుకోలేకపోయేడు. గేలరీలో గోల అతన్ని కలవరపరిచింది. ఆ తొందర్లో కొంచెం ముందుకువంగేసరికి కాలు జారిందికూడాను. ఏమయితేనేం ? అయిదు పాయింట్లతో రత్నమే గెలిచింది. తెచ్చిపెట్టుకున్న మందహాసంతో కరస్పర్శ చేసి కంగారు కప్పిపుచ్చుకున్నాడు కృష్ణుడు.

## 3

సాయింత్రం సుమారు ఆరుగంట లవుతుంది. తమ్ముణ్ణి ఎత్తుకుని పార్కులోకి వచ్చింది రత్నం. కృష్ణమూర్తి అక్కడికి రావడం తటస్థించింది. రత్నాన్ని మొదట్లో చూసీచూడనట్టు ఊరుకుందా మనుకున్నాడు. కాని మనస్సులో ఏదో గుంజులాటగా వుంది. తటపటాయిస్తూ అటు మొగం పెట్టి నిల్చున్నాడు. అతను పలకరించకుండావుంటే తనుమాత్రం ఎందుకు మాట్లాడాలని తటస్థంగా వూరుకుంది రత్నం. ఎట్టకేలకి కృష్ణుడే దగ్గిరికి వచ్చి, చిన్న దగ్గుతో గొంతుక సవరించుకుని ప్రారంభించేడు—

"హల్లో! మీరు జౌనా కాదా అని మొదట్లో సంకోచించేను."

"అవునండీ, ఇంట్లో వంటా వార్పూ మూలాన్ని సాధారణంగా తీరిక గాదు."

"ఏం ? మీ యింట వంటలక్క లేదూ?"

"వంటమనిషి చేసిన వంటా, ప్రయివేటు మేష్టరు చెప్పిన చదువూ వంటపడతాయిటండీ?"

ఈ మాట కృష్ణమూర్తికి కొరడా దెబ్బలాగ

తగిలింది. ఇంగ్లీషుకని దొరని ట్యూటరుగా పెట్టుకున్నాడు. అయినా పోటీలలో మొదటి బహుమతి రాలేదాయిరి! కాస్సేపు మౌనముద్ర వహించి తిరిగీ అందుకున్నాడు. విసురుగానే వెళుతున్నాయి మాటలు. చివరకి యింకపట్టలేక అనేసేడు: "మీకు చాలా మనోధైర్యం ఉందండీ"

"ఔను; మీకు నమ్రతానూ"

"ఛలోక్తి మీదగ్గిరే నేర్చుకోవాలి"

"నిదానం మీదగ్గిరానూ"

"మీరు పరుషంగా మాట్లాడుతారు"

"దైన్యత భరించగలంగాని హైన్యం సహించలేంగదా"

"నేనంటే మీకుకోపమా?"

"నామాటల్లో అటువంటిభావం మీకు స్ఫురిస్తే అది నేను ఉద్దేశించలేదని నమ్మండి."

"ఈ సంభాషణ నామట్టుకు నాకే వింతగా కనిపిస్తోంది. మనం వివాహంచేసుకుంటే సంతతికి నా అంతస్తూ, మీ తెలివి తేటలూ వస్తాయేమో?"

"బెర్నార్డుషాని యిటువంటి ప్రశ్నే వేస్తే యేం జవాబు యిచ్చేడో మీకూ తెలుసునుగా?"

"నేను నోరువిడిచి మిమ్మల్ని అడుగుతున్నాను. ఇదే తొలిసారికాదు."

"మీరంత క్రిందికి దిగి పోవలసిన అవసరంలేదు. నేను నిరాకరిస్తున్నాను...క్షమించండి. చీకటిపడుతోంది. మళ్లీ కలుద్దాం."

రత్నప్రదీపికారోచిస్సులు నానాటికీ నలుదిశలూ వ్యాపించిపోతూ వుంటే కృష్ణమూర్తికి పచ్చివెలగకాయ గొంతుకపడ్డట్టుంది. ఒకవైపు అహంపట్టుకు వదలదాయె; మరొకవైపు రత్నం ప్రతిభావిశేషాలు అయస్కాంతంలాగ తీవ్రంగా ఆకర్షిస్తున్నాయి. అక్కడికీ తన మనోరథం తెలియజేసేడు. బెట్టుసరి మూలాన్ని వ్యవహారం పొసిగిందికాదు. అయినా ఆమె అంటే అతనికి గౌరవం తగ్గలేదు; కాగా, రోజురోజుకీ అది మరీ ఎక్కువయి మమకారంతో మిళితమయి పోతోంది. సెమ్మదిగా యీసంగతి సరోజా వెంకట్రావులతో అన్నాడు.

"నేను ఎరుగానే ఎరుగుదువట్రా, నువ్వు కాస్త రెండు కళ్లూ విప్పి ప్రపంచకాన్ని చూస్తేగాని లాభం లేదని?" అన్నాడు అంతావిన్న వెంకట్రావు.

కృ—నేనేం తప్పుచేసేనో నాకే తెలియడం లేదు.

"నీ మోహం. నలుగురితోనూ సమానంగా తిరగపోవడమే ఒక గొప్పతప్పు. అలాంటివాడివి నీ నాలుగుగోడల మధ్యా పడివుండాలి."

"అంటే నే నా అమ్మాయి అంతస్తుకి దిగిపోవాలన్నమాట."

"నువ్వు ఎక్కడికీ దిగి పోనక్కరలేదు. ఉన్నవాళ్లు తింటారు లేనివాళ్లు పస్తుంటారు. ఆగొడవ నీకెందుకూ? చేతనయిందా చేతనయిన సాయం చెయ్యి; లేదా వూరుకో. అంతే గాని పేదవాళ్లంటే విసుగెందుకూ? కూటికి పేదలయితే కులానికి పేదలా? వాళ్లకి మట్టుకు తెలివితేటల్లేవా?"

"అదీ నిజమేలాగ కనిపిస్తుంది."

"ఇంకొక్కముక్క జ్ఞాపకంవుంచుకో. నువ్వు కదిపేవు కనక చెబుతున్నాను. ఒకర్ని చిన్నతనం పుచ్చడం ఏమంత మహావిశేషంకాదు; ఏఒక్కరి స్వంత హక్కున్నూ కాదు. దానికీ అనేకమార్గాలున్నాయి."

దీంతో కృష్ణమూర్తి వెర్రివాడిలాగ చూస్తూన్నాడు నిశ్శబ్దంగా సిగరెట్టుపొగ వొదుల్తూ.

※

"నువ్వు చాలా అదృష్టవంతురాలివి రత్నం"

"ఏవిషయంలో సరోజా?"

"కృష్ణుడు నిన్ను వరించేట్టుగా"

"అందుకే నువ్వు నన్ను అభినందిస్తున్నట్టయితే నాకన్న అదృష్టహీనురాలు యింకొకర్తె ఉండదనుకో"

"ఏం?"

"అన్నీ తెలిసి నువ్వూ అలాగ అడుగుతావేం సరోజా? అతను గాలిలో ఎగురుతాడు; నేను నేలని వదలను. అతనికి దర్జా కావాలి; నాకు గొప్పతనంతో పనిలేదు. అతను ప్రతిభాశాలినని భావిస్తాడు; నేను నేర్చుకోతగ్గవిషయాలు లక్షలున్నాయని నాకు తెలుసును. మాయిద్దరి బుద్ధులూ వ్యత్యస్తమార్గాలని సంచరిస్తూవుంటాయి. ఇంక మాకు ఎలాగ పొసుగుతుంది? ఒక్కశాఖవాళ్లం అయితేసరా?"

"అతని ప్రవర్తనలో మార్పువస్తేనో?"

"మిట్టమధ్యాహ్నం తకీమని సూర్యు డస్తమించి చంద్రు డుదయిస్తేనో?"

"చూస్తావుగా"

"శల్యసారథ్యంకాబోలు"

"నీకే తెలుస్తుందిలే శల్యసారథ్యమో కృష్ణసారథ్యమోను"

"ఎందు కీవేళాకోళం?"

"అతనంటే నీకు అసహ్యమా?"

"అతని ప్రవర్తనా, సంకుచితబుద్ధీ ఏహ్యంగా కనిపిస్తాయి నాకు"

"తదితరలక్షణాలమాట"

"మౌనం అర్ధాంగీకారమా?"

"నేను యిదమిత్థం అని నిర్ణయించలేకుండా వున్నాను"

"అతను నీక్షమాపణకోసం కలవరిస్తున్నాడు"

"నేను ఒక్కర్తెనీ క్షమించవలసినవిషయం ఏఁవీలేదు"

"అతని ప్రవర్తనలో మార్పువచ్చిందంటే నమ్మతావా?"

"ఈనెల్లాళ్ల సెలవల్లోనే? యింతకీ లోకమే తన్నిర్ధారణచెయ్యాలిగదూ?"

ఆర్నెల్లయింది. రత్నానికి అంతా అయోమయంగా కనిపిస్తోంది. కృష్ణమూర్తి ప్రతివాళ్లతోటీ సరదాగా తిరుగుతున్నాడు. తనతో మాట్లాడేటప్పుడు తండ్రిదండన జడిసిన బిడ్డలాగ ప్రవర్తిస్తున్నాడు. అయినా ఎవరినోటచూసినా "కృష్ణమూర్తికి కళ్లు విచ్చా" యన్నమాటే. సాధారణంగా క్లబ్‌రూమ్‌లో ఏ విదేశపత్రికో పుచ్చుకుని కూర్చునేవాడు నిన్నా నేడూ స్నేహితుల యోగక్షేమాలు కనుక్కుంటున్నాడు. ఒకళ్లిద్దరు బీదవిద్యార్థులకి జీతాలు కట్టేడని కూడా వినికిడి. బర్మా ఇవేక్యూయీలకి భోజనాలు పెట్టేసమయంలో తను స్వయంగా నడ్డికట్టుకుని యిత్తడిచేట పట్టుకున్నాట్ట; కొందరికి బట్టలుకూడా యిచ్చే డంటున్నారు. ఇదంతా నిజమేనా? తన కళ్లనీ, చెవులనీ తనే నమ్మలేకుండా వుందా?...

శ్రావణ భాద్రపదాలు. అరగంటకి కాలేజీ విడుస్తారనగా కారుమబ్బులు కమ్మి కుంభవృష్టి కురిసింది. ఇంకా చిన్నచినుకుపడుతూనే వున్నా జనం నెమ్మదిగా గొడుగుల ఆసరానియిళ్లు చేరుకుంటున్నారు. రత్నం రిక్షామాట్లాడుకుంటోంది. ఇంతట్లో కృష్ణమూర్తి తన కార్లోకి ఆహ్వానించేడు. గమ్యస్థానాలు భిన్నదిశలనున్నాయని మొదట్లో నిరాకరించింది రత్నం; కొసకి అతడి బలవంతంమూలాన్ని ఒప్పుకోక తప్పిందికాదు. రోడ్డు నిరాటంకంగా వుండేమో పదినిమిషాల్లో రత్నం యిల్లు చేరుకుంది కారు. తను దిగకుండానే "ఇంక నాకు సెలవా? మీకు యీమాత్రం పరిచర్య చెయ్యగలిగినందుకు ధన్యుణ్ణి" అన్నాడు కృష్ణుడు. టీ పుచ్చుకుని వెళ్లమంది రత్నం. అదే ప్రథమం కృష్ణమూర్తి వాళ్ల యింట్లో కాలుపెట్టడానికి. సావిట్లో ఆమె నాన్నగారు కనిపించేరు. రత్నం వారిరువురికీ పరిచయంచేసి టీ తేవడానికి లోపలి కెళ్లింది. ఆ పావుగంటలోనూ వారిద్దరికీ ఎంత ఆంతర్యం ఏర్పడిందో మరి "అంత గొప్ప యింటి బిడ్డయినా ఎంత నమ్రతా కృష్ణమూర్తికి" అన్నారు రత్నంనాన్నగారు రాత్రి భోజనాలదగ్గిర. బహునిదానమయిన మనిషి తనతండ్రే అన్న యీమాటవిని రత్నం చాలా ఆశ్చర్యపోయింది.

మరి రెండు నెలలకల్లా ఆమె మృదుల హస్తాన్ని వజ్రపుటుంగరం అలంకరించింది!

# కోహిమా, కాబాలపై
## మన డేగల వీరవిహారం

"...నేడు మన విమానాలు శత్రుప్రదేశాలపై దాడులుజరిపి, వేలకొలది పౌనుల బరువుగల బాంబులను వర్షించి, శత్రుస్థానాలపై, దుర్గాలపై, సైనిక శిబిరాలపై గట్టిదెబ్బ తీశాయి..."

ఇది ఒక మెచ్చు ప్రకటన. దీనివెనుక భారత వైమానికుల సాహసకృత్యాలతో కూడిన వీరగాథలున్నాయి. వారికి అప్పగించబడిన బాధ్యతను నెరవేర్చగల సామర్థ్యం వారికి వున్నట్టు యివి స్పష్టపరుస్తున్నాయి. ప్రపంచంలో మరెక్కడాలేని అధ్వాన్న వాతావరణంలో, కష్టభూయిష్టమైన ప్రదేశంలో ఆకాశంలో నేమి, నేలమీద నేమి, వారు చూపిన ధైర్యం, చాకచక్యం, సహనశక్తి అత్యద్భుతమైనవి. వారిని తెలిసినవారు, వారి పనులను చూచినవారు భారత సైనికులను వేనోళ్ళ కీర్తించారు.

ఈనాడు భారత విమానదళంలోని ఫైటర్లు, డైవ్-బాంబర్లు, పర్యాలోకన విమానాలు విశేషబలంతో అధిక సంఖ్యగా శత్రు ఆక్రమిత అరకాన్, బర్మా రంగాలలో ముట్టడులు జరుపుతున్నాయి.



వారి విమానాలు కోహిమా, కాబాలపై వీరవిహారం చేశాయి. నేడు అవి బర్మాపై విహరిస్తున్నాయి. భారత విమానదళంలోని "తుఫాను విమానాలు", "పగతీర్చుకొనే విమానాలు" జపానువారిని మారణహోమం చేస్తున్నాయి. జపానువారిని భీకరమృత్యువు పాల్జేస్తున్నాయి. భారత వైమానికులను చూచుకొని ఇండియా గర్వపడుతున్నది.

ఎందుకంటే వారు ఈ సంగతిని రుజువుచేశారు

# జపానువారిని మనం కొట్టగలం

# మనము వారిని తిరుగకొట్టుతున్నాము

యు యుద్ధరంగ ప్రచురణ

# ఆంధ్రదేశంలోని అద్భుతజలపాతాలు



౧. డుడుమా జలప్రపాతము

జయపుర సంస్థానములో మల్కానగిరి తాలూకాయందు బడిగోడోవద్ద నున్నది. దీని యెత్తు 540 అడుగులు.

[ఛాయాచిత్రకారుడు: శ్రీ తలిశెట్టి రామారావు.]

# దైనిక జాతకము



శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు

పూర్వజన్మమందలి కర్మవిశేషపు పరిపాకఫలముగా ఈజన్మమున మానవులకుఁ గలుగు శుభాశుభఫలము లిట్టివని జన్మకాలిక గ్రహభావస్థితులు సూచించు ననుట జ్యోతిషశాస్త్ర సంప్రదాయము. శుక్రుఁడు శుభమొసఁగూర్చు నని, శని దుఃఖమును తెచ్చిపెట్టునని పారిభాషికముగా వాడుట సంప్రదాయమైనను గ్రహములు మానవులకు శుభాశుభఫలములను తమంత తామే తెచ్చియీయవనియు, స్వకీయకర్మానుగుణముగా మానవులకు రానున్న మంచిచెడుగులను జాతకమందలి గ్రహస్థితులు మునుముందుగా సూచించుననియు ప్రాచీనహోరాశాస్త్రతత్త్వవేత్తల సిద్ధాంతము. అంధకారమున నున్నవారికి చుట్టునున్న ద్రవ్యములను దృగ్గోచరము చేయు విషయమున దీప మెంత ఉపయోగకారియో, కాలగర్భమం దణఁగియున్న భవితవ్యతయొక్క ఆనుకూల్యప్రాతికూల్యముల నెఱుఁగు విషయమున జాతక మంత ఉపయోగకారి యని కల్యాణవర్మ స్పష్టముగా విశదీకరించెను.

"యదుపచిత మన్యజన్మని
　　శుభాశుభం తస్య కర్మణః పక్తిం
వ్యంజయతి శాస్త్రమేత
　　త్తమసి ద్రవ్యాణి దీప ఇవ. 　(సారావళి)

ఇంచుమించుగ పాశ్చాత్యుల సిద్ధాంతముసయిత మిట్టిదే.

**"The planets condition ; they do not compel"** ("గ్రహములు పరిస్థితులను కల్పించును. అవి నిర్బంధించవు.") అనుట వారి ముఖ్యసూత్రము. అది యట్లుండె.

గ్రహములు సూచించు ఫలమును సామాన్యముగా రెండువిధములుగా విభజించవచ్చును: బాహ్యము, ఆభ్యంతరము అని. బహిః ప్రపంచమునకు వ్యక్తుల చర్యతోఁ గల సంబంధమును దెలుపునట్టిది బాహ్యఫలము; ఇది కార్యరూపమయినది. వ్యక్తుల సహజమైన ఆంతరంగికస్వభావమును సూచించునట్టిది ఆభ్యంతరఫలము; ఇది గుణరూపమయినది. క్షమ, దయ, శౌర్యము, ధైర్యము, సాహసము, లజ్జాశీలత, దాతృత్వము, వివేచనాశక్తి, రసపిపాస, ఉపజ్ఞ, శాంతమనస్కత ఇత్యాదులు గుణరూపములు. స్పర్థ, కలహము, సల్లాపము, వస్తుసృష్టి, ద్రవ్యనాశనము, వ్యక్తిశిక్షణము, శిల్పక్రియ ఇత్యాదులు కార్యరూపములు. గుణరూపములగు ఫలములు వ్యక్తులలో సార్వకాలికముగా గోచరమగుచుండవచ్చును. కాని, కార్యరూపములగు ఫలములుమాత్రము, ఏవో కొన్ని దినములలోనే, కొన్ని సందర్భములయందే వ్యక్తి జీవితములలో కానవచ్చుట యనుభవసిద్ధమగు విషయము.

ఉదాహరణార్థమై దశమాంగారకయోగమును గైకొందము. కుజుఁడు తన పరమోచ్చస్థానమగు మకరరాశి ౨౮-వ భాగలో నున్న దినమున, ఆ భాగయే దశమకేంద్రమధ్యముగా నొక పురుషుని జాతకమునఁ గల దనుకొందము.

"కులే తస్య కిం మంగలం మంగలో నో
జనై ర్ధ్యాయతే మధ్యభావే యది స్యాత్,
స్వతస్సిద్ధపే వావతంసీయతేసౌ
వరాకోఽపి కంఠీరవః కిం ద్వితీయః"
　　　(చమత్కార చింతామణి)

అనరీతి శౌర్యము, పరాక్రమము, దుష్ప్రసహ్యత, స్వాతంత్ర్యప్రీతి, జంకుగొంకులులేని సాహసము, నిర్భీకతతోడి పురోగమనకాంక్ష ఇత్యాది ధర్మము లాపురుషుని నైజగుణములలో సర్వదా కానరావచ్చును. కాని ఆయుధకేళీవిహారము, యుద్ధాచరణము, సాహసకార్యకరణము, శత్రుశిక్షణము మొదలగు బాహ్యవ్యాపారము లతని జీవితమున అనుదినము సంభవించుచుండుట అస్వాభావికముకదా? సామ్రాజ్యమందలి సర్వసేనాధిపతియైనా, సాహసకార్యములను ప్రతిదినము చేయుచుండు ననుట అసంభవము. అగుటచే, బాహ్యఫలములు వ్యక్తిజీవితములలో కానరాఁగల దినము లేవో కొన్నిమాత్రమే యుండఁగలవని తేలును. అట్టి దినములకు జాతకముతో నేమైన సంబంధ ముండునా యనుట విమర్శింతము.

గ్రహముల ఫలసూచకత్వము వ్యక్తిజాతకములలో నవి యున్న ప్రత్యేకస్థానముల నాశ్రయించినది. అనఁగా, రాశివలన, భావమువలన మాత్రముకాక ఇతరగ్రహములతోటి దృష్ట్యాది సంబంధములచే ఆ స్థానముల ఫలములలో నొక ప్రత్యేకత కలదనుట. కాని, ఆ ఫలసామగ్రి జన్మారంభమందే పరిపక్వత నందఁజాలదు. గ్రహములా, తమ స్థానములలోనే శాశ్వతముగా నుండవు. తమతమ ప్రత్యేక గతినియమముల ననుసరించి అవి నిరంతరము ఖగోళమున పర్యటనము చేయుచునేయుండును కదా? మఱి, అవి తమ సూచనల నెపుడు చేయుట? చారవశమున జన్మకాలిక స్థానములకు మరల వచ్చినపుడే తమ వాగ్దానము నెరవేర్చుటకు గ్రహములకు మంచి యవకాశ మేర్పడు ననవచ్చును. సత్యమే! కాని, అట్టి దినములు రవిబుధశుక్రులకు రమారమి ఏఁడాది కొక్కమారు వచ్చును. కుజునికి ౧౮ మాసముల కొకమారు, గురువునకు ౧౨ సంవత్సరముల కొకమారు, శనికి ౩౦ సంవత్సరముల కొకమారు మాత్ర మట్టి యవకాశము లభించుచున్నది. ఇఁక వరుణగ్రహము జన్మకాలికస్థానమునకు వచ్చు భాగ్యము మన దేశమున నిప్పటిస్థితిలో వేయింట ఏ ఒకరిద్దరికో రాఁగలదు. ఇంద్రగ్రహవిషయమున నిస్సందేహముగా నిది అసంభవమే (అమితాయుర్దాయము గల యోగులకు తప్ప). ఇంత వ్యవధి కావలసివచ్చెనేని, గ్రహముల ఫలసూచకత్వముతో మన కుపయోగమే యుండదు. కావున, వేరుమార్గ మొక్కటి యుండక తీర దని సులభముగా నూహించుట కవకాశ మున్నది.

జాతకకుండలిలో ఆయువుపట్లవంటి ౪ ప్రధానస్థానములు కలవు. లగ్న, దశమ, సప్తమ, చతుర్థ భావబిందువు లవి. ఇతర స్థానములకన్న వీనియందే హెచ్చుగా ప్రధానఫలములు కేంద్రీకృతము లగుటచే, వీనికి కేంద్రములని వ్యవహారము వచ్చినది. జన్మకాలమున పూర్వదిశా హరిజమున (Horizon) ఉదయమగు భాగ లగ్నకేంద్రము. అపు డస్తమించు భాగ, అనగా లగ్నమునకు ౧౮౦ వ భాగ సప్తమకేంద్రము. జన్మకాలమున ఆకాశమధ్యము నలంకరించియున్న భాగ దశమకేంద్రము. దీనికి ౧౮౦ భాగల దూరమున పాతాళమధ్యమం దున్న భాగ చతుర్థకేంద్రము. ఇవి నాల్గును కుండలికి నాలుగుదిక్కులు. లగ్నమును తూర్పుగ, దశమ కేంద్రమును దక్షిణముగ, సప్తమ కేంద్రమును పశ్చిమముగ, చతుర్థ కేంద్రమును ఉత్తరముగ వ్యవహరించుట జ్యోతిషశాస్త్రసంప్రదాయము. ఇతరప్రదేశములలోని గ్రహములకంటె కేంద్రములందలి గ్రహముల నుండియే— మంచివో, చెడ్డవో — ఫలములు హెచ్చుగా ప్రకాశమునకు రావలయుననుట సర్వసమ్మతమగు విషయము. కావననే, కేంద్రములలో శుభగ్రహము లుండవలయు ననియు, పాపగ్రహము లుండరా దనియు మనవారు కోరుట! కేంద్ర మే భాగకలలో నున్నదో ఆ భాగకలయందు గ్రహ మున్నప్పుడే గ్రహభావ సంబంధమువలన మనకు రావలసిన ఫలములు పూర్ణముగా నుండుననియు, ఆ స్థానమునకు కొంత వెనుకనో, ముందో గ్రహ ముండెనేని, అట్టి ఫలముల పరిమాణము సయితము కొఱతపడు ననియు శాస్త్రము చెప్పుచున్నది.

" భావాంశతుల్యః ఖలు వర్తమాన
భావోద్భవం పూర్ణఫలం విధత్తే,

భావోనకే చాప్యధికేచ భేశే
త్రైరాశికే నాత్ర ఫలం ప్రకల్ప్యం."

అని శ్రీపతి.

అగుటంబట్టి, ఫలసూచక గ్రహము కేంద్రములనాశ్రయించిన దినములలో సయితము తత్ఫలము కార్యరూపముగ కానరావచ్చుననుకొందము. కాని, బృహస్పత్యాది మందగతి గ్రహముల విషయమున అట్టి దినములు కూడ చాల అరుదుగా నుండఁగలవు. భచక్రమున బృహస్పతి యొకసంవత్సరకాలమొకరాశిలో నుండుటచే, మూఁడేండ్ల కొకతూరి కాని ఆ గ్రహము కేంద్రమునకు రాదు. ఇఁక, శని కేంద్రమునకు రావలెనన్నచో ౩౦ సంవత్సరములు పట్టును. అట్లే వరుణునికి ౧౬౫ సంవత్సరములు, ఇంద్రునికి ౮౪ సంవత్సరములు కావలసియుండును!

ఈగ్రహములు సూచించు ఫలములు-కొంచెముగనో, గొప్పగనో-జీవితములో కార్యరూపము దాల్చుటకింత కాలవిళంబ ముండుట అసహజమని యనుభవము చెప్పుచున్నది. కాక, కొన్ని ప్రబలమైన శుభాశుభ పరిణామములు జీవితములో కలిగిన దినములలో జన్మకాలిక గ్రహములు స్వస్థానములకు కాని, లగ్నమునకు కాని కేంద్రములయందు లేకుండుటయు చూచుచున్నాము. జాతకమునందలి కేంద్రములతో గ్రహములకు సంబంధమే లేని దినములలో ప్రబలఫలములు కార్యరూపములు కానవచ్చుట సాధ్యమైనచో, కేంద్రస్థానములకు శాస్త్రకారులు చెప్పిన యాత్మ్యముఖ్యమున కర్థ ముండదుకదా? కావున ఫలసూచక గ్రహములు దైనందినచారవశమున కేంద్రములకు వచ్చుపద్ధతితో కాక, వాని వ్యాప్తిని, లేక సంబంధమును కేంద్రస్థానములకు తెచ్చుమార్గము వేరొకటి యుండితీరవలె నని తేలుచున్నది.

మనము నివసించు నీ భూమండలమునకు విరామము లేని రెండువిధములగు పర్యటనగతి యున్నది. తన చుట్టు తానే తిరుగుట యొకటి; సూర్యభగవానుని చుట్టు నియమితకక్ష్యామార్గమున తిరుగుట రెండవది. మొదటిది చక్రభ్రమణము (Rotation); రెండవది పరిభ్రమణము (Revolution). ఇరువదినాలుగు గంటల, లేక అరువదిగడియల కాలమున చక్రభ్రమణమొకటి పూర్తియగును. సౌరమానముతో నొక సంవత్సరకాలమున నొక పరిభ్రమణము ముగియును. భూమిపై నివసించు మన జీవితములలో నివి రెండును ముఖ్యఘట్టములు. చక్రభ్రమణము మన దృష్టితో నొక దిన మనియు, పరిభ్రమణము దేవమానముతో నొక యహోరాత్ర మనియు పిలుచుట సంప్రదాయము. ఈ రెండువిధములగు దినములకుఁ గల పరస్పరసంబంధమే దినవర్ష పద్ధతి యను పేరున పాశ్చాత్యులలో ముఖ్యముగా వాడుకలో నున్న దశాపద్ధతి కాధారము. 'మనుష్యజాతకము' మున్నగు మన గ్రంథములలో నిది దిఙ్మాత్రముగా ప్రదర్శింపఁబడినది. అది యట్లుండె.

జన్మకాలమున రవి ఏరాశిలో, ఏభాగకలావికలలో నుండెనో, మరల ఆ రాశిలో అదే భాగకలావికలకు వచ్చినపుడే ఆవ్యక్తిజీవితమున నూతనసంవత్సర మారంభమగును. ఆనిమిషమును నికరముగా కనిపెట్టి, తత్కాలమునకు భావస్ఫుటగ్రహస్ఫుటములు చేసి, ఆ కుండలినుండియే రాఁబోవు సంవత్సరపుఫలములు సూచించు పద్ధతికి 'వర్ష జాతక' మని పేరు. తాజికసంప్రదాయవేత్తల కిది పరిచితము. అట్లే ప్రతి దినమందుకూడ జన్మకాలమునకు వ్యక్తిజీవితమున నూతనదివస మారంభ మగునుకదా? ఆక్షణమందలి గ్రహభావస్థితుల ననుసరించి ఆయాదినములలో ఫలానుభవము కలుగవలసియుండుటలో వింతలేదు. ఈ సంప్రదాయమునకే 'దైనికజాతకపద్ధతి' అని వ్యవహారము.

భూమికి సూర్యుని చుట్టు తిరుగవలసిన అవసరము లేనిచో, అనఁగా పరిభ్రమణగతి లేనిచో ఏదినమందైనా ఇష్టభూభాగమున, ఇష్టకాలమునకు ఒక్కటే భచక్రభాగ పూర్వదిశాహరిజమున ఉదయమగుచుండెడిది. అనఁగా జన్మకాలమున ఏ రాశిభాగలో లగ్నముండెనో ఆ రాశిభాగయే ఏదినమునకు సాధించిన దైనికజాతకకుండలియందైనా శాశ్వత లగ్నముగా కానవచ్చుచుండును. కాని భూమికి పరిభ్రమణగతి యొకటి యున్నది. అగుటచే ఇరువదినాల్గుగంటల

కాలములో, అనఁగా ఒక చక్రభ్రమణము ముగియు వేళకు తన కక్ష్యామార్గమున భూమి రమారమి ఒక భాగ ముందునకు జరిగియుండఁగలదు. అగుటంబట్టి చక్రభ్రమణములో నొక చుట్టు పూర్తియగునప్పటికి ఇష్టభూభాగమున మునుపటిదినము పూర్వదిశాహారిజమున నుదయించిన లగ్నభాగ కాక, ఇంచుమించుగా దాని తరువాతి భాగ ఉదయమగుట సంభవించుచున్నది. ఇట్లు సంవత్సరకాలము (ఒక పరిభ్రమణము) ముగియునప్పటికి ఇష్టకాలమునకు మరల జన్మకాలీన లగ్నభాగయే ఉదయమగును. ఈకారణమున వ్యక్తిజాతకమందలి లగ్నదశమకేంద్రములు (కేంద్రములలో ముఖ్యమయినవి) రెండును సంవత్సరకాలములో క్రమముగా భచక్రమందలి ౩౬౦ భాగలలో ప్రతిభాగయందును సంచరించుట సంభవించుచున్నది. ఇట్టి చలకేంద్రములకే దైనికకేంద్రములని పేరు. ఈపద్ధతి ననుసరించి సంవత్సరకాలములో దైనికకేంద్రములు జన్మకాలిక గ్రహస్థానము లన్నింటిపైనను సంచరించుచున్నవని చదువరులు సులభముగా గుర్తింపఁగలరు. ఒక్కొక్క గ్రహమొక్కొక కేంద్రములో నుండఁగల దిన మొకటివంతున నవగ్రహములు లగ్నదశమ కేంద్రములలో నుండఁగల దినములు సంవత్సరములో ౧౨ అగును. ఇదికాక, చారగ్రహములు పైకేంద్రములో సంచరించు దినములు వేరుగా ౧౨ ఉండఁగలవు. అనఁగా, దైనికజాతకమున గ్రహములకు లగ్నదశమకేంద్రవ్యాప్తి నిచ్చు దినముల గరిష్ఠసంఖ్య సంవత్సరములో ౩౬గా నుండు ననుట. ఇట్లు దైనికజాతకములోని కేంద్రములకు గ్రహసంబంధము కల్గిన దినములలోనే, జన్మకాలిక శుభాశుభత్వము ననుసరించి ఆయా గ్రహము సూచించు ఫలము లనుభవమునకు రాఁగలవు.

ఇందులో నొకటి రెండు విశేషము లున్నవి. పైన వివరించిన రీతిగా సాధించఁగల ౩౬ దినములలో నన్నియు ఫలదాయకములా యని యడుగవచ్చును. అది సామాన్యముగ సాధ్యము కాదు. గ్రహములు చూపఁగల ఫలములు వాని వాని దశలలోనే పరిపక్వమునకు రావలయునుగదా ?

"యద్యశ్చ ద్రవ్యం కథిత మృషిభి
ర్యస్యయస్యగ్రహస్య
కర్మాజీవోపిచ తనుభృతాం
యశ్చ యశోప్యదితోత్ర,
యద్భావోత్థం యదపి గృహజం
రోగజం వృష్టిజం యత్
తత్తత్సర్వం గ్రహబలవశా
ద్యోజనీయం దశాసు." (శ్రీపతిపద్ధతి)

ఇచట దశ లనఁగా ఉడుదశ యని కాదు. అది చంద్రునిపై నాధారపడినది ప్రశంసలో నున్న కేంద్రచలనము లగ్నముపై నాధారపడిన దగుటచే లగ్నచలనమే ప్రధానాంగముగాఁ గల దశాపద్ధతి దీనితో బాగుగా సమన్వయమగుట యుక్తము. ఏకాంశవర్షపద్ధతి, దినవర్షపద్ధతి మున్నగునవి ఈజాతికి చేరిన దశలు. ఈ సంప్రదాయమున చలితగ్రహములకు సంభవించు దృష్టివిశేషములచే తాత్కాలికదశ మంచికో, చెడ్డకో ఫలప్రదముగా నుండు సంవత్సరములో అట్టిగ్రహములు కేంద్రస్థానముల నాశ్రయించిన దినములే మిక్కిలి వెలగల ఫలమును చూపఁగలవు. ఇతర కాలములో అట్టి యనుభవములకు దశ లవకాశ మీయవుకావున, గమనించుటకు వీలుకల ఫలములు రాఁజాలవు. సారాంశ మేమన, దశలలో గ్రహములు ఫలప్రదము లయినపుడే, వాని సంబంధముచే కేంద్రములు చెప్పఁగోఁగలుగునంతటి ఫలపరిణామమును చూపుననుట !

మఱియొకటి. జన్మకాలమందలి గ్రహస్థానములో, కేంద్రస్థానములో, ఏదోయొకదానికి చారగ్రహములలో నొకదానికి సంబంధము కల్గినంతమాత్రముననే మనకు గొప్ప ఫలము లభించుట యరుదు. ఇది నిష్ఫలమని నా ఆశయము కాదు. గమనింపఁదగిన విశేషఫల ముండదనుట ! అట్లుకాక, ఒకేదినమున చారగ్రహసంబంధము మూఁడునాల్గు స్థానములకు లభించినప్పుడే, జీవితములో గొప్ప ఫలానుభవము

చూపట్టుచున్నది. అట్టి దినములలోనే దైనికకేంద్రములకార్యము నిరుపమానమె యుండఁగలదు.

విశేష మేమనఁగా, జన్మకాలము నిష్కృష్టగా శుద్ధపరచిన జాతకములకుఁదప్ప, 'పరోపదిష్ట' కాలము నకు వ్రాయఁబడిన అందాజుజాతకముల కీదైనికజాతక పద్ధతి ఎందులకును పనికిరాదు. దీనియందలి కేంద్ర సంచలనపద్ధతిని గమనించినచో, పైయర్థము సులభముగా బోధపడఁగలదు. ఇంచుమించుగ, నాల్గునిమిషములు—లేక, పదివిగడియలు—గడచినచో, లగ్నమొక భాగవంతున మారుచుండుటచే, అందాజు కాలమునకు గణింపఁబడిన జాతకములలో దైనిక కేంద్రములు జీవితఫలములతో సమన్వయపడు గ్రహకేంద్రసంబంధమును తెలుపఁగలుగుట అసాధ్యము.

దైనికజాతకమును గుణించుపద్ధతి కొక్కయుదాహరణము నిచ్చుట ప్రయోజనకారి యను

| | | | |
|---|---|---|---|
| రా ౭-౮ | | | ఇ ౧౬-౩౧ |
| | సార్వభౌముని జాతకము (సాయనము) | | X ౮-౩౭<br>ను ౮-౩౭ |
| ర ౨౧-౨౫<br>బు౧౮-౧౬<br>శు ౧-౨౩ | శు ౫-౪౭<br>శ ౧౪-౪౦<br>వ ౨౨-౯<br>చ ౨౪-౫౫ | I ౨౮-౫౦ | కే ౭-౨౮ |

కొందును. మహామహుఁడగు మన పష్ఠజార్జిసార్వభౌముని జాతకమునే దృష్టాంతముగా నుపయోగింతము.

ఈ ప్రభువర్యుఁడు సాండ్రింగ్‌హ్యామ్‌అను పట్టణమున ౧౮౯౫-వ సంవత్సరమున డిసెంబరు మాసపు ౧౪-వ తేదీన సూర్యోదయాత్పూర్వము (౧౩-వ తేదీనాఁటి రాత్రి) ౩ ఘంటలు, ౧౫ నిమిషములు, ౧౦ సెకండ్లు A. M. (G. M. T.) కాలమున నుదయమయ్యెనఁట! * ఆధునికజ్యోతిషశాస్త్రవేత్తలలో సుప్రసిద్ధుఁడగు ఔయిలీ యను నాంగ్ల మహాశయునిచే గుణింపఁబడిన జాతకకుండలి యీ ప్రక్క నున్న

ధన, పంచమ, భావాధిపతియగు బృహస్పతి ఈ జాతకమున నెంతటి ఉత్తమస్థానము నాశ్రయించి యున్నాఁడో పాఠకమహాశయులు కనులపండువుగా గమనించఁదగిన విషయము! దశమకేంద్రమున బృహస్పతి యున్నాఁ డనఁగా, ఇట్లుకదా యుండవలయును? రాశిభాగకలలతో దశమకేంద్రముతో సమముగా నీగ్రహస్థాన మున్నది. పైఁగా, దశమాధిపతి యగు రవితో నీగ్రహమున కుండునది ప్రబలపరివర్తన యోగ మొక్కటి!

"ఏకర్క్షకలాంశగతో
యత్రోక్తఫలద శ్శశి గ్రహవశేన,
అన్యర్క్షగత స్స్వప్నే
మనసావా భావనం కురుతే."

గ్రహచంద్రసమాగమ ము పలక్షణముగా చెప్పఁబడిన యీసంప్రదాయవాక్య మెంత రమణీయముగా నీజాతకరత్నమున కన్వయించుచున్నదో చూడుఁడు! దశమరాశిలో, ఏమూలలోనో యున్న గురువును చూచి తృప్తిపడువారికి రాజయోగమే కలిగెనేని అది స్వప్నమందేకదా?

ప్రపంచమందలి ఆర్థిక, నైతిక, సాంఘిక' రాజకీయాదిసర్వవ్యవస్థల నొక్కమారు చెల్లాచెదరుగావించు మహాక్లిష్టపరిస్థితులు దాపురమైన యిట్టి విషమాతివిషమకాలమున ప్రబలుఁడగు బృహస్పతి దశమకేంద్రమధ్యమందే కల మహాసార్వభౌముఁడు లభించుట సామ్రాజ్యప్రజలు చేసిన సుక పాక మనక తీరదు! అది యట్లుండె.

* Vide Page 143 of British Journal of Astrology, Vol. XXX—May, 1937.

ఏవిధముగఁ జూచినా సార్వభౌమత్వమున కెంతయుఁ దగియున్న ఈ మహనీయుని జాతకమున కిపుడు గ్రహభావఫలముల నూహింపఁబూనుట అధిక ప్రసంగ మగును. ఈ ప్రభువర్యుని జీవితమున కొన్ని ప్రధానఫలములు గల విశేషదినముల నేరుకొని వానిని దైనికజాతకమున కుదాహరణార్థ ముపయోగింతము. ఆ విశేషదినము లివి:—

(౧) శ్రీ పంచమజార్జిసార్వభౌముఁ డిహలోకము వీడుట;

(౨) శ్రీ ఎడ్వర్డుప్రభువు రాజ్యపరిత్యాగము చేయుట.

(౩) శ్రీ సార్వభౌముని సామ్రాజ్యపట్టాభిషేక మహోత్సవము;

(౪) శ్రీ సార్వభౌముఁడు ధర్మసంరక్షణము నకై జర్మనీపై దండయాత్రను ప్రకటించుట.

పైదినములకు దైనికజాతకములను జూడుఁడు.

(౧)

౧౯౩౬-వ సంవత్సరమున జనవరినెలలో ౨౦-వ తేదీనాఁడు సార్వభౌముని జనకుఁడగు పంచమజార్జి చక్రవర్తి మానవలోకమును వీడిపోయెను.

నాఁటి మధ్యాహ్నకాలపు గ్రహస్థితి యీక్రింది కుండలి చూపఁగలదు:—

| | | | |
|---|---|---|---|
| శ౭-౪౯<br>శు౪-౩౯ | | వ౧-౩౬ | |
| బు౧౭-౧ | పితృనిర్యాణము<br>(సాయనము) | | కే౧౧-౫౩ |
| ర౨౯-౧౬<br>రా౧౧-౫౩ | | | |
| కు౨౦-౧౪<br>గు౧౫-౩౫<br>చ౧౧-౫ | | | ఇ౧౬-౩౦ |

జన్మకుండలియందలి కేంద్రస్థానములకుఁగాని, జన్మకాలిక గ్రహస్థానములకుఁగాని నాఁటిదినమున నేవిధమగు వేధయు కానరాదని పాఠకమహాశయులు గమనించియేయుందురు. సార్వభౌముని జాతకమున ఇంతకన్న విశేషదిన ముండునా? ఈజాతకమున కా దినముతో నేమి సంబంధము ?

దిన వర్ష దశాపద్ధతిలో దశమాధిపతి యగు రవి చలించి, ఆ సంవత్సరమునకు కుంభరాశి ౪ వ భాగకు వచ్చియున్నాఁడు. దశమస్థగ్రహ మగు బృహస్పతి చలనవశమున అప్పుడే సింహరాశి ౪ వ భాగయం దుండెను. అగుటచే, ఆసంవత్సరమున దశమాధిపతితో దశమస్థ గ్రహమునకు సమసప్తక వేధ వచ్చినది. దశమకేంద్రము పితృస్థాన మగుటచే, ఈ దశ పితృకర్మను సూచింపఁజాలినదే. అష్టమాధిపతి యగు బుధుఁడు చలించి కుంభరాశిలో ౨౨ వ భాగకు రాఁగలుగుటచే, జన్మవరుణునితో ఆ సంవత్సరమే, కేంద్రవేధపాలయినాఁడు. దశమకేంద్రము చలనమువలన అప్పటికి కన్యారాశిలో ౧౯౫ భాగకు వచ్చుటచే అష్టమాధిపతియగు బుధునినుండి కేంద్రవేధకు లోనయినది. దశ అంతయు దశమస్థానమునే చుట్టుకొన్నదా అనిపించును. ఇట్టి దశాసంవత్సరమున పితృనిర్యాణము జరుగుటలో వింత లేదు.

నవమస్థానమును పితృస్థానముగా వ్యవహరించుట సామాన్యముగా మనవారికి వాడుక. కాని, పాశ్చాత్యులు దశమస్థానమునే పితృస్థాన మందురు. ఈ రెండు సంప్రదాయములుకూడ సమంజసములే యనవచ్చును. నవమస్థానమునకు లగ్నము పంచమ (పుత్ర) భావ మగుటచే, మనపద్ధతి యుక్తియుక్తముగా నున్నది. చతుర్థ (మాతృ)స్థానమునకు దశమము భర్తృ (సప్తమ) భావ మగుటచే పాశ్చాత్యుల యుక్తి సయితము తీసివేయరాకున్నది. కాని, ఇందులో నొక విశేష మున్నదనవచ్చును. నవమభావము ధర్మస్థానముకదా! ప్రపంచజాతకమున నవమరాశిపై నధికారము 'గురువు'నకు కలదనుట గమనింపఁదగినది. కాక, నవమస్థానమునకే తపస్థ్సాన మని సయితము వ్యవహార మున్నది కదా! ప్రాచీనకాలమందు మన దేశమున తండ్రులు కేవల జన్మకారణము మాత్రము

# ఇప్పుడు మొండిమొలతో ప్రాకుతూ వుండవచ్చు కాని 12 సంవత్సరాల తరువాత మీ బిడ్డకు



మంచి బట్టలు

మంచి విద్యా కావాలి



## మీ బిడ్డ భవిష్యత్తునకు ఫరవాలేకుండా ఇప్పుడే నేషనల్ సేవింగ్స్ సర్టిఫికేట్స్ కొనండి

* అవి 12 సంవత్సరాలలో 50% పెరుగుతాయి.
* ఈ పెట్టుబడిమీద మీరు ఆదాయంపన్ను చెల్లించ నవసరం లేదు.
* 3 సంవత్సరాల తరువాత వడ్డీతో సహా వాటిని మార్చి డబ్బు చేసుకోగలరు.
* ఇవి 10, 50. 100, 500 లేదా 1000 రూపాయల ఖరీదులలో దొరకును.
* ఒక్కసారిగా 10 రూపాయలు పెట్టి కొనలేకపోతే, 1 రూ, 8 అణాలు, 4 అణాలు ఖరీదులలో దొరికే సేవింగ్స్ స్టాంప్స్ కొని, అవి పెరిగినతరువాత నేషనల్ సేవింగ్స్ సర్టిఫికేట్సుగా మార్చుకోవచ్చు.
* నేషనల్ సేవింగ్స్ సర్టిఫికేటులును, సేవింగ్స్ స్టాంప్సును ప్రభుత్వఅనుమతివున్న ఏజంటులవద్దగాని, సేవింగ్స్ బ్యూరోలలోగాని, పోస్టాఫీసులలోగాని దొరకును.

వాటికోసం త్వరపడండి

ఆలస్యం చెయ్యవద్దు

AAA 1236TG





మరి అతను
లైఫ్‌బాయ్ పద్ధతిని
కూడా నేర్చుకున్నాడు!

ఇప్పుడు అతడు అనేక విషయములను నేర్చుకొంటున్నాడు, గాని లైఫ్ బాయి ప్రతిరోజు వాడటంవల్ల కలిగే వుపయోగము మరి యే యితర విషాయాల్లోను పొందడు. వాని తల్లి నేర్పిన పాఠమువలన "మురికివలని అపాయము" నుండి అతడు కాపాడబడుటచే ఆమె గర్వపడుచు సుఖించ వచ్చును.

యే మాత్రము శ్రద్ధవహించక పోయినను మురికి వలని అపాయము ఎదుర్కొనుటకు సిద్ధముగా వుంటుంది




లైఫ్‌బాయ్ మంచి సబ్బుల్లోకి ఉత్తమమైనది
ఇది మంచి అలవాటు

కాక తమ సంతానమునకు విద్యాదాతలుగ, ఉపదేశ కర్తలుగ, జ్ఞానప్రదులుగ నుండెడివారు. సంతానము నకు వారిపై గురుభావ ముండుట యుక్తమే. అట్టి తండ్రులను నవమస్థానము తెలుపుటలో వింత కాన రాదు. కాని, కాలము చాల తారుమారైనది. ఇప్పటి కాలమున బాలకులు విద్యాభ్యాసము చేయుట కూలి బళ్లలో! తండ్రులనుండి ఉపదేశము కాని, జ్ఞానార్జ నము కాని పుత్రులకు వచు పరిస్థితులే అంతరించిన వని అందరెఱిగిన విషయమే. ఆకారణమున, సాధా రణముగా, పుత్రులకు తండ్రులమీఁద గురుభావము కాని, భక్తికాని ఉద్బోధము కాదు. ఇట్టి పరిస్థితులలో నవమభావము కన్న దశమభావమే పితృస్థాన మనుట మిక్కిలి యుక్తముగా నున్న దనవచ్చును గదా? అనుభవములో నిపుడీ పద్ధతికే విలువ కానవచ్చు చున్నది. మన గ్రంథములలో సయితము కొన్ని సంద ర్భములలో ఈసంప్రదాయమును మనవారు మన్నిం చినారని తెలుపు సూచన లున్నవి.

పోనిండు. పితృకష్టమును దశ సూచించిననేమి, ఆ దినము సూచించినదా యని కదా మన ప్రశ్న? దైనికజాతక మేమనుచున్నదో చూతము

| దాని సాధనవిధాన మిది :— | గం. | ని. | సె. |
|---|---|---|---|
| కడచిన మధ్యాహ్నము నుండి జన్మ కాలముదాఁక జరిగిన కాలము (ఇది సావనకాలము) ... | ౧౫ | ౧౫ | ౧౦ |
| గంటకు ౧౦ సెకండ్లవంతున సావన కాలమునకు ధనసంస్కారము చేయఁగా, ... | ౦ | ౨ | ౩౧ |
| వచ్చినది నాక్షత్ర కాలాంతరము (ఇది ధ్రువము.) | ౧౫ | ౧౭ | ౪౧ |

| | | | |
|---|---|---|---|
| ౧౯-౧-౧౯౩౬ నాఁటి మధ్యాహ్నమునకు నాక్షత్రకాల భుక్తి* | ౧౯ | ౫౦ | ౫౧ |
| ధ్రువమును చేర్పఁగా | ౧౫ | ౧౭ | ౪౧ |
| వచ్చిన మొత్తములో | ౩౫ | | ౩౨ |
| మండలము శోధించఁగా | ౨౪ | | ౦ |
| శేషము (నాక్షత్రకాలము) | ౧౧ | | ౩౨ |

ఈ నాక్షత్రకాల ముపకరణముగా, లగ్నప ట్టిక గ్రంథము † నుండి జన్మస్థానపు అక్షాంశకు (ఈ జాతకమునకు ఉత్తరాక్షాంశలు ౫౧, కలలు ౩౨) లగ్నదశమ కేంద్రములను సాధించఁగా, ఈక్రిందిఫల ము వచ్చును.

దైనికలగ్నము ౨౪ వ భాగ, వృశ్చికము
దైనికదశమకేంద్రము ౧౬...కన్య.

జన్మకాలమున ఇంద్రగ్రహము మృత్యు (అష్టమ) భావమం దున్నదికదా? ప్రశంసలో నున్న దినమున బృహస్పతి ఇంద్రుని జన్మకాలిక స్థానమునకు సమసప్తకవేధా స్థానమునం దున్నాఁడు. ఇంద్రుఁడు చారవశమున, స్వస్థానమును మాత్రమేకాక, తత్కాల గురువును సయితము వేధించుచున్నాఁడు. వియోగ కారియగు వరుణుఁడు చారవశమున నాఁటి ఇంద్రగురు వుల కిరువురికిని సార్ధకేంద్రశత్రుస్థానము నాక్రమించి యుండుట గొప్ప విశేషము. ఇదిచాలక, జన్మకాలమం దలి ఇంద్రగ్రహస్థానము నర్ధకేంద్ర విషమదృష్టితో వేధిం చుచు, ఈవరుణ మహాశయుఁడు ఇంద్రుని జన్మకా లికమృత్యుస్థానఫలము నుద్బోధించు చున్నాఁడు! ఇట్టి ఇంద్రగ్రహ మానాఁడు నికరముగా దైనికదశమ కేంద్రమం దుండుట ముఖ్యముగా పాఠకమహాశయులు గమనింపఁదగియున్నది. దశమము పితృస్థాన మగుటచే, నాఁటి ఫలవిశేషము నీయోగము చక్కఁగా చూపఁ గలిగిన దనుటలో నాశ్చర్యము లేదు. దశాఫలితముల ననుభావమునకుఁ దెచ్చు విషయమున దైనికజాతక మున కెంత విలువ యున్నదో, చదువరు లూహించు కొఁగలరు.

* Vide Raphael's AstronomicalEphemeris for 1936.

† Vide Raphael's Tables of Houses or North Latitudes

(౨)

౧౯౩౬-వ సంవత్సరమున డిసెంబరునెల ౧౧-వ తేదీనాఁడు మధ్యాహ్నము ౧-౫౨ **P. M. (G. M. T.)** కాలములో, శ్రీ ఎడ్వర్డుప్రభువు రాజ్యపరిత్యాగము చేయుటచే, మన సార్వభౌమునికి సామ్రాజ్యము సంక్రమించినది. నాఁటి గ్రహసంపత్తి యిది:-

| | | | |
|---|---|---|---|
| శ ౧౬-౧౩ | | వ ౬-౫ | కే ౨౪-౩౭ |
| | రాజ్య సంక్రమము | | |
| గు ౨-౪<br>బు ౧-౫౪ | (సాయనము) | | |
| రా ౨౪-౩౭<br>ర ౧౯-౧౭ | చ ౨౨-౦ | కు ౧౫-౪౮<br>శు ౨౯-౫౨ | ఇ ౧౮-౫౭ |

| | గం. | ని. | సెక. |
|---|---|---|---|
| ౧౧-౧౨-౧౯౩౬-వ తేదీ నాఁటి మధ్యాహ్నమునకు నాక్షత్ర కాలభుక్తి ... | ౧౭ | ౧౬ | ౮ |
| ధ్రువము కలుపఁగా .. | ౧౫ | ౧౭ | ౪౧ |
| వచ్చిన మొత్తములో ... | ౩౨ | ౩౩ | ౪౯ |
| మండలము శోధించఁగా ... | ౨౪ | ౦ | ౦ |
| శేషము (నాక్షత్రకాలము) ... | ౮ | ౩౩ | ౪౯ |

ఈకాలమునకు పథకగ్రంథము ననుసరించి

దైనికలగ్నము తుల ౨౭-వ భాగ

దైనిక దశమకేంద్రము సింహము ౬ ,,

అని యేర్పడుచున్నవి.

జనకునినుండికాక ఇతరుల మూలముగా సం... మించు ఆస్తిని తెలుపునది అష్టమభావము. దాని యధిపతియగు బుధుఁ డీదినమున రాజ్యసూచకుఁ డగు బృహస్పతితో నైక్యము నందుచున్నాఁడనుట విశేష విషయము. ఈబుధుఁడు జ్యేష్ఠభ్రాతృస్థానాధిపతి (లాభాధిపతి) యగుటయు, ప్రజావతీస్థానమునకు (అనఁగా, జ్యేష్ఠభ్రాతృస్థానమునుండి కళత్రస్థానమగు పంచమభావమునకు) బృహస్పతియే అధిపతి యగుటయు మన సార్వభౌమునికి సామ్రాజ్యము సంక్రమించుటకుఁగల కారణము నతిహృద్యముగా సూచించుచున్నవి. జ్యేష్ఠభ్రాతకు భార్యాలాభము మన ప్రభువునకు సామ్రాజ్యలాభముగా పరిణమించిన దనుట!

లగ్నాధిపతియగు జన్మశుక్రునికి సప్తమకేంద్రమున విప్లవకారియగు వరుణుఁడు నిలిచియున్నాఁడు. ఈ స్థానద్వయమునకు నడుమ, సింహరాశి ౬-వ భాగలో, దైనికదశమస్థానము వచ్చియుండుట చమత్కారము. చలితదశమాధిపతికి (సింహము ౪-వ భాగ), జన్మదశమాధిపతికి (సింహము ౧౧ భాగ) నడుమనున్న దీదైనిక దశమ కేంద్రము. అద్భుతశక్తి గల యొకానొక అసాధారణ స్త్రీవ్యక్తి కారణముగా నీవిచిత్రసంఘటన మాకస్మికముగా సంభవించిన దని జ్ఞప్తియందుంచుకొన్నచో, ఈ దైనికజాతకమందలి వైచిత్ర్యము హృదయంగమముగా మనకు సమన్వయము కాఁగలదు. స్త్రీగ్రహమై, తృతీయ (సహోదర) భావమునుండి సప్తమ (నవమ) భావమున కధిపతియగు చంద్రుఁ డాదినమున జన్మవరుణునిపై నుండుట సయితము విచిత్రమైనదే.

౧౯౩౭-వ సంవత్సరమున మేనెలలో ౧౨ వ తేదీన మధ్యాహ్నము ౦-౩౧ **P.M (Summer Time)** లో సార్వభౌమునికి సామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవ మతివైభవముగా నడచినది.* నాఁటి దైనిక కుండలిని ప్రక్క పుటలో తిలకింపుఁడు.

***Vide page 164 of the British journal of Astrology, Vol. XXX June, 1937.**

| | | | |
|---|---|---|---|
| | శ౧-౪౬<br>శు౧౯-౩౯ | వ౧౦-౧౫<br>X౧౫-౨<br>బు౧౯-౩౮<br>ర౨౧-౧౯ | కే౧౬-౩౫<br>చ౧౮-౩౫ |
| | సామ్రాజ్య<br>పట్టాభిషేకము<br>(సాయనము) | | |
| గు౨౭-౧౮ | | | I౨౬-౪౧ |
| రా౧౬-౩౫<br>కు౦-౪౮<br>(వ) | | | ఇ౧౬-౧౪<br>(వ) |

| | గం. | ని. | సెక |
|---|---|---|---|
| ౧౧-౫-౧౯౩౭ నాఁటి మధ్యాహ్నమునకు నాక్షత్రకాలభుక్తి | ౩ | ౧౫ | ౨౧ |
| ధ్రువము కలుపఁగా ... | ౧౫ | ౧౭ | ౪౧ |
| వచ్చిన నాక్షత్రకాలము ... | ౧౮ | ౩౩ | |

పైకాలమునకు దైనిక కేంద్రములు:—

దైనికలగ్నము మేషము ౧౯త్తి భాగ

దైనికదశమకేంద్రము మకరము ౭ద్ది

సింహరాశిలో ధనుర్నవాంశ (గురునవాంశ) ఉదయమగుచుండుటయు, తాత్కాలికదశమకేంద్రము స్థిరరాశియగు వృషభమునం దుండుటయు, జన్మకాల రాజ్యాధిపతియు, తాత్కాలికలగ్నాధిపతియు అగు గ్రహరాజు (రవి) అభిషేకకాలమున రాజ్యస్థానగతుఁ డగుటయు, తాత్కాలికరాజ్యస్థానాధిపతియు, జన్మలగ్నాధిపతియు నగు శుక్రుఁ డీమహోత్సవకాలమున భాగ్యస్థానమునం దుండుటే కాక, తాత్కాలికచంద్రుని నుండి లాభస్థానమునం దుండుటయు సార్వభౌముని పట్టాభిషేకమహోత్సవమున కెంతయు తగినయోగములు. ఇవి మనస్సులో నుంచుకొని దైనికలగ్న మేమయినదో చదువరులు గమనింతురుగాక! అది నికరముగా తాత్కాలికశుక్రునిమీఁదనే ప్రకాశించుచున్నది! దైనికలగ్నము నధిష్ఠించుట కౌనాఁడు శుక్రునికన్న మఱే యేయితరగ్రహమున కధికారము గలదు? దైనికజాతకపు విలువను తెలుపుట కింతకన్న మంచి దృష్టాంతము లభించుట సాధ్యముకాదు.

(౪)

౧౯౩౯-వ సంవత్సరము సెప్టెంబరు నెల ౩-వ తేదీన ౧౧-౪౫ **A. M. (Summer Time)** లో మన సార్వభౌముఁడు జర్మనీదేశముపై దండయాత్రారంభమును ప్రకటించెననుట సర్వవిదితము. అప్పటి దైనికకుండలి యిది:—

| | | | |
|---|---|---|---|
| | గు ౬-౪౭<br>(వ) | చ ౦-౧౪<br>శ ౦-౫౪ (వ)<br>కే ౧-౫౩<br>వ ౨౧-౫౭(వ) | |
| | చైత్రయాత్ర<br>(సాయనము) | | |
| కు ౨౪-౩౯ | | | X ౧౨-౪౫<br>బు ౨౩-౪౫ |
| | I ౧-౩౦<br>రా ౧-౫౩ | | శు ౯-౨౪<br>ర ౧౦-౨<br>ఇ ౨౨-౩౫ |

| | గం. | ని. | సెక. |
|---|---|---|---|
| ౨-౯-౧౯౩౯ నాఁటి మధ్యాహ్నకాలమునకు నాక్షత్రకాల భుక్తి. ... | ౧౦ | ౪౨ | ౫౬ |
| ధ్రువము కలుపఁగా ... | ౧౫ | ౧౭ | ౪౨ |
| వచ్చిన మొత్తములో | ౨౬ | ౦ | ౩౮ |
| మండలము తీసివేయఁగా | ౨౪ | ౦ | ౦ |
| శేషము (నాక్షత్రకాలము) | | | ౩౮ |

ఈకాలమున కివి దైనిక కేంద్రములు:—

దైనికలగ్నము ... సింహము ౧౪౩ భాగ

దైనికదశమకేంద్రము... వృషభము ౨ ,,

చైత్రయాత్రారంభకాలమున లగ్నమున రాహువుదయించుచుండుట యెంతయు తగియున్నది. శత్రువులను నిర్మూలించుటకై యుద్ధారంభము చేయువారికి భీకరమూర్తియగు రాహువుయొక్క వరప్రసాదము కావలయునేకాని, సుఖకాంక్షియగు శుక్రుని తళుకుబెళుకు లక్కఱకువచ్చునా? ఉత్సవకాలమా, శయ్యామందిరమా, శుక్రుఁడు పనికివచ్చుటకు? ఉద్యోగాధిపతియగు రవి లాభస్థానమందుండుట, లగ్నాధిపతియగు కుజుఁడు ప్రబలుఁడై (ఉచ్చ) విక్రమస్థానము నాక్రమించుట, ప్రత్యక్షశత్రు (సప్తమ) స్థానమున దుర్బలుఁడగు చంద్రుఁడు, ప్రభావవిహీనుఁడగు కేతువు, పంగువగు వక్రశని వీరు జట్టుకట్టుకొనియుండుట, ప్రత్యక్షశత్రుస్థానాధిపతియగు శుక్రుఁడు బలహీనుఁడై (నీచపడి) రవి సంయోగమును (అనఁగా, తేజోనాశనమును) అభిలషించుచుండుట— ఇవన్నియు మిత్రమండలివారి శత్రుజిగీష కెంత సాహాయ్యకరములో వేరుగ విన్నవించుట యనవసరము. సప్తమభావముతో పోల్చి చూచినచో, లగ్న మెన్నియో రెట్లు బలవంతమైన దని నిస్సందేహముగా నీకుండలి చాటుచున్నది. లగ్న, సప్తమ, స్థానముల కున్న యీ బలాబలముల తారతమ్యమే విజయలక్ష్మీకటాక్షము బ్రిటిషు సార్వభౌముని ప్రక్కనే కలదని యుద్ఘోషించుచున్న దికదా?

దైనికదశమకేంద్ర మానాఁడు వృషభరాశి ౨-వ భాగలోనుండుటచే, దానికి చంద్రశని కేతుసంయోగపు వ్యాప్తివచ్చినది. సార్వభౌముని యుద్యమము (దశమము) ఆనాఁడు మిత్రద్వయముగల శత్రువుపై దండెత్తుటే కదా? దశమకేంద్ర మానాఁడు చంద్రశని కేతువుల జట్టుపైఁగాక మఱి యెందుండఁగలదు? జర్మనీ హిట్లరు జాతకమున రవి వృషభరాశిలో ౧-వ భాగలో నున్నాఁడు. కాన, ఆ గ్రహముపై శని ప్రాలీయున్నపుడాస్థానమునే శత్రుస్థానముగా యుద్ధ మారంభించిన దశమకేంద్రమున కంతకన్న తగిన చో టెం దుండును? స్వబల పరబల సమీక్షవలన కలుగు జాగరూకత, పట్టిన పట్టు సడలని కార్యదీక్ష, వేసిన యడుగు వెనుదీయని దార్ఢ్యము, తాత్కాలిక సౌకర్యములకు భ్రమపడని దూరాలోచన, నెమ్మదితో పనులు నిర్వహించు నోపిక, అనవసర సాహసకార్యములకు దొరకొనని వివేకము—ఇత్యాది గుణములీ చైత్రయాత్రోద్యమములో కానవచ్చుట దైనికదశమమందలి శనిధర్మము.

దినవర్ష పద్ధతిలో దశమాధిపతి (రవి) చలించి కన్యారాశి ౧౪-వ భాగలో చరించుటకు యుద్ధారంభమునుండి అయిదు సంవత్సరములు పట్టెను. అప్పుడు చలితరవినుండి సార్ధకేంద్ర ప్రాతికూల్యదృష్టి చైత్రయాత్రారంభకాలపు చంద్రునిపై వచ్చినది. క్రమముగా నీ చలితరవిప్రాతికూల్యము శనికేతువులమీఁదికి సయితము రాఁగలదు. ౧౯౪౪ సెప్టెంబరు ప్రాంతమునుండి యుద్ధఫలితము ఏవిధముగా మిత్రమండలివారి విజయమునకు ప్రోదిచేయుచున్నదో గమనించుట పాఠకమహాశయుల కుత్సాహజనకముగా నుండును.

దైనికజాతకమును గుణించుపద్ధతి, దానియందలి కేంద్రముల యోగ్యత, వీనినిగూర్చి దిఙ్మాత్రప్రదర్శనముగా పైయుదాహరణము నొసంగితిని. శుభకార్యములకో, అభివృద్ధికరములగు పనులకో దైనికజాతకమున కేంద్రములలో శుభగ్రహము లుండు దినములను సంపాదించుట శ్రేయస్కరమని వేరుగా విన్నవించుట అనవసరము.

ఇదికాక, గతజీవితమున ప్రసిద్ధవిషయములు సంభవించినదినములకు దైనికజాతకమును గుణించినచో ఉపయోగించిన జన్మకాలము శుద్ధమా, అశుద్ధమా అని

సులభముగా నిర్ధారమగుటకు వీలున్నది. దైనికకేంద్రములకు గ్రహసంబంధము లేనిదే, ముఖ్యపరిణామములు జీవితమున, ఏవోకొన్ని అపవాదరూపమగు సందర్భములలోతప్ప, సంభవించుట సాధ్యము కాదు. ఆయపవాదసందర్భములలోనయితేను సహామాదిబిందువుల వ్యాప్తిఅయినా కేంద్రములకు కలిగియుండఁగలదు. ఏ విధముగ నైననేమి, దైనికకేంద్రముల సాహాయ్యములేక ప్రబలఫలము లనుభవమునకు రావనుట ముఖ్యసూత్రము.

"జన్మకాలఘటీప్రాప్త
లగ్న భావగ్రహాదినా
దైనికం సాధయే చ్చక్రం
ఫలం కేంద్రగ్రహాశ్రితం"

# తుంగభద్రా ప్రాజెక్టు శుభోదయము

దాదాపు అర్ధశతాబ్దముబట్టి ఆంధ్రమహాజనులు-ముఖ్యముగా రాయలసీమాంధ్రులు కలలు కాంచుతూ వచ్చిన తుంగభద్రాప్రాజెక్టుకు భగవదనుగ్రహమువల్ల మొన్న ఫిబ్రవరి 28-వ తేదీనాడు శుభలగ్నమున అంకురార్పణజరిగినది. నా డా శ్రీరామమూర్తి పాదస్పర్శపు ధర్మమా అని కఱకురాశిల కమనీయ కాంతామణిగా మారినట్లే నేడు శ్రీశాంతి రామమూర్తి ప్రభృతిమహాశయుల అఖండకృషి ఫలితముగా రాయలసీమ రత్నాలసీమగా మారనున్నది. ఆధునిక ఆంధ్రుల చరిత్రలో ఇది సువర్ణాక్షరముల లిఖింపదగిన పర్వదినము.

బ్రహ్మాండమైన ఈ తుంగభద్రా జలాశయము హాస్పేటకు మూడుమైళ్లదూరములోనున్న ఒకచిన్న కుగ్రామసీమలో జరుగనున్నది. ఇప్పటి కిప్పుడు కొండలతోను, తిప్పలతోను నిండియున్న ఈగ్రామము మరికొన్ని యేండ్లలో ఒకపెద్ద పట్టణము కానున్నది.

ఈ జలాశయ విస్తీర్ణము 138 చదరపు మైళ్లుండునని అంచనా. దీని నిర్మాణమంతయు పూర్తియగుసరికి 8 సంవత్సరముల కాలముపట్టును. ఈజలాశయ నిర్మాణమునకును, కాలువల నిర్మాణమునకును కలిపి మద్రాసుప్రభుత్వమునకు మొత్తము 10 కోట్ల రూపాయలు ఖర్చగునని అంచనా వేయబడినది.

ఈ నిర్మాణమువల్ల బళ్లారిజిల్లాలోని రాయదుర్గము, హాస్పేట, బళ్లారి, సిరిగుప్ప, ఆదవేని తాలూకాలలో ౭,౮౪,౦౦౦ ఎకరములును, అనంతపురముజిల్లాలో ౧,౨౮,౨౦౦ ఎకరములును,కర్నూలు జిల్లాలో ౧,౫౦,౩౦౦ ఎకరములును మొత్తము ౧౦,౬౨,౫౦౦ ఎకరములు సాగుకాబోవుచున్నది. ఈ నిర్మాణముమూలముగా ఉత్పత్తికానున్న విద్యుచ్ఛక్తితో అనేక ప్రధానపరిశ్రమలుకూడ అభివృద్ధిచెందనున్నవి.

ఈ జలాశయపు ఆనకట్టపొడవు ౮,౨౦౦ అ; ఎత్తు ౧౫౦ అ. నైలునదిమీదకట్టిన ఆనకట్టవల్ల ఏర్పడిన జలాశయము కన్నను ఈ తుంగభద్రాజలాశయము నాలుగున్నరరెట్లు పెద్దది కాగలదు.

# తుంగభద్రాప్రాజెక్టు శుభోదయము
## నిర్మాణస్థలదృశ్యాలు



౧. మల్లాపురమువద్ద డాముకట్ట బోవుస్థలములో ఇప్పుడున్న చిన్న జలాశయము.

—

౨. తుంగభద్రానదికి అడ్డగిని నైజాము ఇలాకాకు చేరిన పర్వతశిఖరప్రదేశము.





3. మల్లాపురము సమీపములో నిర్మితమైన 'చూపాకారపు' (మాడల్ డామ్) చెరువుకట్ట.

౪. శంకుస్థాపన నాటి జ్ఞాపకార్థము నిర్మితమైన శిలాశాసన స్తంభము.






7, కౌన్సిల్ హౌస్ స్ట్రీట్, కలకత్తా.

మద్రాసు బ్రాంచి:—
నేషనల్ యిన్సూరెన్సు బిల్డింగు,
362, చైనాబజార్ రోడ్, యెస్ప్లనేడ్.
సబ్ ఆఫీసులు:—బెంగుళూరు & మధుర.

# TIMES HAVE CHANGED!




**1754**



ఆంకర్ ఎస్కేపుమెంటు మొట్టమొదట తామస్‌మడ్జి అనువానిచే కనిపెట్టబడెను. కాని అది 19-వ శతాబ్దారంభము వరకు గడియారములకు సాధారణముగా వాడబడు చుండుట లేదు.

**1945**

## రోజులు మారినవి

నేడు గడియారములలో వాడబడే యెస్కేపుమెంటు 200 సం॥ల క్రిందట కనిపెట్టబడిన దానిమాదిరిగానే చాలమటుకు అనుసరించి యుండును. ఇతర యే పనిముట్టుకంటె బహుశ దానిమీదనే గడియారము సరియైన కాలము చూపుట ఆధారపడి యుండునని చెప్పుట సత్యేతరము కాదు. అయినప్పటికి నిర్దుష్టమైన గడియారములో అనేకములైన క్రొత్త పనిముట్లు భాగములు చేరివుండును. ఇవన్నీ వెస్టెండ్ గడియారములలో బాగా అమర్చబడియుండును. అనేకమైన యీ రకాలు మా సొగసైన క్యాటలాగులో కాననగును.



**సెకండస్ పాకెట్**

**15 జూయల్సు**

నికెల్ సిల్వర్, ఓపెన్ ఫేస్, సాదా రోమన్ లేక అరబిక్ అంకెలు రు. 30

రవాణా యిబ్బందులవల్ల, ప్రకటించిన రకములన్నియు సప్లయిచెయ్య సాధ్యపడకపోవచ్చును. మావద్దసరకుండి నంతవరకు ఆర్డరులను సరఫరాచేయుటకు సర్వశక్తుల వినియోగించెదము. పేపరు కంట్రోలువల్ల కేటలాగు పంపలేనందుకు చింతిల్లుచున్నాము.

వెస్టెండ్ వాచ్ కంపెని, బొంబాయి అండ్ కలకత్తా.

# WEST END WATCH Co.

*Bombay & Calcutta*



# నీవు కాదు!

[కథానిక]

= శ్రీ మొదలి వెంకటరామయ్య =

కరతాళధ్వనులమధ్య అగ్రాసనాధిపతి కామేశం గారు లేచినుంచొని కంఠం సవరించుకున్నారు.

"అయ్యా! కామేశంగారు మాట్లాడుతూన్నారు. దయచేసి నిశ్శబ్దంగాఉండ ప్రార్థిస్తున్నాను." అని కార్యదర్శి సభాసదులకు మనవిచేసుకున్నాడు. సభలో గుసగుసలు అణిగాయి.

కామేశంగారు అందుకుని-

"మహాశయులారా! యిక్కడ యీ రోజు మన మందరం యెందుకు సమావేశమయామో లోగడ మాట్లాడిన పెద్దమనుషులు విపులంగా తెలియజేశారు. కాబట్టి నేను చెప్పవలసింది యెక్కువ లేదు. సుప్రసిద్ధ సంఘసేవకులు, మిత్రులు, యీపురవాసులు అయిన శ్రీమూర్తిగారి అకాలమరణం మన పట్టణానికి, యీ పట్టణంలోని అనేక సంస్థలకు తీఱని కొఱత గలిగించింది. మనపురంలో హరిజనహాస్టలు, జాతీయపాఠశాల, సేవాసంఘము మొదలైన సంస్థలు స్థాపింపబడి ముందుకొస్తున్నాయంటే అది కీర్తిశేషులైన మూర్తిగారి స్వార్థరహితమైన కృషిఫలితమే! ఆ సంఘసేవకుడు తన సర్వస్వాన్నీ యీ సంస్థల అభివృద్ధికోసం అర్పించాడు. పైపెచ్చు ఋణంకూడా చేసి వానిని సక్రమ మార్గంలో నడిపించడానికి పాటుపడ్డాడు. యీసంస్థలు యెంత ప్రశంసనీయంగా పనిచేస్తున్నాయో, యెంతమంది అనాథలకు ఆస్కారాన్ని కలిగించాయో అనేది చూస్తే ఆయనకృషిని ప్రశంసించనివారుండరు. అలాంటి సంఘసేవకుడు, నిష్కల్మష చిత్తుడు, ఉత్తమమిత్రుడు మనపట్టణాన్ని అంధకారంలో ముంచి అస్తమించాడు. నామట్టుకు నేను అలాంటి మిత్రుణ్ణి ఇక సంపాదించలేను. ఆయన చేసిన మహత్కార్యాలు గర్వించదగ్గవి.

"కాని ఒక్కవిషయం మీరంతా గమనించాలి. మనపట్టణానికి పేరుతెచ్చిన ఆవ్యక్తికి మనం చేయదగ్గ సహాయం ఒకటి ఉంది. ఆయన తనసర్వస్వాన్నీ సంఘసేవకు అర్పించి-పైగా ఋణంకూడా చేసిపోయాడు. ఇది ఆయనను నిందించడం గాదు. సత్కార్యాలకే వినియోగించాడుగాని దుబారా యేమీ చెయ్యలేదు. ప్రస్తుతం ఆయనభార్య, ఏకైక పుత్రిక జీవనం జరగక చాలా యిబ్బందిపడుతూన్నారు. ఒక యకరామాగాణి, ఒక పూరిల్లూ యివి ఉన్నాయి. కాని వాటికి తగిన అప్పుంది. పైగా అమ్మాయి వివాహానికి యెదిగివుంది. మనకు అపారసేవ చేసిన ఆ మిత్రుని కుటుంబాన్ని ఋణవిముక్తంచేసి వాళ్లకు జీవనోపాధికల్పించడమే యీసమయంలోమనము చూపవలసిన సానుభూతి! ఊరికే సానుభూతిసభ జరిపి లాభంలేదు. క్రియాపూర్వక మవాలి! అప్పుడే పరలోకంలో ఉన్న ఆయనఆత్మకు నిజమైన శాంతి లభిస్తుంది. మనం కృతకృత్యుల మవుతాము. ఆయన చూపిన త్యాగానికి మనం కృతజ్ఞత చూపకపోతే మన పట్టణం అధఃపతిత మవుతుం దన్నమాట."

అని ఒకే గుక్కలో ఆవేశంతో చెప్పి కూర్చు న్నారు.

సభలోంచి "హియర్! హియర్!" (వినుడు, వినుడు) అనే ప్రశంసావాక్యాలు వినిపించాయి.

ఉదయం యెనిమిదిగంట లవుతుంది. రంగమ్మ వెనకా ముందూ చూచుకుంటూ గేటు దాటి వరండా లో కొచ్చింది. తన కాళ్లు రాచుకుని ఆ పాలగచ్చు ఎక్కడ పాడైపోతుందో నని భయపడుతూ, అడుగులు వేస్తూ గదిప్రక్కను నుంచొని సందేహంతో లోపలికి తొంగి చూచింది. తలవంచుకుని కాగితాలు చూచు కుంటూన్న కామేశంగారు బుర్ర పైకెత్తారు. గది గుమ్మంలో నీడ కనిపించింది.

"ఎవరు వారు?" అన్నా డాయన.

"నేనండీ బాబుగారూ! రంగమ్మను. తమ కేదో పనుందని దాసీచేత కబురంపిస్తే ఒచ్చానండి!" అంది రంగమ్మ.

"లోపలికిరండి! మీతో ఒకవిషయం మాట్లా డాలి"

ఆమె బెదురుచూపుల్తో లోపలి కెళ్లి తలుపు దగ్గిరసా గోడ కానుకుని నుంచుంది.

మీరు దిగుల్లోఉంటారని యిన్నాళ్లనుంచీ మీతో నేను ప్రస్తాపన చేయలేదు. ఇప్పుడు అవసర మైంది. కాబట్టి మిమ్మల్ని పిలిపించాను. మూర్తిగారు నాకు రాసిచ్చిన దస్తావేజుసంగతి మీకు తెలుసా?" అన్నాడు కఠినంగా.

"తెలుసండీ బాబుగారూ!"

"ఒట్టి దస్తావేజు కాదుసుమా! మీకు ప్రస్తుత మున్న యకరా మాగాణి, ఇల్లూగూడా నాకు తనఖా పెట్టాడు. రిజిస్ట్రీ గూడా అయింది. యిదుగో కాగితం!" అంటూ డ్రాయర్లోని కాగితం బయటికి తీసి చూపాడు.

రంగమ్మ నిలువునా నీరయింది. నోట మాటరా లేదు. ఇదివరకల్లా ఒట్టి నోటేమో ననుకుంది. మాగాణి, యిల్లూగూడా తనఖా పెట్టా రనేసరికి ఆమెముఖంలో కత్తివాటు వేసినా నెత్తురుచుక్క లేకుండా పోయింది. ఇంకేముంది? అంతా పూర్తిఅయింది! తనకూ, సరోజకూ యిక గతేమిటి? యీ ఆలోచనలతో ఆమెకు మాటపెగల్లేదు. అతికష్టంమీద—

"ఒట్టి ప్రాంసరీనో టనుకున్నానండీ!" అంది.

"యీకాలంలో ప్రాంసరీనోటుమీద వెయ్యి రూపాయలు అప్పెవరిస్తారమ్మా వెర్రిదానా!" అన్నారు నిరాదరసూచక మందహాసంతో కామేశం గారు.

"మొత్తం యెంతయిందండీ బాబుగారూ!"

"యీ రోజుకు సరిగా పదిహేను వందల యింది. ఎంతైతేనేమి! నీ వేమిచ్చి తీర్చుకుంటావు పాపం! ఇంతకూ నీ దురదృష్టం. మణిపూసలాంటి భర్తను సంపాయించావు. మహాసంఘసేవకుడు! ఆస్తినీ, ఆఖరుకు పెళ్లాంపుస్తెనూగూడా ఆ పాడు సంస్థల కివ్వకపోతే యేంమునిగిపోయింది? కడకు అ వేమన్నా ఉద్ధరించాయా? చచ్చేదాకా వాటిని బట్టుకుని దేవుళ్లాడి మీకుమాత్రం గతిలేకుండా చేశాడు. ఆహాహా! ఏంప్రయోజకుడు! 'మూర్తి గారు చాలా గొప్పవారు. పాపం! పోయారు! వారి కుటుంబానికి మాసానుభూతి!' అని అందరూ అనగానే మీ కేం కడుపు నిండింది? ఇంతకూ ఆ ప్రశంసించేవాళ్లల్లో మీకు దమ్మిడీ సహాయంజేసే వాళ్లను చూపండి! ఎందుకొచ్చిందీ తెలివిపోని అవిధి? సంఘాలంటూ లేవదీసి వాటిద్వారా నాలుగుడబ్బులు సంపాయించి బాగుపడడం తెలివిగాని, యిలా దివాలా గావడ మేంతెలివి? ఎంతమంది లేరు ప్రపంచంలో, యీయన ఒక్కడేనా సంఘాన్ని ఉద్ధరించేది? చివ రకు కట్టుకున్న భార్యకూ, కడుపున పుట్టిన కూతురికీ ఆస్కారం లేకుండా చేసిపోయాడు. గొప్ప సంఘ సేవ!" అని తన కసినంతా వెళ్లగక్కేశారు కామేశం గారు.

రంగమ్మకు కళ్లనీళ్లపర్యంత మయింది. తాను దైవసమునిగా జూచుకుని, ఆయన సత్కార్యాలే చేశాడని తాను నమ్మిన తన భర్తను ఆయన స్నేహితుడే, తనయెదటనే యీవిధంగా తిట్టిపో స్తాడని కల్లోగూడా అనుకోలేదు. ఆ వాక్శూలాలకు ఆమెహృదయం గాయపడింది. బ్రదికివున్నకాలంలో స్నేహం, చచ్చింతర్వాత తిట్లు! ఏమిప్రపంచం! ఏమో సహాయం చేయడానికి పిలిపించా డనుకుని గంపెడాశ తో, ఎన్నడూ ఒకర్ని యాచించిగాని, భర్త గతించి నప్పటినుంచి గుమ్మందాటిగాని యెరగని తాను అభి మానాన్ని చంపుకుని యిల్లువెదుక్కుంటూ వస్తే ఇదీ ఆయ నిచ్చిన సంభావన!

"అయ్యో! అలా అంటా రేమండీ! వారికి మీ రంటే ప్రాణం. యీనాడు మీనోటంటనే యీ మాటలు వింటూంటే నాకు చాలా కష్టంగా వుంది వారేం పొరబాటుచేశారు? అనాథలకు తన ధనాన్నీ, శరీరాన్నీ అర్పించారు; హరిజనవిద్యార్థులకు హాస్టలు కట్టించారు; దిక్కులేని బీదలకు రాట్నాలు కొని యిచ్చి జీవనోపాయం చూపారు. యివి చెడ్డపనులాండి? వారు దుబారాచేసిం దేమీ లేదు. మీ రలా అన వచ్చునా?"

"ఆహా! అద్భుతకార్యాలు చేశాడు! నే నంటే ప్రాణం గాబట్టే నన్ను నిలువునా ముంచేశాడు అందువల్ల వారి కీర్తి ఆచంద్రార్కం నిలుస్తుంది! నీవు మంచి అంటుంటే నే నెందుకు కాదనాలి? నిన్ను చూచేసరికి జాలి కలిగి అలా అన్నానుగాని మధ్య నా కెందు కీగొడవ! అన్నట్టు మరిచిపోయాను. నా దస్తావేజు మాటేమిటి మరి?"

"నేను ఆడదాన్ని యేం జేయగలను బాబు గారూ! మా పరిస్థితులు మీకు తెలుసుగా! మీదయ ఉంటే యింత సంకటి తింటూ ఆనీడపట్టున పడి ఉంటాము. అదీగాక పిల్ల పెండ్లికి యెదిగివుంది. ఏ అయ్యచేతులోనన్నా పెట్టవలసిం దొకటుంది. మా జీవనం జరగాలి! యివన్నీ తమరు ఆలోచించండి! మాగాణీ, యిల్లూ మీరు తీసుకుంటే యిక మాకు దిక్కేమిటి? యే చెట్టుకిందనో అడుక్కుతింటూ అల్లాడవలసిందేగదూ! తర్వాత మీ అనుగ్రహం!"

"యీ వేషాలన్నీ నాముందర సాగవు! కొంప నల్ల జేసుకోమని నేనేమైనా చెప్పానా? ఎవరి ఖర్మం వాళ్ల నుభవించాలి! మీసొదంతా నాముందు వెళ్ల బోసుకుంటే యేం లాభం? ఊళ్లో అందర్నీ అడుక్కు తినేవాళ్లను రక్షించడానికి నేనా కర్తను?"

"నే నలా అనానాండీ! తమ దయ అని అడుగుతునాను"

"మధ్య నాదయేమిటి? ఓవేపు కంతరొక్కం వెయ్యిరూపాయ పోగొట్టుకుని నేనేడుస్తూంటే ఇంకా దయేమిటి? ఆరోజు యెలాగో బుద్ధిపుట్టింది గాబట్టి తనఖా పెట్టించుకున్నాను. లేకుంటే నోట్లో వేలేసుకో వలసిందేగదూ!"

"యిప్పుడుమాత్రం నేను బాకీ అబద్ధ మంటు నానాండీ?"

"పెగా అబద్ధమనాలి గాబోలు రిజస్టరీ అయిన దస్తావేజునుగూడా! బాగుంది వరస! మీకోస మని నాడబ్బు పోగొట్టుకుంటానా? నాకూ పిల్లా జెల్లా వున్నారు. ఉన్నది లోకుల కిచ్చి సన్యాసినై పోవా లని గాబోలు మీవూహ!"

"అంతమాట లెందుకండీ! తమరు మహారాజులు! యీ పది హేనువందలూ తమకు యెక్కడ రావడం లేదు? అందుకని ప్రాధేయపడుతూన్నాను. మమ్మల్ని కరుణించి ఋణవిముక్తులను చేస్తే ఇంత గంజితాగి బతుకుతాము"

"మహారాజునే! ఇదేం మేరుపర్వతమా? ఇలా అందరికీ తోసేస్తూంటే చివరకు నేను మిగుల్తాను. మీయిష్టం! దమ్మిడీ గూడా పోనిచ్చేది లేదు. నా కష్టార్జితం! సంసారమంతా లోకులకు కొల్ల బెట్టి నా మీద బడి యేడుస్తా రేమిటి? మొదటనే భర్తను దిద్దు కోలేకపోయావా అంత అభిమానం గల యిల్లాలివై తే? దేనికైనా దూరదృష్టి అవసరం గాదూ! ఆయనకు అనుకూలంగా నీవూ తాళం వేస్తూంటే ఇదీ చివరకు

తేలింది! నా తప్పేమిటి? నీ కెలా నోరొచ్చిందమ్మా నన్ను నష్టపోమ్మని చెప్పడానికి? ఒకటా రెండా? పదిహేను వందలు! అయ్యయ్యో! నాకు మతిపోతోంది! రేపే దావా పడెయ్యబోతున్నాను. మర్యాదగా ఆయిల్లూ, మాగాణీ ఒదిలేసి వెడితే మంచిది. లేకుంటే బోలెడంత గ్రంథం జరుగుతుంది! బాగా ఆలోచించుకోండి! మీతో వాదించడానికి నాకు టైము లేదు!" అంటూ కామేశంగారు కండువా వేసుకుని వరండాలో కొచ్చారు. వారి వెనకాలే రంగమ్మకూడా బయటికొచ్చింది.

సంతత ధారగా కన్నీరు కారుతూంది రంగమ్మకు! ప్రపంచమంతా శూన్యంగా కనిపించింది. ఆ ఉండేది కాస్తా వూడితే తనూ, సరోజా యేంగావాలి? దిక్కు లేని పక్షి అయింది. ఏం జేస్తుంది? ఆదుకునేవా ళ్ళెవరూ లేరు!

తటాలున కామేశంగారి రెండు పాదాలూ పట్టుకుంది వెక్కి వెక్కి యేడుస్తూ-

"బాబుగారూ! అన్నం పెట్టినా మీరే; చంపినా మీరే! ఆపదాన్ని! భిక్షం పెట్టండి!" అంటూ అతని పాదాలను అశ్రువులతో తడిపింది. అది ఉక్కు గుండె! కరుగుతుందా?

కామేశంగారు వికటంగా నవ్వుతూ పాదాలను యివతలకు లాక్కుని—

"ఎక్కడ నేర్చావమ్మా యీ టక్కులు? కడకు యిదే మంచి ప్రయోగ మనుకున్నావు గాబోలు! నీ యేడుపులకు నేనేమీ చలించననుకో! మా యింట్లో యాడవడ మేమిటి? నీ భర్తను తలుచుకుని మీ యింట్లో కూచుని బాగా యేడు! నా బాకీ మాత్రం వసూలై తీరవలసిందే!" అని గర్జించి గబగబా గేటు దాటి పోయాడు!

స్తంభించిన కన్నీటితో రంగమ్మ ఆయన పోయిన వేపే శూన్యంలోకి చూస్తూ నుంచుంది!

## 3

"రంగమ్మగారూ! యిలా రండి!" అనే మృదుస్వరం వినిపించింది. రంగమ్మ బాహ్యప్రపంచంలోకొచ్చింది. పమిటచెంగుతో ముఖం తుడుచుకుని నలువైపులా దృష్టి ప్రసరింపజేసి "ఎవరో!" అనుకుంది. యిక ఆ యింట్లో అరక్షణంగూడా నిలవడానికి మనస్సొప్పక, ముందుకు అడుగులేస్తూ "ఇకముందు ఆత్మహత్యే గదా గతి!" అనుకుంది. వెంటనే సరోజ సంగతి జ్ఞాపకం రాగానే కన్ను చెమ్మగిలింది.

"మిమ్మల్నే! యిలా రండి!" అని మళ్లీ అదే కంఠస్వరం.

వెనుదిరిగి చూచింది. వరండా ప్రక్కగది కిటికీలోంచి ఒకముఖం కనిపించింది. "ఆమే! విశాలాక్షమ్మ! కామేశంగారి భార్య!" అని మనసులో అనుకొని, "ఆయన అన్న మాటలు చాలక యీమెగూడా యింకా యేమో అనదలుచుకుంది గాబోలు!" అనే భయంతో తల గిరుక్కున తిప్పుకుంది.

"పిలుస్తూంటే వెడతా రేమిటి?" అంది మళ్లీ విశాలాక్షమ్మ.

"ఎందుకు తల్లీ! సగం చచ్చిపోయాను. పూర్తిగా చంప దలుచుకున్నారా!" అనే సరికే ఆమె కంఠం రుద్ధ మయింది.

"అయ్యో! మిమ్మల నేమీ అనడానికి గాదు. ఒక్కమాట వినిపోండని పిలుస్తున్నా! అంతే! యిలా లోపలికి రండి!" అంది విశాలాక్షమ్మ నొచ్చుకుని.

విధిలేక వెనక్కు తిరిగింది రంగమ్మ. ఆమెను లోపల గదిలోకి తీసి కెళ్ళి కూచోమని తానుకూడా యెదురూగా కూచుంది విశాలాక్షమ్మ. రంగమ్మ ఉబికి వచ్చే అశ్రువులను మాటిమాటికీ అడ్డుబెట్టుకుంటూంది.

"అలా యిదవకండి! నేనుగూడా వారంటూన్నది యావత్తూ వింటూనే వున్నా. నేనేమో యింకా అంటానని మీరు బెదరనవసరంలేదు. నేనూ ఆడదాన్నే! నాకూ హృదయ ముంది! మిమ్మల్నన్న మాటలకూ, మీరున్న స్థితికీ నాకు కళ్ల నీళ్లొచ్చాయి." అంది విశాలాక్షమ్మ జాలిగా కండ్లు తుడుచుకుంటూ.

"అసహాయ నని అలా అనడం ధర్మమేనాండి!"

"అన్నీ ఆలోచిస్తారా ఆయన? ఆ స్వభావమే అంత! ఆమాటలన్నీ మీరు మరిచిపోవాలి. ఆయన సహాయంచేయకపోయినా నేనున్నాగా! మీకేం ఫరవాలేదు!"

ఆశ్చర్యమైంది రంగమ్మకు. అమృతం వర్షించినట్లైంది. "ఆయనమాటలకూ, యీమె మాటలకూ యింత తేడా వుందేమిటి? ఆయనే ఆవిధంగా తృణీకరించినప్పుడు యీవిడేం సహాయం చేస్తుంది?" అనే తర్కంలో పడ్డది రంగమ్మ.

"ఏమిటో ఆలోచిస్తున్నారట్లే ఉంది?"

"ఏముంది? ముందుగతి ఎలాగా అని."

"మీ కొంచింత అవసరంలేదు. మీరూ, మూర్తిగారూ ఆదర్శదంపతులు. నాకు మీరంటే చాలా అభిమానం. మీరిద్దరూ కలిసి సంఘసేవకు మీసర్వస్వమూ అర్పించారు. అనేకులు అనాథలను అభివృద్ధిలోకి తెచ్చారు. ఆయన చేసిన త్యాగంలో, సాధించిన మహత్కార్యాల్లో మీకుగూడా వాటా వుంది. మీకు యేమీ మిగల్చ లేదని మీరు ఆయన్ని నిందించక పోవడం మీలోని గొప్ప సుగుణం. యీ డబ్బేం శాశ్వతమా? ఒక్క మంచిపేరే భూమ్మీద నిల్చేది. మీ దంపతులు అది సంపాదించగలిగేరు! మీరు ధన్యులు."

ఆమాటలు వింటూంటే రంగమ్మహృదయం ఉప్పొంగింది. అనుకోని ఆదరణ ఆమెలో నూతనోత్సాహం కలిగించింది. "నిజంగా విశాలాక్షమ్మ యింత మంచిదా?" అనుకుంది. కాని కామేశంగారి మాటలు యింకా చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. "ఏం ధన్యులం లెండి! ఇంతవరకూ ఎవరివల్లా మాటపడి యెరగను. చివరకు ఆయనగూడా యేసందర్భంలోనూ పల్లెత్తు మాట అనిన పాపాన బోలేదు. ఈరోజు..."

"అదేగా మొదట చెప్పాను మరిచిపొండని! ఆయనకు డబ్బంటే ప్రాణం. ఇందాకానే నేను మాట్లాడుదా మంటే వీలులేకపోయింది. మీఋణం తీర్చందీ ఆయన ఒదలడు!"

"కానీండి! మాప్రాప్తం!" అంది నిస్పృహతో రంగమ్మ.

"అలా అని వూరుకుంటే? అందుకనే మీకు సహాయంచేయమని భగవంతుడు నన్ను పురికొల్పుతున్నాడు. వారు చేయలేకపోయినా నేను చేయడానికి పూనుకున్నాను."

"సహాయమా? ఎలా చేస్తారు? వారు ఒప్పుకోరే?"

"వారి అంగీకారంతో అవసరంలేదు! ఉండండి యిప్పుడే వస్తాను!" అంటూ లోపలి కెళ్లింది విశాలాక్షమ్మ.

రంగమ్మ కేమీ బోధపడక యిదేదో యింద్రజాల మనుకుంది. కాని అంత ఆప్యాయంగా మాట్లాడి ద్రోహం చేస్తుందా అని సమర్థించుకుంది. పర్యవసానం చూడాలని ఆమెవూహ!

ఒక చిన్న పెట్టె చేత్తోపట్టుకుని వచ్చి కూర్చుంది విశాలాక్షమ్మ. బాగా పరీక్షిస్తూంది గాని రంగమ్మకు ఆమెఅభిప్రాయ మేమీ తెలీలేదు.

"దస్తావేజుమొత్త మెంతన్నారూ?"

"ఆసంగ తిప్పు డెందుకు లెండి!"

"అలా కాదు. మీరు చెప్పితీరాలి!" అంది విశాలాక్షమ్మ ఆజ్ఞాసూచకంగా.

"పదిహేనువందలండీ!"

పెట్టె తెరిచి ఒక నోట్లకట్ట బయిటికి తీసింది. జాగ్రత్తగా లెక్కపెట్టి పదిహేనూ తీసి మిగిలినవి పెట్టెలో పెట్టింది. పదిహేను వందరూపాయలనోట్లు! రంగమ్మ తెల్లబోయి చూస్తూంది. ఆమెకు విశాలాక్షమ్మ అభిప్రాయ మేమిటో బోధపడలేదు.

"ఇవిగో పదిహేనువందల రూపాయలు. ఇవి వారికిచ్చి మీఋణం తీర్చుకోండి!" అంటూ విశాలాక్షమ్మ మందహాసంతో నోట్లను అందించింది. రంగమ్మ యీప్రపంచంలో లేదు. అనుకోని సంఘటన!

"మీరనేది నాకు బోధపడడం లేదు!"

"అలా అంటా రేమిటి? మిమ్మల్ని ఋణవిము క్తులను జేయడమే నాసంకల్పం. మీరేమీ అనకో వద్దు! కొన్నాళ్లు చీకటి, కొన్నాళ్లు వెన్నెల! మీరూ, సరోజా పడే కష్టాలకు నాహృదయం బాధపడు తోంది. సంఘసేవకు మీసొత్తు అర్పించారుగాని మరేం దుబారా చేయలేదు! హృదయం లేనివా రెవ్వైనా అంటారు! మీరు కలవరపడగూడదు! ఇదిగో తీసి కోండి!" అంది.

అభిమానం వెనక్కు లాగింది రంగమ్మను.

"మీ రివ్వడం, నేను తీసుకోవడం లోకం హర్షిస్తుందా? కామేశంగారికి తెలిస్తే ... అయ్యో ఎందుకండీ మధ్య మీకు కష్టం? నన్ను పోనివ్వండి!" అని రంగమ్మ లేవబోయింది. విశాలాక్షమ్మ ఆమె చేయి పట్టుకుని కూచోబెట్టి—

"అడుగడుక్కూ మీరు మూర్ఖంజేస్తే యెలాగా? మీరు నా అభిప్రాయం గ్రహించలేనందుకు నాకు చాలావిచారంగా ఉంది. ఇది నాడబ్బు! మాపుట్టింటివా రిచ్చారు సొమ్ము చేయించుకోమని. ఇందులో ఆయ నది చిల్లిగవ్వగూడా లేదు. నాడబ్బు నేను మీ కిస్తు న్నాను. లోకానికి దీంతో యేమీ సంబంధం లేదు. మీరు తీసుకోకపోతే చెడ్డఒట్టు!" అంటూ రంగమ్మ చేతుల్లో పెట్టింది నోట్లను.

దీనదృక్కులతో ఆమెవేపు చూచింది రంగమ్మ.

బయటినుంచి "అమ్మా" అని కేక వినిపించింది. "మీసరోజగాబోలు!" అంటూ విశాలాక్షమ్మ లేచి వెళ్లి "రా! సరోజా!" అని చెయిబట్టుకొని వచ్చి తన ప్రక్కను కూచోబెట్టుకుంది.

పోతబోసిన బంగారుబొమ్మ. కమ్మని కను ముక్కుతీరు. ఆడాళ్లకుగూడ మోహాన్ని కలిగించే రూపం.

తల్లి చేతులోని నోట్లను చూచి "అవెక్కడి వమ్మా!" అంది ఆ అమ్మాయి ఆశ్చర్యంతో.

"విశాలాక్షమ్మగారి దయ తల్లీ!" అంది రంగమ్మ కృతజ్ఞతాపూర్వక దృక్కులతో. సరోజ యేదో మాట్లాడబోయింది.

"మీసరోజ కెన్నో యేడండీ రంగమ్మగారూ!"

"మొన్న పుష్యమాసానికి పధ్నాలుగూ వెళ్లాయి. కన్నతండ్రికి కరువైంది. దానిసంగతి తల్చు కుంటే కడుపు చెరువవుతుంది. ఏఅయ్యచేతులో పెడదామనుకున్నా మాస్థితి యిలా వుంది. దాని ముందుగతేమో!" అని వేడినిట్టూర్పు విడిచింది రంగమ్మ. తల్లిదిగులుచూచి సరోజకూడా ఒక కన్నీటి బొట్టు రాల్చింది.

"అలా మీరు దిగులుపడుతూంటే ఎలా బేజారై పోతోందో చూడండీ అమ్మాయి! తప్పమ్మా సరోజా! దిగులుపడవచ్చా? నీకు మంచిమొగు డొస్తాడులే!" అని బుగ్గ నిమిరింది విశాలాక్షమ్మ. ఆదుఃఖంలో ఒక సంతోషపుఅల.

"అలాంటి అదృష్టమా! మీ నోటివాక్యాన" అంది రంగమ్మ గుండెబరువుతో.

"యీ చక్కనిచుక్క పెండ్లి కేమండీ! మరి నేనొక మాటంటాను మీకు సమ్మతమేనా?" అంది నవ్వుతూ విశాలాక్షమ్మ.

"ఏమిటో!"

"ఏంలేదు. మా సత్యాని కిచ్చి చెయ్యరాదూ! ఏం సరోజా! మాసత్యాన్ని చేసుకుంటావూ?"

సరోజ సిగ్గుతో చిరునవ్వు నవ్వి తలవంచు కుంది. రంగమ్మ ముఖం విప్పారిందిగాని వెంటనే ముడు చుకుపోయింది.

"మీరు మహారాజులు! మీకూ మాకూ ఏం సాటి?"

"అలా అంటా రేమిటి? మహారాజులైతే బంగారం తింటారా? ఇంతకూ మీసంప్రదాయం మంచిది. మీసరోజ అందమైంది. అంచేతే మిమ్మల్ని అడుగుతూన్నాను."

"పరిహాసాని కంటున్నారేమో!"



# 2000 ఏళ్లకు ముందు..

పూర్వపువారు చందనమును పరిశుద్ధతకు పర్యాయపదముగా నిర్ణయించినారు. నేటివారు మోటారులలో "రోల్స్‌రాయిస్"ను ఉత్తమమయినదని చెప్పినట్లు, మంచివస్తువుల ప్రసంగములో చందనమును శ్రేష్ఠమయినదానినిగా ప్రశంసింతురు. చందనము, మధుర పరిమళము, చలువగుణము కలిగియుండుటవలన చందనతైలము సౌందర్యాలంకార వస్తువులలో ముఖ్యముగా ఉపయోగింపబడుచున్నది. అశోకుని కాలమున యధార్థముగా అంగీకరింపబడిన విషయము నేడుకూడ యథార్థమే!

## మైసూరు
## శాండల్ సబ్బు



"పరిశుద్ధతకు ప్రసిద్ధమైనది చందనమే"

B-3.TG — మైసూరు గవర్నమెంటు ప్రాడక్టు

పుష్టి గల ఆహారం
అమరినా లేకున్నా,
మిమ్ము బలాఢ్యులనుగా చేసే
# అమృత

సర్వదా అమ
అమృత పుష్టినిచ్చే బలవర్ధకౌషధము

* కేసరి కుటీరం లిమిటెడ్, మదరాసు *

## మీ కండ్లను కాపాడుకొనుడు

జాయ్ కెమికల్ వర్క్సువారి **ఐరిట్** పూర్తిగా నిరపాయకరమైనది. కండ్లపొరలను హరించి దృష్టిని చక్కబరచుటలో దీని ప్రభావ మద్భుతము గనుక కండ్లపొరల ఆరంభదశలో దీనిని సర్వదా క్షేమముగను. ప్రయోజనకరముగను ఉపయోగించవచ్చును.

**ఐరిట్** శుక్లములమసక (**Opacity of Cornea**) కు, బాధకలిగించు కంజంక్టివిటిస్ (**Painful conjunctivitis**)కు, గ్లకోమావలనదృష్టి లోపమునకు, రెటీనాలేక కంటినరముల జబ్బులకు, కంటి నుంచి అన్యపదార్థములు తీసివేసిన తరువాత మిగులు హెచ్చుతగ్గులకు కూడ గట్టిగాపనిచేయును. కంటి ఆపరేషను తరువాత దీనిని ఉపయోగించినచో మిగిలిన పొరలను ఇతరదోషములను హరించును.

కన్ను ఆరోగ్యముగా నుండినపుడు ఉపయోగించినచో దృష్టి అభివృద్ధిఅగును, పొరలుగాని, ఏ ఇతరకంటిబాధలుగాని కలుగనేరవు. దీనిని తియ్యక కొంతకాల ముపయోగించుటవలన కంటి అద్దములు పెట్టుకొనవలసిన అవసరముకూడ తప్పించుకొనవచ్చును.

వెల 2 డ్రాములబుడ్డి 1-కి రు. 1-4-0. 4 డ్రాముల బుడ్డి రు. 2 లు.

**హెూమోపతి, బయోకెమిస్ట్రీ** యుద్ధమునకుపూర్వము నేను పనిచేసియున్న సుప్రసిద్ధజర్మను కంపెనీకెమిస్టువద్ద నేను నేర్చుకొనినవిధానములతో మిక్కిలి శాస్త్రీయముగను, హామీగను తయారు చేయబడి పట్టుతప్పని నా హోమోపతీమందులతో మీమందులపెట్టెను నింపుడు. వీటివెల డ్రాము 1-కి 0-3-0, 0-3-6. బయోకెమిక్ మందుల ధర—పౌడరుగాని ట్రిట్యురేషన్ గాని—డ్రాము 1-కి 0-3-6, బిళ్లలు డ్రాము 1-కి 0-4-0.

**Dr. R. MOHALANOVIS,**
Post Box No. 10013, CALCUTTA.

"నా కేకోశానా అలాంటిది లేదు. నిజంగా అంటున్నా! సరోజను మీ రిచ్చితీరాలి!" అంది స్థిర దృష్టితో విశాలాక్షమ్మ.

"మీరు అంతగా కావాలంటూంటే నేను కాదంటానా ? ఇదే నిజమైతే మాఅమ్మాయి అదృష్టవంతురాలు. ఇంతకూ కామేశంగా రొప్పుకోవద్దూ!"

"ఇంకా మీకు సందేహమేనా? అదంతా నా భారం! మీరుమాత్రం మాటతప్పేరుసుమా! హాస్యం కాదు. ఇవే పెండ్లిమాట లనుకోండి!" అంటూ "అబ్బాయ్! సత్యం!" అని పిలిచింది.

పై అంతస్తులో శబ్దమయింది. మెట్లమీద జోడు చప్పుడు.

"అమ్మా! పిల్చావా?" అంటూ సత్యం గదిగుమ్మంలో నుంచున్నాడు. పందొమ్మిది యేండ్లుంటాయి. బంగారంలాంటి శరీరచ్ఛాయ. యౌవనం శరీరంలోంచి తొంగిచూస్తోంది. అందం కరుడుగట్టి వుంది. అప్రయత్నంగా అతని చూపు సరోజమీద ప్రసరించింది. సరోజ అతని దృష్టిలో తన దృష్టి ఒకమారు మిళితం చేసింది. సిగ్గుతో ముఖం కందింది. తల వంచుకుంది. చిరునవ్వు సత్యం పెదవులమీద నాట్యంచేసింది.

"ఎందుకు పిల్చావమ్మా!" అన్నాడు సత్యం.

"పెండ్లికూతుర్ని చూచావా ? నీవు 'చేసుకుంటా'నని చెపితే ఆమె వినాలని కూచోనుంది."

"ఇదివరకే చెప్పాగా!"

"అలాకుదరదు. ఇప్పుడామె వినాలంటోంటే!"

"మళ్లీనా? చేసుకోవడం ఖాయమే!" అని వెనక్కి తిరిగిపోయాడు.

"ఇదివరకే చెప్పా నంటాడేమిటి మీ అబ్బాయి?" అంది రంగమ్మ.

"అదేమిటో మీ సరోజనే అడగండి!" అని నవ్వుతూ, "మీకు తెలీదు గాబోలు! మావాడు మీయింటి ముందునుంచే కాలేజీకి వెడుతూంటాడట! ప్రతిరోజూ మీ సరోజ కనిపిస్తూంటుందట! ఇద్దరి మనస్సులూ ఎప్పుడేకమయాయో! ఎన్ని సంబంధాలు వచ్చినా ఏదో సాకు జెట్టి తప్పించుకుంటూంటే నేనే మొన్న నిలవదీసి అడిగితే సరోజనుతప్ప యింకెవర్నీ చేసుకోనని పట్టుబట్టాడు. నాకూ సంతోషమయింది" అంటూ—

"అప్పుడే మా కుర్రాణ్ణి వల్లో వేసుకున్నావా?" అని సరోజను ముద్దుపెట్టుకుంది.

రంగమ్మ ముగ్ధురాలై అలాగే చూస్తోంది.

"ఎలా ఒచ్చింది చెప్మా యింతరొక్కం రంగమ్మకు! చిత్రంగా వుందే!" అంటూ లోపలి కొచ్చారు కామేశంగారు.

"చిత్ర మేమిటండీ !" అంటూ విశాలాక్షమ్మ యెదురుగా వొచ్చింది.

"నేను కలలోగూడా అనుకోలేదు సుమా! రంగమ్మ పదిహేనువందలూ తెచ్చియిచ్చి తనఖా దస్తావేజు రద్దు రాయించి తీసికెళ్లింది ఎక్కడిది ఆమె కంత డబ్బు?"

"ఆమెనే అడగలేకపోయారా?"

"అడిగాను. ఆమెదీనదశ చూచి జాలిపడి ఎవరో స్నేహితురాలు యిచ్చిందట! అంతమొత్తమెవరిస్తారేమిటి? ఆమెమాటలు నమ్మదగ్గవేనా?"

విశాలాక్షమ్మకు ఒళ్లుమండింది. ఆయనకర్కశ హృదయాన్ని బద్దలుగొట్టాలనే పట్టుదల ఆమెకు కలిగింది. ఉదయం మాట్లాడలేక పోయిందిగాని యిప్పుడు యెక్కడలేని ఆవేశం కలిగింది. ఏమైతే అవుతుందని సాహసించింది.

"మీదంటే జాలిగుండెగాని అందరివీ అలాగుంటాయా?"

"ఆఁ! ఏమిటే? నాది జాలిగుండే!"

"ముమ్మాటికీని! ఆమె అలా కాళ్లమీదపడి యేడుస్తూంటే జాలిగుండె కాకపోతే అన్నిమాటలూ అని నెట్టేసి వెళ్లిపోతారా? వింటూన్న నాకే కళ్లనీళ్లు గిర్రునతిరిగాయి."

"నిజమే! డబ్బెలా వస్తుంది మరి? వాళ్ల సంసారాన్ని నేనేమైనా చెరిచానా?"

"ఇంకేంగావాలి చెరచడానికి? కడకు ఆమె నేడిపించి పదిహేనువందలూ వసూలుచేస్తిరి! మొన్న సభలో యేమన్నారో జ్ఞాపక ముందా? మూర్తిలాంటి వారు లేరనీ, వారు గొప్ప సంఘసేవకులనీ, అనేకసంస్థలు స్థాపించి పట్టణానికి కీర్తిసంపాయించారనీ ఏకంగా పొగిడారు. ఆయనకుటుంబానికి సహాయంచేయాలనీ, ఉద్ధరించాలనీ ఆవేశంతో యేమేమో చెప్పారు. అలాంటిమీరే యీరోజు ఆ దేశసేవకుని భార్య - అనాథ - వద్దనే చెవులుపిండి డబ్బు వసూలుచేశారు. యిదీ మీఉపన్యాససారం. యీమాత్రానికి అంతమంది జనంలో ఒట్టిగబ్బర్లు చెప్పడ మెందుకూ? ఇలాగే ఉంటుంది ప్రపంచం. బ్రదికున్నాళ్లూ చాలా మంచివాడనీ, సంఘసేవకుడనీ అంటూంటారు. చచ్చిన తర్వాత మొక్కుచెల్లించుకోవడానికి సానుభూతిసభ అంటూ జరిపి ఆవేశంతో ఏదో అర్థంలేకుండా మాట్లాడుతారు. క్రియ కొచ్చేసరికి ఆ కీర్తిశేషుని కుటుంబాన్ని తలుచుకునేవాళ్లుగూడా వుండరు. పైపెచ్చు ఆకుటుంబ నాశాన్నే కోరుతూంటారు కొందరు. అంచేతే సత్యానికీ, త్యాగానికీ ప్రపంచంలో తావే లేదు." అని ఆవేశంతో అంది.

కామేశంగారు కొయ్యబారిపోయారు.

"యీరోజు యేమి టీవరుస! ఆమె యిచ్చింది; నేను తీసుకున్నాను. మధ్య నీ దబాయించ పేమిటి? సభకు వెళ్లడం తప్పా? వాళ్లు గౌరవంగా అగ్రాసనాధిపత్యం యిస్తే దర్జాకోసం మూర్తిని గురించి యేవో రెండుముక్కలు చెప్పాను. అలా చెప్పకపోతే పరువేముంటుంది? చెపితేమటుకు అవన్నీ మన బాకీకి అన్వయిస్తా యనుకున్నావా?"

ఇంతలో ప్రక్కగదిలో చదువుకుంటూన్న సత్యం బయిటి కొచ్చాడు.

"ఏమిటి నాన్నగారూ! ఆ అర్థంలేని మాటలు? మీరు చూపిన సానుభూ తేమిటి? మీరు చెప్పిన ముక్కలు మీరే జరపలేకుంటే ఎందుకూ అవి చెప్పడం? వారి కుటుంబాన్ని ఉద్ధరించాలని మీ రనలేదూ? కడ కిదీ ఉద్ధరించడం! ఎందుకండీ యీ పనికిమాలిన సభలు? స్వర్గంలో వున్న మూర్తిగారు మీచర్య జూచి యెంతగా దుఃఖిస్తున్నారో!"

"ఇద్దరూ ఏకమై నామీద యిలా విరుచుకు పడుతున్నారేమిటి? ఎవరికోసం నేను వసూలు చేసింది?"

ఆమె అందుకుని—

"ఆఁ! వసూలుచేశారు! మంచీ చెడ్డా గమనించవద్దూ? ఇప్పుడు బోలెడుందే! అది చాలదూ వాడికి? ఇంకా యెందర్ని యేడిపించి సంపాయించాలి? పోయేటప్పుడు మీరూ నేనూ నెత్తిన పెట్టుకు పోతామా? వాళ్లేమన్నా యిచ్చింది మన కేం అచ్చొస్తుంది? మొన్న ఆ రామదాసు మొత్తుకుంటూంటే వాడి యిల్లూ, వాకిలీ జప్తీచేయించి యాలంవేయిస్తిరి. ఆ అవధానిని బికారిని చేసి దేశాంతరం పంపిస్తిరి. యీదినం రంగమ్మ! యిదేం కొత్తా? ఉసూరుమనిపించి వాళ్లవద్ద తీసుకున్నది మన కేం శ్రేయస్సు నిస్తుంది? మనకు వుండేది ఆ ఒక్కడు. యెనిమిదికాన్పులకు యీనలుసు మిగిలాడు. ఎవరినోటంట ఏమొస్తుందో అని నే నల్లాడుతున్నాను. కడుపుమ డినవాళ్లు ఏమైనా అంటారు. ఆ వుసురూ, ఘోషా మనకు కాదూ? బిడ్డలు గలవాళ్ల కంత కఠినం పనికిరాదు. రామ రామ! మీ రామెనన్న మాటలూ, మీపనులూ చూస్తూంటే భయ మేస్తోందిబాబూ! మీరు ఊరేగండి యీయింట్లో! నేనూ, వాడూ ఎక్కడైనా బతుకుతాము!" అని ఏకంగా విశాలాక్షమ్మ మెత్తని చీవాట్లు పెట్టింది.

కామేశంగారు నిర్విణ్ణులై—

"ఎందు కీ గొడవంతాను? నన్ను బ్రదకనివ్వవా యేమిటి? చాలించుదూ నీకు పుణ్యముంటుంది? ఎవరైనా వింటారు!"

"వింటే మునిగిపోయిం దేమిటి? యీరోజు మొదలు మీ రీవడ్డీవ్యాపారం మానేయాలి: తెలిసిందా? ఉన్నది చాలు!"

"సరే! నీయిష్టప్రకారమే! ఊరుకుంటూ నన్ను చంపక!"

"వసూలు చేశారుగా రంగమ్మ వద్దిర! మా పుట్టింటివాళ్లిచ్చిందాంట్లో పదిహేనువందలూ నేనే ఆమెకిచ్చి చెల్లింపజేశా, తెలిసిందా? దాంట్లో మీది దమ్మిడీ లేదు! ఆమెఘోష చూడలేకపోయాను!"

"ఆఁ! నిజంగా నీవేనా యిచ్చింది?"

"అవును. నేనే. ఎందు కాశ్చర్యం? అదేగాదు! ఆమెకూతురు సరోజను సత్యానికి మాట్లాడాను. పెండ్లి ఖాయం."

"అదేమిటే? ఆ దరిద్రపుపిల్లనా? మనవాడికా? నేనున్నా ననుకున్నావా, పోయాననుకున్నావా?"

"శుభమల్లే అలా అంటా రేమిటి? ఏం, నేను మాట్లాడగూడదూ! దరిద్రులం మనమే! పేరా ప్రతిష్ఠా? ఇంకా వాళ్లే సత్కార్యాలు చేసి పేరు సంపాయించారు. మనకంటే వాళ్లే మేలు."

"నాకు మతిపోతోంది! ఏమైనా మీ యిష్టం! ఇల్లంతా నా కెదురుతిరిగింది. ఇంతకూ వాడు చేసుకుంటా నన్నాడా?"

"తప్పక. సంతోషపూర్వకంగా చేసుకుంటానన్నా! ఆపిల్ల మన యింటికి రావడం మన అదృష్టం! నీవూ అంగీకరించాలి!"

"పరిస్థితులు మారినప్పుడు తప్పుతుందా? ఒప్పుకున్నా నాయనా! నీవు ఒకయింటివాడవు కావడమే నా అభిప్రాయం. సంతోషంతో ఆశీర్వదిస్తాను. వెనకటి పనులకు పశ్చాత్తాపపడుతున్నాను. దేవుడు క్షమిస్తాడో లేదో!" అంటూ కామేశంగారు ఒక అశ్రుకణాన్ని రాల్చారు.

* * *

సత్యానికీ, సరోజకూ అతివైభవంగా వివాహం జరిగింది. పెద్ద లందరూ వధూవరుల నాశీర్వదిస్తూ—

"కామేశంగారు నాడు సభలో అన్న మాటలను యథార్థంగా ఆచరణలో పెట్టి మూర్తిగారి కుటుంబాన్ని ఉద్ధరించారు! నిజంగా కామేశంగారు దీనబాంధవుడు" అన్నారు ఏకకంఠంతో.

"దీనబాంధవుణ్ణి నేనేనా?" అని సవితర్కంగా కామేశంగారు తన అంతరాత్మను ప్రశ్నించుకున్నారు.

"నీవు కాదు!" అని అతని అంతరాత్మ జవాబిచ్చింది!



# 'ఏకోరసః కరుణ ఏవ!'

= శ్రీ రా. వేం. మ. గం. రామారావు =

ఆకలీ, ఆకలీ,
బిచ్చగానికి ఆకలీ.
అవనిలోని అన్నపూర్ణలు
పారబోసిరి అన్నమెంతో పెంటపైని.
—ఆకలీ, ఆకలీ, బిచ్చగానికి ఆకలీ!
ధూళిలో తూలిపోతూ
ఎండలో సోలిపోతూ
నీళ్లలో ములిగిపోతూ
కూలిపోయా డయ్యా నాబిచ్చగాడు.
దేశాన వెలిసిన విశ్వకర్మలు కలిసి
ఉన్న సత్రా లన్ని ఊడబెరికేరు.
—ధూళిలో తూలిపోతూ
ఎండలో సోలిపోతూ
నీళ్లలో ములిగిపోతూ
కూలిపోయా డయ్యా నా బిచ్చగాడు!
యౌవనోద్రిక్త
సంభోగాసక్త
ఆత్మానురక్త
అత్యంతాసక్తి
కోరుచూ నతడు బిచ్చమెత్తగసాగె.
ఆమెయే రాజ్ఞియై
యా ప్రమేయమె లేని
రాజు నగరిలోన
విరహాల రంపాల
రగులుచూ మగ్గుచూ
బుగ్గియైపోవగా
రాజుమీసా లంత నులిపివేశాడు.
-యౌవనోద్రిక్త
సంభోగాసక్త
ఆత్మానురక్త
అత్యంతాసక్తి
కోరుచూ నతడు బిచ్చ మెత్తగసాగె!

కళలు కరగిపోవ
మనసులు మరగిపోవ
దివ్యవాక్సుధావాహినుల్
కరుణలో ప్రవహిల్లచేసెడు బిచ్చగాడు.
శాస్త్రశాలల యందు విశ్వ
విద్యాలయములందు
యెండమావుల నీటియందు
కవితారసములేక యది కోరి కలహాల
పెంచేరు.
తలుపులన్నియు మూసి సంతృప్తి
నొందేరు.
—కళలు కరిగిపోవ
మనసులు మరిగిపోవ
దివ్యవాక్సుధావాహినుల్
కరుణలో ప్రవహిల్లచేసేడు బిచ్చగాడు!
కన్నీళ్లు శోకింప
హృదయాలు ఘోషింప
ప్రాణాలు శోషింప
శాంతియుద్ధములోను
చచ్చిపోయాడు,
ఆ పిచ్చివాడు నా బిచ్చగాడు;
కుర్చీలలో కూలి, కూనిరాగాలతో
కునికిపాటులు పడే కులుకుదేవుళ్లంత
తమ మెడలు నిండంగ తగిలించు
కొన్నారు విరజాజిదండలు
గొప్పవాళ్ల మంచు, విర్రవీగుచునూ.
—కన్నీళ్లు శోకింప
హృదయాలు ఘోషింప
ప్రాణాలు శోషింప
శాంతియుద్ధములోను
చచ్చిపోయాడు,
ఆ పిచ్చివాడు నాబిచ్చగాడు!

# పసిఫిక్ వ్యవహార మహాసభ



= శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

ప్రపంచసమస్యలను పరిష్కరించుటకు అంతర్జాతీయ మహాసభలను జరుపుట ప్రస్తుత యుగ లక్షణ మన చెప్పవచ్చును. అట్టి సభలలో ఒకటి—అనగా పసిఫిక్ వ్యవహారముల మహాసభ—రెండుమాసము లక్రిందట అమెరికాదేశమందు జరిగెను. యునైటెడ్‌స్టేట్సు, కనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు, ఇంగ్లండు, ఫ్రాన్సు, చైనా, ఇండియా మొదలైన పండ్రెండు దేశముల ప్రతినిధులు అందులో పాల్గొనిరి. మన దేశము నుండి శ్రీమతి విజయలక్ష్మీపండిట్, కుంజ్రూ, శివరావు, లోకనాథం, సిద్దిక్‌గార్లు వెళ్లిరి. సభ పదిరోజులు జరిగెను. పసిఫిక్ ప్రాంత దేశములలో శాంతిని స్థాపించుటకును, అచ్చటి ప్రజల యోగక్షేమములను అభివృద్ధి చేయుటకును అవసరమైన విషయములను, విధానములను సభవారు చర్చించి, కొన్ని తీర్మానములను చేసిరి. ఈచర్చల యొక్క స్వభావమును తెలుసుకొనుటకు పూర్వము వాటికి సంబంధించిన కొన్ని సామాన్యవిషయములను అవగాహన చేసుకొనుట అత్యావశ్యము.

పసిఫిక్ మహాసముద్రము సముద్రములన్నిటిలో పెద్దది యగుటయేగాక భూగోళముయొక్క విస్తీర్ణములో సగభాగమును ఆవరించియున్నది. ఇది ఆసియా, అమెరికా ఖండముల మధ్య నున్నది. దీనికి తూర్పుతీరమునందు అమెరికాఖండములో దీనిని ఆనుకొని కనడా, యునైటెడ్ స్టేట్సు, మెక్సికో, మధ్య అమెరికా రాజ్యములు, దక్షిణ అమెరికా రాజ్యములు నాలుగు ఉన్నవి. వీటి విస్తీర్ణము సుమారు ౧౧౦ లక్షల చదరపుమైళ్లు; వీటిలోని జనసంఖ్య ౧౭ కోట్లు. ఈ సముద్రమునకు పశ్చిమతీరమందు ఆసియా ఖండములోని సోవియట్ రాజ్యము, కొరియా, చైనా, ఫ్రెంచి ఇండోచైనా దేశములున్నవి. వీటి విస్తీర్ణము సుమారు ౧౨౪ లక్షల చదరపుమైళ్లు; జనసంఖ్య ౬౩ కోట్లు. ఇవిగాక ఈమహాసముద్రములో జపాన్, ఫార్మోసా, ఫిలిప్పైన్‌సు, సుమత్రా, జావా, బార్నియోలతో కూడిన ప్రాచ్యఇండియా ద్వీపసమూహము, న్యూగినీ, ఆస్ట్రేలియా, న్యూజీలెండు మొదలైన గొప్పద్వీపములు, చిన్నచిన్న ద్వీపములు అనేకములు ఉన్నవి. వీటి విస్తీర్ణము సుమారు ౫౦ లక్షల చదరపుమైళ్లు; జనసంఖ్య ౨౦ కోట్లు. మొత్తం మీద ౧౦౦ కోట్ల జనం పసిఫిక్ ప్రాంత దేశములలో కాపురము చేయుచున్నారని తేలుచున్నది. భూగోళమందంతా ౨౦౦ కోట్ల జనం ఉన్నారు. పసిఫిక్ వ్యవహారాలకు గల ప్రాధాన్యం దీనినిబట్టి స్పష్టం అవుతున్నది.

ప్రపంచంలోని దేశాలను స్వాతంత్ర్య దేశాలని, పరాధీన దేశాలని రెండురకములుగ విభజింపవచ్చును. స్వాతంత్ర్య దేశాలను వాటి అధికార ప్రాబల్యమునుబట్టి అగ్రస్థానములోనివి, మధ్యమస్థానములోనివి, అంత్యస్థానములోనివి అని మూడుతరగతులుగ విభజించుట కవకాశ మున్నది. ఈ విభజనసూత్రములను అనుసరించి పసిఫిక్ ప్రాంత దేశములను పరిశీలించినయెడల ఆసియాఖండమందుండు కొరియా, ఫార్మోసా, ఫిలిప్పయిన్సు, ఫ్రెంచిఇండోచైనా, ప్రాచ్యద్వీపసముదాయములోనగునవి పరాధీన దేశముల క్రింద నమోదుచేయతగినవి. తక్కిన వన్నీ స్వతంత్ర దేశములు. స్వతంత్ర దేశములలో అగ్రస్థానమందు చేర్చతగ్గవి యునైటెడ్ స్టేట్సు, రషియా, జపాను; కనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు, చైనా, అమెరికాఖండములోని మెక్సికో చిలీ దేశములు మధ్యమస్థానములోనివి; తక్కినవి అంత్యస్థానములోనివి.

పసిఫిక్ మహాసభలో చర్చింపబడ్డ విషయముల ప్రాధాన్యమునేగాక ప్రస్తుత కాలపు ప్రపంచసమస్య లన్నిటియొక్క ప్రాధాన్యమును గుర్తెరుగుటకు పైన సూచింపబడ్డ విభజన చాలా ముఖ్యమైనది. స్వాతంత్ర్య దేశములలో తరతమభేదము లుండుటచేతను, కొన్ని దేశములు పరాధీనములై ఉండుట చేతను మన మీకాలమున ఎదుర్కొనవలసిన రాజకీయ ఆర్థికసాంఘికసమస్యలు బహు క్లిష్టతరము లగుచున్నవి.

ఇప్పటి సమస్య లన్నిటిలో యుద్ధసమస్య ముఖ్యతమ మైనదని చెప్పవచ్చును. యుద్ధసమస్య అనగా ప్రస్తుతము జరుగుచుండు యుద్ధమునకు సంబంధించిన సమస్య కాదు. సామాన్యముగ మానవసంఘమందు యుద్ధవిధానము ఉండవలెనా, ఉండకూడదా అనేదే యుద్ధసమస్య. యుద్ధము అంతరించి శాశ్వతమైన శాంతి ప్రపంచమందునెలకొనుట సుసాధ్యమా, కాదా? ఈలాటి సమస్య ఇదివర కెన్నడూ ఉండినది లేదు. ఎవరో కొందరు ప్రముఖులు దానినిగురించి చర్చించినను వారి చర్చలను సామాన్యజనులు, ప్రభుత్వాధికారులు విశేషముగ గౌరవించి యుండలేదు. ప్రస్తుతము ఇదంతయు మారినది. యుద్ధము సంభవించినపుడు దానిలో జయము సంపాదించుటకు ప్రయత్నించుట కంటె యుద్ధములు రాకుండుటకు కావలసిన ప్రయత్నములు చేయుట అత్యావశ్య మను అభిప్రాయము అనేకులలో వ్యాపించినది. పసిఫిక్ ప్రాంతములలో శాంతిని స్థాపించుటకు కావలసిన పరిస్థితు లెట్టివి అను విషయమును మహాసభలో చర్చించుటయందు ఆశ్చర్యమేమియు లేదు.

కారణము సులభగ్రాహ్యము. పూర్వకాలపు యుద్ధములకును, ప్రస్తుత కాలపు యుద్ధములకును గల భేదములే ఈ కారణము. పూర్వకాలపు యుద్ధము లన్నీ స్థానికములుగ ఉండెను. ప్రస్తుతకాలమున ఏయుద్ధముకూడ స్థానికముగ నుండుటకు వీలులేదు. ప్రతి యుద్ధమూ, ఎచ్చట ప్రారంభమైనను, కడు స్వల్పకాలములో ప్రపంచమం దంతటను వ్యాపించుచున్నది. ౧౯౧౪-౧౮ లో జరిగిన యుద్ధము అట్టిది. సర్వియా అను చిన్న రాజ్యమందు ప్రారంభమైన ఆ యుద్ధము కొద్దిరోజులలో ఐరోపాఖండమునందే కాక

ఇతరఖండములందుకూడ వ్యాప్తిగాంచెను. ప్రస్తుతము జరుగుచున్న యుద్ధముకూడ అట్టిదే. పోలెండులో ప్రారంభమై ప్రపంచమునంతను ఆవరించినది. ప్రతిదేశముకూడ ఇష్టమున్నను లేకున్నను ఏదోఒక పక్షమును అవలంబించవలసిన పరిస్థితు లేర్పడ్డవి. కొన్ని దేశములు తటస్థముగ నున్నమాట వాస్తవమేకాని ఆ తాటస్థ్యమును నిలబెట్టుకొనుట ఎంతో కష్టసాధ్య మగుచున్నది. ఆకాశవిమానములు మొదలైన ప్రయాణసౌకర్యములు, రవాణాసౌకర్యములు వృద్ధికాను కాను ప్రతియుద్ధముకూడ విశ్వవ్యాప్త మగుచుండును. యుద్ధస్వరూపమందు కలిగిన ఈ మార్పు దాని కొక నమస్యారూపమును కలిగించినది ఇదిగాక పూర్వపు యుద్ధములలో యుద్ధరంగములకు వెళ్లి ఆయుధపాణులై యుద్ధము చేయువారుమాత్రమే ప్రాణములు కోల్పోవుటయు, అంగవికలులగుటయు సంభవించుచుండెను. ఇప్పు డట్లు కాదు. యుద్ధరంగ మని ప్రత్యేకప్రదేశ మొక్కటిలేదు. దేశమంతయు యుద్ధరంగమే. పురుషులు, స్త్రీలు, వృద్ధులు, యువకులు, పిల్లలు—అందరూ యుద్ధమునకు గురి అగుచున్నారు. విమానములనుండి బాంబులు పేలినపుడు దాని ఫలితమును అందరూ అనుభవించవలసిఉన్నది. ఆహారము, బట్టలు, ఇండ్లు మొదలగు సౌకర్యముల విషయమున సామాన్య ప్రజలు యోధులకంటె ఎక్కువగ కష్టములపా లగుచున్నారు. ఇదిగాక యుద్ధముల మూలమున కలుగుచుండు నష్టము అపారమగుచున్నది. ప్రాణనష్ట మొక్కటి మాత్రమే కాదు. వేలకొద్ది సంవత్సరముల నుండి నిరంతరము కృషిచేసి సంపాదించిన విజ్ఞానము, నిర్మించిన నాగరికత — ఇవన్నీ కూడ నాశనమగు పరిస్థితు లేర్పడ్డవి. విద్యాసంస్థలు, దేవగృహములు, చిత్రాగారాలు అన్నియు యుద్ధాగ్నికి ఆహుతిఅగుచున్నవి. ధర్మయుద్ధం, అధర్మయుద్ధం అన్న భేదము అదృశ్యమైనది. ఇన్ని కారణాలచేత యుద్ధములను మాన్పివేయుటకు ఏమైన ఉపాయములున్నవా అను విషయము అందరునూ చర్చించతగ్గ సామాన్యవిషయముగ ఏర్పడ్డది. యుద్ధవిధానమును తొలగించి శాంతిసంస్థాపనము చేయుటయే ప్రస్తుత కాలపు మానవకోటి ఎదుర్కొనవలసిన సమస్యలన్నిటిలో అగ్రస్థానము వహించియున్నది. ఈ సమస్యను పరిష్కరించగలిగిననాడు ప్రపంచ కల్యాణము ప్రారంభమైన దని చెప్పవచ్చును.

ఇట్టిసమస్య పసిఫిక్‌మహాసభయందు ప్రాధాన్యము వహించుటకు మరొక కారణముకూడ ఉన్నది. ప్రపంచచరిత్రను పరిశీలించినయెడల ఒక్కొకయుగమందు ఒక్కసముద్రము ప్రపంచమునకంతకు కేంద్రముగ నుండెనని స్పష్టమగును. ప్రాచీనకాలమందు హిందూమహాసముద్ర మిట్టి కేంద్రముగ నుండెను. భరతఖండపు నాగరికత, విజ్ఞానము ఉచ్చస్థితికి ఆకాలమునందే రాగలిగెను. తర్వాత మధ్యధరాసముద్రము కేంద్రమయ్యెను. దాని ఫలితముగ గ్రీసు ఇటలీ (రోం) దేశములలో నాగరికత వృద్ధిగాంచెను. అటుపిమ్మట ౧౫-వ శతాబ్దమునుండి అట్లాంటిక్‌మహాసముద్రము కేంద్రమయ్యెను. దాని తీరమందుండు స్పెయిన్, పోర్చుగల్, ఫ్రాన్సు, ఇంగ్లండు, హాలెండు దేశములు

ఉచ్ఛస్థితికి వచ్చి తమ అధికారమును, నాగరికతను ప్రపంచమందంతటను వ్యాపింప చేయగలిగెను. ఇప్పుడు అట్లాంటిక్ ప్రాభవము తగ్గినది; పసిఫిక్ మహాసముద్రపు ప్రాభవము హెచ్చినది. జపాన్, చైనా, రషియా, యునైటెడ్ స్టేట్సు, ఆస్ట్రేలియా మొదలైన దేశములు ముందంజవేయుచున్నవి. ముఖ్యముగ రషియాయొక్కయు, యునైటెడ్ స్టేట్సుయొక్కయు నాయకత్వమున కొంత కాలమువరకు ప్రపంచవ్యవహారము లన్నియు పరిష్కరింపబడు సూచనలు కనబడుచున్నవి. ప్రస్తుత ప్రపంచమునకు పసిఫిక్ మహాసముద్రము కేంద్రముగ నున్నదని చెప్పుటలో గల సత్య మిదియే. ఈసముద్రమందు శాంతి ఏర్పడినయెడల ప్రపంచమందంతటను శాంతి ఏర్పడగలదు.

౨

శాంతి రెండువిధములు—తాత్కాలిక శాంతి, శాశ్వతశాంతి పసిఫిక్ మహాసభయందు ఈ రెండురకముల శాంతినిగురించి చర్చలు జరిగినవి. ంతిని స్థాపించుటకు కావలసిన ఏర్పాటుల విషయమై ప్రతినిధులందరును ఏకాభిప్రాయమునకు రాగలిగిరి. ఈ అభిప్రాయవిషయమై సభలో జరిగిన చర్చలనుబట్టి ఈక్రింది అంశములు పేర్కొనదగియున్నవి.

(అ) పసిఫిక్ రంగములో ప్రస్తుతముజరుగుచున్న యుద్ధమునకు జపానువారి సామ్రాజ్య కాంక్ష ప్రధానకారణము. అచ్చట ఇటీవలి కాలమందు శాంతిని భంగపరచినవారు జపానువారే. చైనాలో అంతర్భాగమైన మంచూరియాను దౌర్జన్యముగ ఆక్రమించుకొనుటయేగాక, చైనాదేశమునంతను జయించు ఉద్దేశముతో ఏడుసంవత్సరముల నాడు వారు చైనాయుద్ధమును ప్రారంభించిరి. అటుతర్వాత అట్టికాంక్షతోడనే వారు ౧౯౪౧ లో యునైటెడ్ స్టేట్సుతోడను, ఇంగ్లండు హాలెండులతోడను యుద్ధమునకు దిగి బంగాళాఖాతమునకు తూర్పున నుండు దేశములను, ద్వీపములను స్వాధీనపరచుకొనిరి. గనుక శాంతిని భంగపరచుచున్న జపానువారిని ఓడించి, కఠినములగు సంధి షరత్తులను వారిపై విధించినగాని యుద్ధానంతరము కొంతకాలమువరకైనా శాంతి ఉండజాలదు.

(ఆ) ఆ షరతులు ఎట్టివిగ నుండవలెను? జపానువారి వశమందున్న పరదేశములనన్నిటిని వారి పరిపాలననుండి వేరుపరచి ఒక జపానుదేశముమాత్రమే వారి వశమం దుంచవలెను. మంచూరియా ఫార్మోసాలను చైనాకు ఇయ్యవలెను. కొరియా స్వతంత్రరాజ్య గ ఏర్పడవలెను. ఇదిగాక వారి నౌకాబలము, విమానబలము, యుద్ధపరికరాలు సంపూర్ణంగా మిత్రమండలివశం కావలెను. జపానువారు నిరాయుధులైనగాని తాత్కాలికశాంతి కలుగజాలదు. ఇప్పుడు జరుగుచుండు యుద్ధంమూలాన మిత్రమండలివారికిని, పసిఫిక్ రంగములోని ఇతరదేశములవారికిని కలిగిన నష్టమునకు పరిహారముగ జపానువారివద్దనుండి ద్రవ్యమును వసూలు చేయవలెను. ఇది ధనరూపమునగాక వస్తురూపముగ నుండవలెను. ఈపరిహారద్రవ్యము యుద్ధముమూలమున నష్టము పొందిన ప్రజ

లందరును పంచుకొనవలెను. యుద్ధము ముగిసినతర్వాత కొంతకాలమువరకు మిత్రసైన్యములు జపాను దేశములో ఉండవలెను. తాము ఓడిపోయినట్లు ప్రజలు గ్రహించుటకిది ఒక చిహ్నముగ నుండును. ఇదివరకు జపానులో అమలుపరచబడుచున్న "నిర్బంధ సైనికపద్ధతి" రద్దుకావలెను.

(ఇ) మరికొన్ని షరత్తులనుగురించి ప్రతినిధులలో అభిప్రాయభేద ముండెను. ప్రస్తుతము సామ్రాజ్యమును పాలించుచున్న చక్రవర్తి సింహాసనచ్యుతుడు కావలెనని కొందరును, అది అవసరములేదని మరికొందరును అభిప్రాయపడిరి. చక్రవర్తియొక్క నిరంకుశప్రభుత్వము తొలగి, ప్రజాప్రతినిధుల పరిపాలన స్థాపింపబడినయెడల చక్కగ నుండునని అనేకులు అభిప్రాయపడిరి.

(ఈ) ఈ చర్చలలో స్పష్టమైన మరొక విషయము గమనింపదగియున్నది. యిరోపా ఖండములోని శాంతికి జర్మనీదేశము భంగము కావించెనని అందరూ అంగీకరిస్తున్నారు గదా ? అట్టి జర్మనీని యుద్ధానంతరము శిక్షించుటకు మిత్రమండలివారు అనేక ప్రణాళికలను తయారు చేయుచున్నారు. జపానువారి దౌర్జన్యము జర్మనీవారి దౌర్జన్యముకంటె అధికమైనది కాదు. గనుక జపాను వారిపై విధింప బడు శిక్ష జర్మనీవారిపై విధింపబడు శిక్షకంటె ఎక్కువగ ఉండకూడదు. ఒకే నేరము చేసినవారికి ఒకే దండనము ఉండవలెను. ఈసూత్రమును ఇండియా మొదలైన ప్రాచ్యదేశముల ప్రతినిధులు ఎక్కువగ బలపరచిరి. దానికి కారణము జర్మనీవారు శ్వేతవర్ణులు; జపానువారి రంగు భిన్నమైనది. రంగును బట్టి వ్యక్తులను, జాతులను నిరాదరించుట యిరోపా ఖండవాసుల కొక లక్షణము. జపానువారి విషయములో అట్టి పక్షపాతమును చూపకూడదని ప్రాచ్యప్రతినిధుల వాదము.

కాని మన మందరము కోరునది తాత్కాలిక శాంతి కాదు. ఇది అవసరమే. కాని శాశ్వత శాంతి ఇంతకంటె అవసరము. దీనిని స్థాపించుట ఎట్లు? ఈ విషయమై భిన్నాభిప్రాయము లనేకములు బయలుదేరినవి.

జపానువారి మూలంగా ఎన్నటికి గాని శాంతిభంగం కాకుండ ఉండుటకు మార్గము లేమైన ఉన్నవా ? గత యుద్ధము ముగిసిన తర్వాత బహు కఠినములైన షరత్తులను జర్మనీవారిపై విధించడం, వారిని నిరాయుధులుగ చేయడం జరిగినది. కాని ౧౫ సంవత్సరములలో హిట్లరు నియంతయై జర్మనీయొక్క బలముల నన్నిటిని ఎన్నిరెట్లో వృద్ధిచేసి కడు భీకరమైన యుద్ధమును ప్రారంభింపగలిగెను. అదేవిధముగ జపానువారు యుద్ధసన్నాహము చేయలేరా? అట్లు వారు చేయకుండుటకై ఏవైన ఉపాయము లున్నవా ? సుమారు పదికోట్ల జనంకలిగినజపాను దేశం పైకి రాకుండచేయుట సాధ్యమగు పనియా ? ఇది కొన్ని సందర్భములలో సాధ్యము కావచ్చునని కొందరు సూచించిరి. ఆకాశవిమానములను జపానువారు ఎన్నటికీ తయారు చేయకుండునట్లు నిషేధించుట;

యుద్ధపరికరముల ఉత్పత్తికి అత్యవసరములైన పదార్థములు—అల్యూమినం వంటివి జపాను వారికి లభింపచేయకుండుట ; జపానుదేశములో ప్రస్తుతము ప్రముఖవర్గముగనుండు క్షాత్రవర్గము(Militarists) ను వినాశము గావించి వారిస్థానమున పారిశ్రామిక వర్గమునకు (Industrialists) ప్రాధాన్యమును కల్పించుట-మొదలగు సూచనలను కొందరు కావించిరి. కాని వీటిని అమలులో ఉంచుట కష్టసాధ్యమని అనేకులు అభిప్రాయపడిరి. జపానుదేశమును పూర్తిగ జయించి మిత్రమండలివారు వశపరచుకొనినగాని ఇదంతయు సాధ్యముకాదను నమ్మకము అందరికిని కలిగినట్లు కనుపించుచున్నది. జపానును స్వాధీనము చేసికొని పరతంత్రరాష్ట్రముగ పరిపాలించుట కానిపని. ఇట్లయినయెడల
అనునదికూడ ఆచరణయోగ్యము కాని ఆదర్శమని వదలుకొనవలసినదేనా ?

ఈసందర్భమున ఫ్రెంచిప్రతినిధి చెప్పిన మాటలలో కొంతసత్య మున్నది. జపానువా రొక్కరే నేరస్థులనిన్ని, దండనార్హులనిన్ని, శాంతిభంగమున కంతకూ వారి సామ్రాజ్యకాంక్ష ఒక్కటే కారణమనిన్ని, తక్కినరాజ్యాలవా రందరూ సాయుధులై యుద్ధసన్నాహములు చేయుచు ఒక జపానువారు మాత్రమే యుద్ధసన్నాహములు చేయకూడదని నిషేధించుట క్రమమార్గము కాదనిన్ని, ప్రపంచములో గల దేశములనన్నిటిని హద్దులో పెట్టి నియమించగల సంస్థ ఒకటి ఏర్పడినప్పుడే ప్రపంచశాంతి స్థాపించుటకు వీలగుననిన్ని, ఏదో ఒక్క దేశమునకు మాత్రము బుద్ధిచెప్పుటకు ప్రయత్నించుట లాభము లేదనిన్ని అతడు వ్యక్తపరచెను. గనుక ప్రపంచమందంతట శాంతి కుదిరినప్పుడే పసిఫిక్ దేశములలో శాంతి ఏర్పడుననిన్ని, అట్టి శాంతికై ప్రయత్నము చేయవలెననిన్ని ఆ చర్చలవలన తేలినది.

౨

పసిఫిక్ మహాసభలో మరికొన్ని విషయములను గురించి చర్చలు జరిగెను. అందులో ఒకటి ఫ్రాన్సు, హాలెండు, ఇంగ్లండు మొదలైన ఐరోపియన్ జాతులవారి అధీనమందుండు వలసరాష్ట్రముల (Colonies) భవిష్యత్తు. ఫ్రాన్సుయొక్క అధీనమందు ఫ్రెంచి ఇండోచైనా దేశ మున్నది. దీనిని వారు ౧౮౬౭ తర్వాత వశపరచుకొనిరి. హాలెండు అధీనమున సుమత్రా, జావా, బోర్నియో, సెలబీస్ మొదలైన ద్వీపము లున్నవి. ౧౭-వ శతాబ్దమునుండీ వారు ఈ రాష్ట్రములకు పరిపాలకులుగ నున్నారు. ఈద్వీపములలో కొన్ని భాగములు ఇంగ్లీషువారి వశమం దున్నవి. ఫిలిప్పైన్ ద్వీపములు యునైటెడ్ స్టేట్సువారి వశమందున్నవి.

హాలెండు, ఫ్రాన్సు మొదలగు దేశముల వశమున చాలకాలమునుండి ఈ రాష్ట్రము లున్నను వీటిలోని ప్రజల సౌఖ్యమునకై పరిపాలకులు విస్తారము పాటుపడినట్లు కనుపించుట లేదు. పరిపాలకదేశముల సౌఖ్యమునకు ఈ ప్రజలను ఒక సాధనముగ జేసికొనుటయే వారి ఉద్దేశము. విద్యయందును, ఆరోగ్యమందును, ఆర్థికసౌకర్యములందును ఈ రాష్ట్రములలోనివారు ఎంతో వెనుకబడి

ఉన్నారు. వీరి సంఖ్య సుమారు ౧౦ కోట్లు. వీరిని పాలించుచుండు ఫ్రాన్సు, హాలెండు దేశములలోని ప్రజల సంఖ్య చాల తక్కువ. ౮౦ లక్షల హాలెండువారు ఏడుకోట్ల వలస రాష్ట్రి ప్రజలను పాలించుచున్నారు. ఈ వలసరాష్ట్రిములు ఈవిధముగ పరాధీనములై ఉండవలసినదేనా, లేక స్వతంత్రములు కావలసినదా అన్న విషయము పసిఫిక్ మహాసభలో చర్చకు వచ్చెను. ఈ చర్చలలో తేలిన ముఖ్య అంశములు కొన్ని కలవు.

(అ) జావా, బొర్నియో మొదలైన వలస రాష్ట్రిములు కొంతకాలము వరకు పరాధీనమందు ఉండవలసినదే. పూర్ణ స్వరాజ్యమును స్థాపించి నిలబెట్టుకొనుటకు కావలసిన పరిస్థితులు ఆ ప్రదేశములలో ఇంకను ఏర్పడలేదు. హాలెండు, ఫ్రాన్సు మొదలైన దేశముల పరిపాలనము అంతరించినయెడల ఈ వలసరాష్ట్రిములు మరొక దేశమునకు వశమగుట తప్పదు. ఆ ప్రదేశములలోని ప్రజలు అనేక జాతులకు, తెగలకు సంబంధించి ఉన్నారు. వారిలో ఐకమత్యము లేదు. విదేశీయుల పాలనము అదృశ్యమైనయెడల వారిలో వారికి అంతఃకలహములు సంభవించును. గనుక ప్రస్తుతపు పరిస్థితులలో పరాధీనత తప్పనిదని అనుకొనవలెను.

(ఆ) అయితే, పరాధీనులై, ఎల్లప్పుడు వారు వారి పరిపాలకు లగు డచ్చివారికి, ఫ్రెంచివారికి చాకిరీ చేయుచు సుఖజీవితమన నేమియో యెరుగక యుండవలసినదేనా ? ఎప్పటికైనను వారికి విమోచనముండునా ? అన్న ప్రశ్నలకు ఒకవిధమైన సమాధానము సూచింపబడ్డది.

(ఇ) ఏమిటి ఈ సమాధానము ? వలస రాష్ట్రిముల పరిపాలన విషయమై ఒక న్యాయమైన ప్రణాళిక ఏర్పడవలెను. దానికి "పసిఫిక్ ప్రణాళిక" అని పేరు పెట్టవచ్చును. దాని కంతకు "వివిధజాతుల సమత్వము" ఆధారము. ఏజాతిగాని వేరొక జాతికంటే ఉత్తమమైనదనిన్ని, ఆకారణముచేత అది పాలకజాతిగ నుండి రాజ్యాధికారమును వహించుట కర్హమైన దనిన్ని అనుకొనుట అధర్మము. జాతులన్నియు—తెల్లజాతులవలె రంగుజాతులుకూడ— సౌఖ్య మనుభవించుటకు సమానావకాశములు ఏర్పడవలెను. ఈ సూత్రము ననుసరించి వలసరాష్ట్రిముల పరిపాలనము ఇకమీదట జరగవలసి ఉన్నది.

(ఈ) కాని ఈ సూత్రమును ఆచరణలో పెట్టుట ఎట్లు? వలసరాష్ట్ర పరిపాలనమును చక్కగ చేయుచున్నారా, లేదా అని విమర్శించుటకు ఒక అంతర్జాతీయ సభ ఏర్పడవలెను. అట్టి సభవారి సమ్మతికి లోబడి హాలెండు, ఫ్రాన్సు మొదలగువారు వారి రాష్ట్రిములను పాలించవలెను.

ఇట్టి ప్రణాళికవలన విస్తారలాభ ముండునా అన్న సందేహము ప్రతినిధులలో అనేకులకు కలిగెను. ఈ సూత్రము కొత్తది కాదు. ౧౯౧౯ లో ఏర్పరచబడిన నానాజాతీయ సమితియొక్క విధులలో కొన్ని వలసరాష్ట్రి పరిపాలనముల విమర్శ ఒక్కటిగ నిర్ణయింపబడెను. కాని, ఆ సమితి ఈ విధిని చక్కగ నిర్వహించలేకపోయెను.

పసిఫిక్ ప్రణాళికలో సూచించబడ్డ అంతర్జాతీయ మహాసభ ఇంతకంటె ఎక్కువ పని చేయగలదా?

ఈ అనుమానమునకు అవకాశము లేక పోలేదు. కాని వలసరాష్ట్రముల పరిపాలనమును ప్రజల సౌఖ్యమునకై జరిపించునట్లు చేయగల సాధనము మరొకటి ఉన్నదా? ఆ రాష్ట్రీయములలోని ప్రజలు స్వాతంత్ర్యార్హులైనయెడల ఎట్టి కష్టమును ఉండదు. కాని వారికి ఇప్పుడు అట్టి అర్హత లేదు. వారు ఇతరుల అధీనమందుండవలసినవారే. ఈ పరాధీనము నష్టకరము కాకుండుటకు అంతర్జాతీయసభ ఒక సాధనము. అట్టి సభలో రాష్ట్రీప్రజల ప్రతినిధు లుండుట అత్యావశ్యము. వారి సలహాలను, సూచనలను అనుసరించి పరిపాలకులు వారి పరిపాలనను నడుపవలసి ఉన్నది.

ఈ సందర్భములో మనము గమనించవలసిన సామాన్యవిషయ మొకటి ఉన్నది. ప్రభువుల పరిపాలన చక్కగ జరుగుటకు మన మెన్నిసాధనములను కల్పించినను నిజమైన ఫలితము కలుగుటకు వారి హృదయమునందు గొప్ప పరివర్తనము కలుగవలెను. ప్రజలను సుఖింపచేయుటయే తమ కర్తవ్యమనియు, అందుకై స్వార్థమునుకూడ అవసరమైనప్పుడు త్యజించవలెననియు వారనుకొనినయెడల కల్పితసాధనములు తక్కినవి ఉన్ననూ, లేకున్ననూ పరిపాలనము ప్రశంసనీయ మగును. వలసరాష్ట్రములనూ, పరాధీన దేశములనూ పాలించువారిలో అట్టి హృదయపరివర్తనము కలుగవలె నని మనము ఆశించవలెను.

## ౪

స్వసామ్రాజ్యములను విస్తరించుకొని, ఇతరజాతులవారిని తమ అధికారముక్రింద ఉంచుకొనుటకు ప్రయత్నించినవారు జపానువారుమాత్రమే కాదు; అట్టి ప్రయత్నములను చేయుచుండువారిలో వారు మొదటివారుకూడా కాదు. ఈ విధానము వారు ఇటీవలికాలములో ఇంగ్లండు, రషియా, హాలెండు, ఫ్రాన్సు మొదలగు ఐరోపియన్ దేశములవారినుండి నేర్చుకొన్న పాఠమే. ఇట్టి సందర్భములో సామ్రాజ్యతత్త్వమును ఐరోపియన్ దేశములవారు పూర్తిగ వదలినగాని ప్రపంచశాంతి కలుగజాలదు. కొందరికి సామ్రాజ్యము లుండుటచేతనే, తక్కిన బలవంతులుకూడ సామ్రాజ్యములను సంపాదింప ప్రయత్నించుట జరుగుతున్నది. అందరును సామ్రాజ్యపరిత్యాగము చేసిననాడుగాని యుద్ధము లంతరించుటయు, శాశ్వత శాంతి కలుగుటయు సంభవించదు.

భరతఖండమునుండి మహాసభకు వెళ్లిన ప్రతినిధులందరును ఈ విషయమును నొక్కి చెప్పిరి. ముఖ్యముగా ఇండియాకు స్వాతంత్ర్యము లభించినగాని ప్రపంచశాంతి రాజాలదని ఋజువుచేసిరి. ఆ మహాసభలోని చర్చలకిదొక ప్రధానలక్షణము.

# విశ్వం పెళ్లి*

[ నాటకము ]

## = శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి =

### ౧-వ అంకము

[శ్రీకంఠచయనులుగారి ఇల్లు. లోపల బల్లదగ్గిర చయనులుగారు వ్రాసుకుంటూ వుంటారు. పయినించి తలుపు కొట్టిన చప్పుడు. మొదటిమాటు చయనులు లక్ష్యపెట్టడు. మళ్లీ తలుపుకొట్టిన చప్పుడు.]

చయ—ఎవరది ?

(పైనించి) అరవిందం—నేను.

చయ—నేనంటే ?

అర—నేను ; అరవిందాన్ని.

చయ—నువ్వేనటోయ్. రా, లోపలికి రా. అదేమిటి? పరాయివాడిలాగ పైనించి తలుపు కొడతావేం? మనలో మనకి మర్యాదలేమిటి ?

(అరవిందం లోపలికొచ్చి నుంచుంటాడు)

కూచో నాయనా. (అరవిందం కూచుంటాడు. ఒక్క నిమిషం నిశ్శబ్దం)పాపం ; చాలా కష్టమొచ్చింది. గోవిందం పోవడం నాకూ పెద్దదెబ్బ. నా కుడిభుజం పడిపోయింది. కాని విచారించి ప్రయోజనం లేదు. "జాతస్య మరణం ధృవం." మన మందరమూ వెళ్లవలసినవారమే. ధైర్యంగా

అర—నిజమే. కాని నన్ను కన్న తండ్రిని మించి ప్రేమించి ఆదరించారు. ఆ దయామయుడి కరుణాకటాక్ష వీక్షణం నామీద ప్రసరించకపోతే ఏమయివుండునో?

చయ—అతనికి పుత్రసంతానం లేదుకాదూ; అందుచేత నీమీదే అంత మమకారమూ....

అర—కానే కాదండి, నాసహోదరినీ అంత ఆదరానురాగాలతోటే పోషించి పాలించారు. నా కృతజ్ఞత వాచా చెప్పుకుందామన్న కోరిక ఫలించకమునుపే ఆయన పరమపదించారు. ఇహ నా కృతజ్ఞత ఎవరికి చెప్పుకోను ? హతభాగ్యుడిని ; దురదృష్టవంతుడిని!!

చయ—అన్నీ మాటల్లో చెప్పాలిటోయ్ వెఱ్ఱివాడా? నీ నడవడివల్ల అతని కాసంగతి తెలీదూ? అరవిందం చాలా యోగ్యుడని ఆయన ఒకమాటు నాతో అననే అన్నాడు.

అర—అది వారి హృదయవైశాల్యం, చయనులుగారు చాలా ఉత్తము లని గోవిందంగారు నాతో అనేక పర్యాయములు అన్నారు.

చయ—ఏదో, అతనికి నామీదున్న అభిమానంగాని ....నువ్వు అతని కొడుకువు కానందుకు ఒకందుకు అతను సంతోషిస్తూనేవుండేవాడునుమా; కౌముదిని నీ కివ్వాలనీ, నిన్ను అల్లుణ్ణి చేసుకోవాలనీ అతని కుండేది.

అర—నా కంత అదృష్టమా? అంత భాగ్యమా? కౌముదీసాహచర్యమే నాకు లభించగలిగితే ఇహ నే కోరదగిన దేముంది? కాని కౌముదియిచ్ఛ ఏరీతిగా వుందో!

చయ—నీకంటె తగిన వరుడు దొరుకుతాడుటోయ్ ఆ అమ్మాయికి; ఆసంగతి ఆ అమ్మాయికిమాత్రం తెలియదూ? ఎంత చురుకైన పిల్ల, తల్లితండ్రులంటే ఎంత వినయవిధేయతలు? ఎంత భయభక్తులు? తన యిష్టప్రకారం స్వతంత్రించి ఒక్క పని చేసేదా? ఎప్పుడూ తల్లో తండ్రో చెప్పా రన్న పనే చేసేదిగాని....'నువ్వు స్వతంత్రంగా ఆలోచించడం నేర్చుకోవాలమ్మా' అని నేను ఎన్నోమాట్లు చెబుతూవొచ్చానుకూడాను. తండ్రికోరిక నెరవేర్చడానికి ఏపని అయినా చేస్తుందే? నిన్ను పెళ్లాడానికేం; పరమసంతోషంతో ఒప్పుకుంటుంది!

అర—అందుకు సందేహం లేదు. కాని ఆవిడ మనస్సు అన్యథా లగ్నమయిందేమో, నన్ను ప్రేమిస్తోందో

* బెర్నార్డుషా వ్రాసిన 'మాన్ అండ్ సూపర్‌మాన్' అన్ననాటకం దీనికి మాతృక.

లేదో. నన్ను ప్రేమించకపోయినా తండ్రికోరిక ననుసరించి నన్ను వివాహమాడమని నే నెలా ప్రార్థించగలను? నా అదృష్టదేవత నన్ను కరుణిస్తుందో లేదో!

చయ—మరీ కవిత్వం మాట్లాడకు, కౌముదికి నువ్వంటే యిష్టమే. ఇంకా ఏం కావాలి! కావ్యాల్లో నాయికా నాయకులు ప్రేమించుకున్నట్టు ఇక్కడ జరగాలంటే కుదురుతుందా?

అర—నాకు ఊహ తెలిసినప్పటినించీ, నాకు జ్ఞానోదయమయిన క్షణంనించీ నే కౌముదినే ప్రేమించాను, కౌముదీనామమే జపించాను, నా రక్తంలో ప్రతిఅణువు, శరీరంలో ప్రతినాడీ కౌముదికి స్వాగత మివ్వడానికి తహతహలాడుతున్నాయి. నే ధ్యానించే సౌందర్యదేవత, నే పూజించే సుగుణరాశి, నా కవిత్వానికి పట్టుకొమ్మ, నా కౌముది,నన్ను వరించకపోతే నేను ఆజన్మాంతం ఘోటక బ్రహ్మచారిగా వుండిపోతాను. నాయీమనస్సు, నాయీ దేహం అన్యాయత్తం కావించలేను.

చయ—నిన్ను మాచక్కగా పెళ్లాడుతుంది. నీ అంత యోగ్యుడు మరెవరూ లేరుకాని, నీలో ఒక్క దోషముందోయ్.

అర—ఒక్క దోషమేనాండి. శతసహస్రదోషాలున్నాయి. నాలో లేని దోషమే లేదు. కౌముదికి నేను తగనేతగను అసలు, అయినా, మీకూ సంతాపం కలిగించిన ఆ దోషమేదో తెలుసుకుంటే సంస్కరించుకోడానికి ప్రయత్నిస్తాను. చెప్పరూ ?

చయ—నువ్వు వొట్టి అమాయకుడివి! లోకానుభవం లేదు. ఎవరితో స్నేహం చెయ్యాలో, ఎవరితో చెయ్యకూడదో తెలియదు. నీ కీ విశ్వేశ్వరరావుతో ఎలా స్నేహమయిందోయ్! నిన్ను బట్టి వాడూ గోవిందంఇంటికి చనువుగా వొస్తున్నాడు. కాని నే నిప్పుడే చెబుతున్నా, వాణ్ణిమాత్రం నాగడప తొక్కనివ్వను.

అర—(నవ్వుతూ) విశ్వమా? ఏం చేశాడు?

చయ—వాడికి ముద్దుపేరుకూడానా? ఆపేరు తలుచుకుంటేనే పంచమహాపాతకాలూ చుట్టుకుంటాయి. ఈయింట్లో ఆపేరు ఉచ్చరించనేకూడదు. తెలిసిందా?

అర—మీ కెందు కింత కోపం తెప్పించాడు! మిమ్మల్నేమన్నా....

చయ—నన్నేమన్నా అనడానికి గుండా. చెరువా ? అంటే ఎరగడూ? నన్ననకపోతేమాత్రం! వాడూ, వాడి రాతలూను. వెధవరాతలు. అన్నీ కారుకూతలు. ఈ పుస్తకం చూడు. ఇంతకంటె అధమాతి అధమపుస్తకం, నికృష్ట పుస్తకం ఎవరూ రాసుండరు! మరి ఇలాటి పుస్తకాలు ఎందుకు అచ్చువెయ్యనిస్తారో తెలియదు. ఈ పుస్తకాన్ని వెంటనే నిషేధించెయ్యడమేకాక ఎక్కడ దొరికితే అక్కడ తగలెట్టెయ్యాలి!

అర—వ్రాతలో కటుత్వ ముందికాని మనిషి బహు మంచివాడు. వాడిరాతలు అంత శ్రద్ధగా చూడకూడదు. ఏదో పిచ్చిరాతలు వ్రాసుకుంటూ వుంటాడు. ధన ముందికనక అచ్చువేయిస్తాడు. చూసీచూడనట్టు వూరుకోవాలి !

చయ—నువ్వు మంచివాడివి కనక లోకమంతా మంచే అనుకుంటావు నువ్వు. అనుభవం లేకపోడంచేత నల్లని వన్నీ నీళ్లూ, తెల్లనివన్నీ పాలూ అని నీ అభిప్రాయం!

అర—ఏమి టాపుస్తకం ?

చయ—ఏమో! నే చదివానూ? ఇలాటి వెధవరాతలు చదువుతానా అసలు. శీ, పుణ్యం అంటూ లేవని ఏదో ఏడిశాడుట. పరమదౌర్భాగ్యుడు, వాడి స్నేహం మాత్రం నువ్వు వొదులుకోవాలి. లేకపోతే కౌముది నీకు దక్కదు,

(అంటూ వుంటే నౌకరుకుఱ్ఱవాడు లోపలి కొస్తాడు.)

నౌక—విశ్వేశ్వర్రావుగారుటండి! మీతో తొందరగా మాట్లాడాలి- రావొచ్చునా అని కనుక్కురమ్మన్నారండి!

చయ—విశ్వేశ్వర్రావా! వీల్లేదు. ఇంట్లోకి రావొద్దని చెప్పు.

నౌక—ఇంట్లోనే వున్నారండి. కౌముదమ్మగారూ, వారూ కలిసొచ్చారు లోపల మాట్లాడుతున్నారు.

అర—అదీ విశ్వం వరస.

నౌక—రమ్మని చెప్పనాండి ?

చయ—(ఉగ్రుడై) ఊ.

(నౌకరు వెళ్లిపోతాడు. అకస్మాత్తుగా తలుపు తెరుచుకుని విశ్వేశ్వర్రావు లోపలికొస్తాడు.)

విశ్వే—(చేతిలో వున్న కాగితం చూపిస్తూ. చయనులు మీదిమీదికి వెళతూ) ఇదేమిటి తెలుసునా ?

చయ—(గంభీరంగా) తెలియదు.

విశ్వే—గోవిందంగారి విల్లుకాగితం. గోవిందం వచ్చి పోతూ రాసిన విల్లు. కౌముదికి ఎవరిని గార్డియనుగా వేశా డో తెలుసా ?

చయ—నన్ను నియమించా రనుకుంటా !

విశ్వే—మిమ్మల్నే కాదు, నన్నుకూడాను. నన్ను కౌముదికి గార్డియనుగా వేశాడండీ :

చయ—నిన్నా : అసంభవం.

విశ్వే— అసంభవ మేమిటి ? నా ప్రాణాలు పోతూ వుంటే : ( వెళ్లి టేబిల్‌మీద కూచుని ) చయనులుగారూ, మిమ్మల్ని బతిమాలుకుంటాను. ఈ ఉపద్రవం ఎలాగైనా తప్పించాలి. కౌముదివిషయం నాకు తెలిసినంత మీకు తెలియదు. అది చెయ్యని సాహసకార్య ముండదు, అన్నీ తన గార్డియన్లు మీమీదికో, నామీదికో తోస్తుంది. తన ప్రతిచేష్టకి బాధ్యతంతా మన నెత్తిన రుద్దుతుంది. కాని మనం తల్లకిందులు తపస్సుచేసినా మన ఒడ్డికలో వుంచ లేము. దానికి మనం గార్డియన్లుగా వుంటే మనకి ప్రాణ సంకటం :

అర—(ఎంతో బాధతో) విశ్వం: కౌముదివిషయమై అంత చులకనగా మాట్లాడకురా !

విశ్వే—నీకు దానిమీద ప్రేమచేత కళ్లు కప్పిపోయా యిరా బాబూ. పైగా ఇదో గొడవ. వీణ్ణి పెళ్లాడక, నేను ఇష్టపడకపోడం వల్ల మానేసినట్టయినా చెబుతుంది. ఒకవేళ పెళ్లాడ్డానికి ఒప్పుకుందా, తన కిష్టం లేకపోయినా మన ఆజ్ఞానుసారం చేసినట్టు బాధ్యత అంతా మనకి చుట్టపెడు తుంది. ఎటొచ్చినా నాపీకమీదికే వొస్తుంది. ఈ ప్రమాదం తప్పిద్దురూ!

చయ—ఆవిల్లు నన్ను చూడనియ్యి. (విల్లుకాగితం చేతికందిస్తాడు. చదువుకుని తెల్లబోయి) గోవిందానికి నా మీద అపనమ్మకమా ? నన్ను మరొకరితో కలిపి జాయం టుగార్డియన్‌గా వెయ్యడానికి ?

విశ్వే—ఈ ప్రాణసంకటం మీదుమిక్కిలి నేనే తెచ్చిపెట్టుకున్నానుగదా చేతులారా: గోవిందంగారితో ఒక నాడు మాట్లాడుతూవుంటే మిమ్మల్ని గార్డియన్‌గా వేసిన సంగతి చెప్పారు. మీవుద్దేశాలన్నీ కొన్ని శతాబ్దాలనాటి పాత పురాతనోద్దేశాలనీ, కౌముదిలాటి అధునికయువతికి మీరు గార్డియన్‌గా తగరనీ అన్నాను.

చయ—నావుద్దేశాలా పాతపురాతనోద్దేశాలు ?

వి—అంతుకు సందేహమా ?" "పెద్దల పెద్దరికం అని అప్పుడే ఒక పుస్తకం పూర్తిచేశాను. తనత మీతో జతగా అధునిక అభిప్రాయాలున్న యువకుణ్ణి ఎవరి నైనాకూడా గార్డియన్‌గా వెయ్యాలని ఉదాహరణలతోసహా ఘాటుగా వాదించాను. ఆవాదనయిన పదిహేనురోజులకే ఈవిల్లురాశారు. నామాటమీద మీతో కలిపి నన్నుకూడా గార్డియన్‌గా వేశారు. నాకొంప తీశారు!

చయ- -నేను నీతో కలిసి గార్డియన్‌గా వుండడానికి ఎంతమాత్రమూ ఒప్పుకోను.

విశ్వే- -ఏం లాభం? రెండుగంటలనించీ, నేను గార్డి యన్‌గా వుండనోయ్ అని మొర్రపెట్టుకోడం లేదూ? ప్రయోజనం ఏమన్నావుందా?
దాన్ని. మానాన్న వున్నప్పుడు మాయింటికి వొచ్చిపోః వాళ్లంతాకూడా ఈనాడు న న్నాదరిస్తారనుకోడం తప్పే: నాకర్మం. అందరూ నన్ను ఒంటరిదాన్ని చేసిపొండి" అనడం ప్రారంభించింది కౌముది, ఈ యెత్తుతమాషా చూశారా? దిక్కులేనిదట! దిక్కులేనిది?

అర—ఎంత కఠినహృదయం నీది విశ్వం? పితృ వియోగదుఃఖిత దిక్కులేనిది కాదూ? సానుభూతి చూపించ డానికి బదులు....

విశ్వే—దిక్కులేని దేమిటోయ్, ఇప్పు డేంతక్కు వయింది కౌముదికి? కావలసినంత ధన ముంది, ఎదురుచెప్ప లేని తల్లీ, చెల్లెలూ వున్నారు. రూపం చూసి మురిసిపోయి పాదాక్రాంతులయే నీవంటి ప్రేమికు దున్నాడు. ఇంక కావలసిన దేమిటి? తప్పు, బాధ్యత భరించడానికి ఒక వ్యక్తి కావాలా? ఈ పాపాలభైరవిపదవి నా కక్కర్లేదు.

చయ—నువ్వు గార్డియన్‌గా ఉండడానికి ఒప్పు కుంటే ఒప్పుకో, మానుకుంటే మానుకో. నీతో కలిసి గార్డియన్‌గా వుండడానికిమాత్రం నేను అంగీకరించను.

విశ్వే—అంగీకరించను, అంగీకరించను అని పాట పాడతారు: ఏం లాభం? మీరింకా ఎక్కడో పెరటిదారినే వున్నారుకదా. మనం నిరాకరించినా ఏమంటుందో తెలుసునా? "మానాన్న ప్రతికోరికా నాకు వేదాక్షరం. మీరు నాకు గార్డియన్లుగా వుండి బాధ్యత వహించడానికి ఇష్టపడకపోయి నా మీరే నా గార్డియన్లని ఎంచుకుంటాను" అంటుంది. కసాయివాడి చేతులో పడిన గొడ్డు చావడానికి ఒప్పుకోక ఏం ప్రయోజనమో....

అర—అహో! దురన్యాయం! ఘోరఅన్యాయం. కోమలనవనీతహృదయ, సుకుమారగాత్రి, లావణ్యమూర్తి, కౌముదిని కసాయివానికిటోటిరా పోలుస్తావు!

విశ్వే—నువ్వు అంత ప్రేమిస్తున్నావుకదా! నిన్ను గార్డియన్‌గా వెయ్యలేకపోయారా? అరవిందం! నువ్వు నాకు ఒక్కసహాయం చేసిపెట్టాలిరా,వీలైనంత త్వరలో కౌముదిని పెళ్లాడెయ్యాలి. భర్తే గార్డియన్ అయిపోరాదుకనక నా తల తడివిచూసుకోవొచ్చును. నిన్ను దాని చేతులో పడకుండా రక్షించా లనుకున్నానుగాని నువ్వో నేనో బలికాక తప్ప నప్పుడు, తనకి మాలిన ధర్మ ముంటుందా ?

అర—ఓహో విశ్వం. కౌముదీపరిణయభాగ్యంకోసం అహోరాత్రాలు పలవరించి తపస్సు చేస్తున్నానే! నాకోరిక తీదేరినా, నాకు మహదానందం లభించదూ? నన్ను రక్షించా లంటావేమిటి ?

విశ్వే—ఓరి నీ తపస్సు కూలా? యావజ్జీవం మహదా నందం కావాలని తపస్సా? అనుభవించలేవోయి, దౌర్భా గ్యుడా,అనుభవించలేవు! అతిమాధుర్యంలాగ అతిఆనందమూ మొహంమొత్తుతుంది.

చయ—నీ వెఱ్ఱిసిద్ధాంతా లిక్కడ కట్టిపెట్టు !

విశ్వే—విన్నావా? అరవిందం. ఆయనబుఱ్ఱలో శతాబ్దాలనాటి ఉద్దేశాలు ఎలా పాతుకుపోయివున్నాయో ?

చయ—ఆ, నీవుద్దేశాలన్నీ తెలుస్తూనేవున్నాయిగా! (పుస్తకం పైకి తీసి) ఇందులో వున్న వేనా?

విశ్వే—ఏమిట్టి? నాపుస్తకం చదివారూ మీరు?

చయ—నీపుస్తకం చదివేటంత దౌర్భాగ్యు డెవరూ లేరు ఇక్కడ.

విశ్వే—చదవకపోతే ఎందుక్కొన్నారు మరి !

చయ—నేను కొంటానా? నువ్వు మహాప్రబుద్ధుడివని అనుకునే కుంత ఒకడు నాకు పంపించాడు. చింపిపారేద్దా మనుకుంటూవుంటే నువ్వొచ్చావు. (పుస్తకం గట్టిగా నేల మీద విసరికొడతాడు).

విశ్వం—ఆపుస్తకం చదవకుండానే అందులో రాసిన వన్నీ చెడ్డవని మీ రెలా తెలుసుకున్నారు?

చయ—నువ్వు రాసిన పుస్తకాలు చెడ్డవికాక మంచి వెలా అవుతాయి? అయినా నీతో వాదించడం బుద్ధితక్కువ. అని మరోవేపు తిరిగి కూచుంటాడు).

విశ్వం -మరి గార్డియన్ సంగతేమిటి?

అర—కౌముదినే అడిగిచూస్తేనో?

చయ—కౌముది కేం తెలుసు? అనుభవం లేదు. చిన్నపిల్ల.

విశ్వం—కౌముది అనుభవంలేని చిన్నపిల్లా? మిమ్మ ల్ని చూస్తే నాకు జాలేస్తోంది చయనులుగారూ!

చయ—నీ అభిప్రాయాలన్నీ నువ్వు దాచుకో, నిన్నె వరూ సలహా అడుగలేదు.

విశ్వం—కౌముది తన యిష్టమొచ్చినట్టు చేస్తుంది. తన యిష్టమొచ్చినట్టు ప్రవర్తించుకోడానికి మనచేత సలహా యిప్పించుకుంటుంది. ఏమన్నా చెడిందా, తప్పంతా, బాధ్య తంతా మన నెత్తిన రుద్దుతుంది. తెలిసిందా ? కౌముదిని చూడాలని అరగంటనించీ అరవిందం తహతహలాడిపోతు న్నాడు. ఊఁ. వెళ్లి పిలుచుకురా !

అర—నాకేం అంత చూడాలని....

విశ్వ—అబద్ధం ఆడకు....ఊఁ. త్వరగా వెళ్లిరా.... అట్టే సేపు వుండిపోకు. నాకూ, చయనులుగారికీ పట్టంలేదు. మరీ ఆలస్య మయితే మాడిపోతాం.

అర—(చయనులతో) వాడి మాట లన్నీ నిజ మను కోకండి. (అని వెళ్లిపోతాడు. ఎవరూ మాట్లాడరు. కొంతసేపు నిశ్శబ్దం.)

విశ్వం—అరవిందం తిరిగొచ్చేదాకా ఇలా మూగగా కూచోడమంటే మరీ ప్రాణంపోతుంది.దానికంటే ఏదో వాగ్వా దం వేసుకుంటేనే మంచిది. కానీండి.

చయ—నీలాటి సిగ్గుమాలినవాణ్ణి నే నెక్కడా చూడ లేదు.

విశ్వం—ఈనాటికి నిజం కనిపెట్టారండి! నేను సిగ్గు విడిచిపెట్టేశాను. అదే నా గొప్పతనం. నాకున్న శక్తిసామ ర్థ్యాలు ప్రకటించుకోడానికి నాకు సిగ్గెందుకు? తమాషా కని పెట్టారా! పెద్దమనిషి అనిపించుకుందా మనుకున్న వాళ్లందరినీ తినేస్తూ, ఎందుకూ పనికిరాకుండా చేస్తున్న దేమిటి? సిగ్గూ, మొహమాటమూ కాదూ? ఎవరింటికయినా వెళ్లితే కడుపు నిండా అన్నం తినడానికి సిగ్గు. మనసు విప్పి మాట్లాడ్డానికి సిగ్గు. చివరికి ధీమాగా బతకడానికి సిగ్గు. మన జీవితమంతా మన్ని గురించి ఇతరు లేమనుకుంటారో అన్న సిగ్గుతో గడుపుకుంటాము. అయినా ఒక్క విషయంలోమాత్రం సిగ్గు లేదులెండి. నాపుస్తకం చదవకుండా, అందులో ఏముందో

తెలుసుకోకుండా నన్ను పెట్టడానికిమాత్రం ఏవిధమైన సిగ్గూ లేదు! సంకోచమూ లేదు.

చయ—నీతో వాదించి ప్రయోజనం లేదు.

విశ్వం—వాదించడానికి ఆలోచనలు లేవనండి.

చయ—నిన్నొయింట్లోనించి........(అంటూవుంటే- అరవిందం, గోవిందంభార్య రామాయమ్మ, కౌముదీ వస్తారు. కౌముదిని చూడగానే చయనులుగారి ధోరణి మారుతుంది)

రా అమ్మా! రా! కూచో. ఎంతటివారికయినా కష్టాలు తప్పవు. ఎప్పుడో ఒకప్పుడు అందరం వెళ్లవలసిన వాళ్లమే. ఇప్పుడు మీనాన్న. ఇంకోకొన్నాళ్లకి నేను....

కౌముది—(కొంచెం గద్గదస్వరంతో) మీరుకూడా నన్ను విడిచివెళ్లిపోతానని చెప్పడానికా ఇప్పుడు పిలిపించారు? అసలే ఓదుఃఖంలో వుంటే! (అని వెక్కుతుంది)

చయ—లేదమ్మా లేదు, నా కిప్పుడొచ్చిన ఖరవా యేమీ లేదు,నిన్నోయింటిదాన్ని చేసి,భర్తచేతుల్లో అప్పగించి మరీ వెళతానమ్మా!

కౌము—(ఇంకో వెక్కు వెక్కి) నాన్న పోయి ఇంకా వారంరోజులు కాలేదు, అప్పుడే నాపెళ్లిమాటలా?

చయ—ఇవాళ అన్నీ నీహృదయం నొప్పించే మాటలే అంటున్నాను తల్లీ, పెద్దవాడి మాటలు లక్ష్యపెట్టకు.

విశ్వం—శబాష్! మీమాట లక్ష్యపెట్టొద్దని మీరే చెప్పుకున్నతరవాత ఇహ మీరు గార్డియన్‌గా వుండి చెయ్యగలిగేదేమిటి? చూశారా ఆశక్తి? రెండునిమిషాల్లో దాసానుదాసుణ్ణి చేసుకుంది మిమ్మల్ని.

కౌము—విశ్వానికి మరో పనేం లేదు తాతయ్యా! అన్నిటికీ పెడర్థాలు తియ్యడమే!

విశ్వం—తాతయ్యా! నీ గార్డియన్‌ని పట్టుకుని తాతయ్యా అని పిలుస్తావా?

కౌము—నే చిన్నప్పటినించీ చయనులు తాతయ్యా అనే పిలిచేదాన్ని. నాకు చయనులుగారు తాతయ్య; నేను చయనులుగారి మనమరాల్ని, కాదూ తాతయ్యా?

చయ—అవునమ్మా అవును, అతని మాటలకేం? నన్ను తాతయ్యా అనే పిలు. మరేపేరుపెట్టి పిలిచినా నేను ఒప్పుకోనేఒప్పుకోను. (విశ్వంతో) అయిందా నీపని? అనవసరంగా జోక్యం కలగజేసుకోకు.

కాము—అయితేనన్నెందుకు పిలిపించావు తాతయ్యా?

చయ—నీతో ఒక ముఖ్యవ్యవహారం మాట్లాడాలని పిలిచానమ్మా.

కాము—నాతో వ్యవహారమా! చిన్నపిల్లని నాకేం తెలుస్తుంది తాతయ్యా?

విశ్వ—వేషాలు మానేసి చిన్నగా జవాబు చెప్పు.

కౌము—విశ్వానికసలు హృదయం లేదు తాతయ్యా. (అని ముద్దులు గుడుస్తుంది)

చయ—అవునమ్మా అవును, అత నోకసాయి. (తరవాత ఏం మాట్లాడాలో తెలీక కాస్సేపు ఊరుకుని) చూడమ్మా. ఒక్కనిమిషం ధైర్యం చిక్కపట్టుకుని ఈ వ్యవహారం పరిష్కారం చేసుకోవాలి. మీనాన్న విల్లులో పెద్దసంకటం తెచ్చి పెట్టాడు. నన్ను ఈ విశ్వేశ్వర్రావుతో కలిపి గార్డియన్‌గా వేశాడు. నా కదేం ఇష్టంలేదు.

కౌము—అమ్మోమో.... !

రామా—కౌముదీ! నిన్ను బతిమాలుకుంటాను-నామీద మాత్రం ఏమీ పెద్దరికం పెట్టకు. నా కీవిషయంలో ఇష్టాయిష్టాలు లేవు. ఉన్నా అదెవరూ లక్ష్యపెట్టనూపెట్టరు. మీ ముగ్గురికీ ఏది మంచిదని తోస్తే అదే చెయ్యండి,

(ఈసంగతి చూడమని విశ్వం సంజ్ఞచేస్తాడుకాని చయనులు గుర్తించడు).

కౌము—నాకూ, లలితకీ గార్డియన్‌గా వుండి, బాధ్యతంతా వహించేశక్తి అమ్మకి లేదని తెలుసును. మాకు కొంత సహాయమూ, సలహా అవసరం. కనక మాకు ఎవరో ఒకరు గార్డియన్‌గా వుండితీరాలి. అలాటప్పుడు మానాన్న నియమించినవాళ్లని కాదని నేను అనగలనా ?

చయ—అంటే, మీనాన్న చేసిన ఏర్పాటు నీకు నచ్చిందన్నమాట.

కౌము—నాకు నచ్చడమూ లేదు, నచ్చకపోవడమూ లేదు. మానాన్న ఏర్పాటుచేశాడు. అంతే నాకు కావలసింది.

చయ—తండ్రిమీద అంత భక్తి వుండడం మంచిదేనమ్మా ; కాని దానివల్ల ఇప్పుడు మన సమస్య తేలదే?.... చూడు, మాలో ఒకరం చెయ్యకూడని తప్పు పని చేశామనుకో, ఆసంగతి తెలియకే మీనాన్న మమ్మల్ని గార్డియన్‌గా వేశా డనుకో. ఆసంగతి నీకు తెలిసిన తరవాత.

కౌము—చెయ్యకూడని పని నువ్వు చేస్తావని నేను ఎలా వూహించను తాతయ్యా?

విశ్వం—నిజంగా ఏమీ చెయ్యలేదుకదా ఇంతకీ?

చయ—(కోపంలో) లేదు.

రామా—చెయ్యనప్పుడు చేసినట్టు వూహించి అనుకోడ మెందుకు?

కౌము—చూశావా తాతయ్యా! నిన్నుగురించి అలాటిది అనుకోడం అమ్మ కేమీ ఇష్టంలేదు!

చయ—మీయిద్దరికీ నామీదుండే అభిమానంచేత అలా అంటున్నారు. ఈసంగతి తిన్నగా చెప్పడం చాలా కష్టంగా వుంది.

విశ్వ—చెప్పడం చేతకావడం లేదనండి.

చయ—నువ్వు చెప్పు మహా చేతనయితే!

విశ్వ—నేను నీకు గార్డియన్‌గా వుండడానికి తగనని చయనులుగారి అభిప్రాయం, నాకూ ఆ అభిప్రాయమే వుందనుకో. తప్పుపని అన్నారే! అది నే రాసిన పుస్తకం. ఆ పుస్తకంకనక మీనాన్న చదివివుంటే నన్ను గార్డియన్‌గా నియమించివుండరని ఆయన ఉద్దేశం. అందుచేత మీమంచికోసం, నేను గార్డియన్‌గా వుండకూడదని నువ్వు చెప్పాలంటారు. నువ్వు మాట అంటే చాలు నేను పరమసంతోషంతో విరమించుకుంటాను.

కౌము—నువ్వు రాసిన పుస్తకమా? నే నది చదవలేదే

విశ్వం—ఊఁ. అయితే త్వరగా చదివేసి ఏదో ఒకటి నిర్ణయించెయ్యి! (అని పుస్తకం తీసి ఇవ్వబోతాడు)

చయ—అహహాఁ. ఆపుస్తకం చదవకూడదు. ముట్టుకోకూడదు, నేను నీగార్డియన్ని. చెబుతున్నాను. ఆపుస్తకం కిందపారెయ్యి.

కౌము—నీ కిష్టంలేని పని ఎందుకు చేస్తాను తాతయ్యా! (అని పారేస్తుంది)

విశ్వం—ఒక గార్డియన్ రాసిన పుస్తకం చదవకూడ దని రెండోగార్డియన్ అంటే వ్యవహారం ఎలా తెగుతుంది? ఆపుస్తకం చదవమని నే నంటా ననుకో.

కౌము—మరీ కొంటెవాడివి విశ్వం! నా కలాటి ధర్మసంకటం తెచ్చిపెట్టవని తెలియదూ!

చయ—(కొంచెం విసుగుతో) సరేనమ్మా. నువ్వు ఏదో ఒకటి తేల్చెయ్యాలి. అతనో నేనో ఏదోఒకటి నిర్ణయించాలి.

కౌము—నేనేం చెప్పను? నాకేం అనుభవం లేదు. చిన్నపిల్లని. మానాన్న చేసిన నిర్ణయం నేను కాదనను.

రామా—మీరిద్దరూ గార్డియన్లుగా వుండడానికి ఇష్టంలేక బాధ్యతంతా కౌముదిమీద పెట్టడం నాకేమో అన్యాయంగా కనిపిస్తోందిసుమా! ఈలోకంలో ఇదేమిటో, ఎప్పుడూ తప్పు రెండోవారిమీద పెట్టడమే కనిపిస్తోంది.

చయ—మీ రలా అర్థం తీస్తే నే నేం చెప్పగలను?

కౌము—తాతయ్యా!నాకు గార్డియన్‌గా వుండడానికి నీ కిష్టంలేదా? మానాన్న ఎంతో నమ్మిన మీరే,ఆయన పోగానే ఇలా నన్ను వొదిలిపెట్టేస్తే ఇహ నాకు దిక్కేమిటి? (అని వెక్కుతుంది.)

చయ—భయం లేదమ్మా! నేనుండగా నీకొచ్చిన భయమేమీ లేదు.

కౌము—అమ్మయ్యా! ఇప్పటికి నాప్రాణం కుదుటపడ్డది. నువ్వు ఒప్పుకున్నట్టేనా విశ్వం?

విశ్వం—చయనులుగారు ఒప్పుకోక అంత సాధించారుకనక నేను తిరగబడనా? ఊ. కానీ. రోట్లో తలెట్టి రోకటిపోటుకి వెరి చేంలాభం?

చయ—అమ్మా! అతన్ని విశ్వం అని అంత చనువుగా పిలవడమన్నా మానెయ్యవమ్మా!

కౌము—మరేమని పిలవమంటావు తాతయ్యా!విశ్వం అని పిలిస్తే నీ కిష్టంలేదుటోయ్?

విశ్వం—నా కేం నువ్వు బొడ్డుకోసి పేరెట్టావా? విశ్వేశ్వరరావు అని పూర్తిపేరెట్టే పిలవాలి.

కౌము—నిజంగా అలా పిలిస్తే నీ కిషం వుండనేవుండదు మళ్లీని. అవునన్నది కాదనడమేగా నీపని....అతననేవన్నీ నిజమనుకోకూడదు తాతయ్యా! సరేగాని వ్యవహారమంతా అయిపోయినట్టేనా? అంతా మానాన్న చెప్పినట్టే జరుగుతుందిగా! నా కెంత సంతోషంగా వుందో చెప్పలేను, రావే అమ్మా, ఇహ మన కిక్కడ పనిలేదు, (అని లోపలికి వెళ్లిపోతుంది. తల్లి వెనకాలే వెళతుంది)

విశ్వం—చెప్పానా చయనులుగారూ? ఇహ మన పనయిపోయింది.

చయ—కట్టిపెట్టు నీధోరణి.(అని లోపలికి వెళతాడు)

విశ్వం—అరవిందం, నీకు ఈ లోకంలో పేరుప్రఖ్యాతులు సంపాదించుకోవాలని వుందా?

అర—ఓ, లేకేం? నాపేరు చిరస్థాయిగా వుండే కవిత్వం వ్రాయాలని అభిలాష లేదూ?

విశ్వం—నువ్వు జాగ్రత్తగా ఉండకపోతే కౌముది నిన్ను పెళ్లాడేస్తుంది. దానితో నీకోరికలన్నీ ఒలా వ జీరించి పోవాలి.

అర—ఎంత శుష్కసిద్ధాంతంరా నీది, నా అది బాగుండి నాప్రియురాలే నాకు లభించినట్టయితే, నాహృదయం వికసించదూ, నాకవితాసృష్టి అమోఘమై వెల్లివిరియ:

విశ్వం—వెఱ్ఱివాడా! స్త్రీవ్యామోహంలో పడినవాడివి ఇంక నువ్వు ఏంప్రయోజనం సాధించగలవు? స్త్రీ ప్రళయ కారిణి, విధ్వంసకశక్తిస్వరూపిణి. నిన్ను కబళించేస్తుంది, మోసపోకు.

అర—ఎంత కర్కశవాక్కు నీది, పోనీలే. నన్ను కబళించేస్తే కబళించేసింది, అదే నాకిష్టం, అదే నాకు పరమానందం. చరమాభిలాష.

విశ్వం—స్త్రీలో వున్న చమత్కార మదే! మన చేతే స్వయంగా మన వినాశం కోరుకునేటట్టు చేస్తుంది

అర—వినాశమా? కానీ. నా వాంఛ నిదే, నా రోమ రోమాంచలాల వాంఛాసిద్ధే నా విలయమయితే....

విశ్వం—అరవిందం, ఒక్కమాటు ఈసృష్టివిచిత్రం ఆలోచించు. సృష్టి ఆదిలో స్త్రీపురుషవివక్షత లేదు. కీటక రూపంలో వున్న ఒక ప్రాణి స్వవిభజనవల్లనే అనేకప్రాణులుగా మారిపోయే తరవాత సృష్టికి అంతకంటె మంచిపద్ధతి తట్టింది. ఒకే కీటకంలో స్త్రీపురుష ప్రకృతులు రెండూ వుండేవి. స్త్రీప్రకృతే సర్వధా జీవితావస్థలో వుండేది. పురుష ప్రకృతి కొన్నిసమయాల ప్రాణానికొచ్చి సృష్టికి సహాయపడి మళ్లీ దీర్ఘనిద్రలోకి పోయేది. తరవాత జరిగింది స్త్రీ పురుషవ్యక్తివిభజన. కాని పురుషప్రకృతి ఎప్పటికీ నిమిత్తమాత్రమే. వృశ్చికదాంపత్యం చూశావా? ఆడతేలు గర్భం తాల్చగానే మొగతేలుని నమిలి, మింగి, జీర్ణంచేసుకుంటుందిట. అంటే సృష్టికార్యమయినతరవాత ఆడతేలుకి మగతేలుతో మరి ప్రయోజనం లేదన్నమాట. మానవజాతిలో ఈసంబంధం అంత స్ఫుటంగా వ్యక్తం కాకపోయినా పురుషుడు స్త్రీహస్తంలో కీలుబొమ్మ. స్త్రీకి ఈలోకంలో ఒక్కటే పరమావధి, సృష్టి. ఆకార్యానికి పురుషుణ్ణి సాధనమాత్రుడుగా ఉపయోగించుకుంటుంది, పురుషుడు స్త్రీని ఆకర్షిస్తాననుకోడం పొరపాటు. స్త్రీ గూడు పన్ని కూచున్న సాలీడు. పురుషుడు చిక్కపడగానే కబళించేస్తుంది. ఇది సృష్టిరహస్యం. జాగ్రత్త. ప్రపంచంలో ప్రయోజనకారివిగా వుండాలంటే, నువ్వే స్వయంగా సృష్టించాలంటే, స్త్రీవ్యామోహంనించి తప్పించుకో.

అర—స్త్రీని గురించి ఎంత అన్యాయంగా మాట్లాడుతున్నావురా!

విశ్వం—అన్యాయంకాదు. ఇదే పరమసత్యం. స్త్రీలు పురుషుల విలాసవస్తువులని అనుకున్నది   పురుషులు స్త్రీలకి సాధనమాత్రులు. స్త్రీ పురుషుణ్ణి ప్రేమించదు. బలికి ముందు వేటపోతుని బలియిపెట్టడంలో ఎంత ప్రేమ వుందో స్త్రీప్రేమలోనూ అంతే సత్యముంది.

అర—ఇహ చాలించు నీ ఉపన్యాసం, నీకూ ప్రేమోదయమైతే, నీమనసూ ఏవ్యక్తిమీదనయినా లగ్నమయితే ఆనాడు అర్థమవుతుంది స్త్రీ ప్రేమరూపిణో, శక్తిరూపిణో!

విశ్వం—వెఱ్ఱివాడా! ప్రేమ అన్నదే లేదు. ఈ లోకంలో వున్నది ఆకర్షణ. మహాశక్తి, సుడిగుండంలో, అయస్కాంతంలో మహాశక్తు లున్నాయి, సమీపానికి పోయిన వస్తువుల్ని ఆకర్షించి, అరికట్టి నాశనం చేస్తాయి ప్రతిఘటనకి లొంగని ఈ ఆకర్షణే ప్రేమఅనీ, విధిగా ఆకర్షింపబడడమే ప్రేమించుకోడమనీ భ్రమపడుతున్నావు.

అర—కొత్తవా ళ్లెవరైనా నీమాటలు వింటే ఋడుసుకుంటారు తెలుసునా? అభ్యాసంచేత మా కేమీ ప్రమాదం లేకుండా వుంది.

(లోపలినించి చయనులుగారూ, కౌముదీ దిగుతారు, చయనులు చాలా గాభరాపడుతూవుంటాడు)

చయ—(విశ్వాన్ని చూసి) నువ్వింకా వెళ్ల లేదూ?

విశ్వం—మీకేమన్నా అడ్డమొస్తున్నానా ఏమిటి? అయితే వెళతా లెండి.

కౌము—విశ్వానికిమాత్రం ఎప్పుడో ఒకప్పుడు తెలియకుండా వుంటుందా? ఇప్పుడే చెప్పేస్తేసరి! వెళ్లకోయ్,వుండు.

చయ—ఎలా చెప్పాలో తెలియకుండావుంది. నోరాడం లేదు. అరవిందం, మీచెల్లె

అర—(ఆదుర్దాతో) ఏం? మాచెల్లెలి కేం ప్రమాదం రాలేదుకదా! ప్రాణభయం లేదుకదా!

చయ—ప్రాణం పోయినా బాగుండిపోను నాయనా!

అర—ఏం జరిగిందో చెప్పండి .... కౌముదీ నువ్వైనా చెప్పవమ్మా!

కౌము—ఎలాచెప్పాలో నాకుమాత్రం తెలుసా? మన్ని ఎరుగున్నవాళ్లెవరూ అనుమానపడకుండా ఉషని ఇంకోవూరేదన్నా తీసుకుపోతే మంచిదనుకుంటాను.

విశ్వం—ఓ, అదా!

చయ—సందేహం లేదు. మొన్న రహస్యంగా వెళ్లి లేడీడాక్టరుకి చూపించుకుందిట. అది రహస్యమని తెలీక డాక్టరు ఇవాళ ఇంటికే వొచ్చిచూసిందిట. అందరికీ తెలిసిపోయింది. మూడోనెల దాటిందిట.

అర—(చేతిలో మొహం దాచుకుని) ఎంతపని జరిగిపోయింది! ఈ మోసంచేసిన ద్రోహి, దుర్మార్గుడు, ఛండాలుడు ఎవరో.

చయ—అదే మరీ అన్యాయంగా వుంది! పేరు చెప్పమంటే చెప్పదు!

అర—ఎంతపని జరిగింది! ఎంతపని జరిగింది!!

విశ్వం—ఏ రైలుప్రమాదమో అయి చచ్చిపోతే ఎంత బాగుండిపోను. అప్పుడు నీకు ఎంత హాయిగా, గౌరవంగా వుండిపోను.

అర—నీ వేళాకోళానికి వేళా పాళా లేదు,

విశ్వం—వేళాకోళమా? ఇందాకటినించీ చెప్పినదంతా మరిచిపోయావా? స్త్రీకి పరమావధి సృష్టికాదూ? పురుషుడు నిమిత్తమాత్రుడు కాదూ? పుస్తెముడి పడితేనేం, పడకపోతేనేం? నీచెల్లెలు సంతానవతి అయి తన ప్రయోజనం నెరవేర్చుకోబోతోంది. సంతోషించడానికి బదులు నిమిత్తమాత్రుడయిన ఆపురుషుడి పేరేదో తెలియలేదని కుంగిపోయి, నీచెల్లె లేదో మహాఘోరపాపం చేసినట్టు ఏడుపుమొహాలెడతారేం?

చయ—నాయింట్లో మళ్లీ యిలాటి కారుకూతలు కూస్తే మెడట్టుకు గెంటించేస్తాను.

విశ్వం—(చివాలున లేచి) కౌముదీ! ఉష ఇప్పుడెక్కడుంది?

కౌము—నువ్విప్పు డక్కడికి వెళతావా ఏమిటి?

విశ్వ—తప్పకుండా. ఉష ఇప్పుడు ఆపద్దశలో వుంది. కావలసినది సానుభూతి, సహాయం. మీవల్ల లభించేటట్టు లేదు. నేనుండగా ఉషకి ఏలోపమూ జరగవలసిన అవసరం లేదు.

కౌము—తొందరపడకు, ఉష లోపలే వుంది!

విశ్వం—ఏమిటీ? చయనులుగారింట్లోనే? చయనులుగారిల్లే అపవిత్రమయిపోయిందే? చయనులుగారూ, ఇంకా ఇక్కడే వున్నారా? వెళ్లి వెంటనే వీథిలోకి గెంటెయ్యండి. ఇల్లంతా లోషనెట్టి కడిగించండి.

కౌము—(గాభరాగా) తాతయ్యా! నిజంగానే వీథులోకి గెంటేస్తావా?

చయ—ఛీ ఛీ, అతని మాటల కేమిటి? కాని మన మధ్యని ఓ గోముఖవ్యాఘ్రం ప్రవేశించింది. నీతినియమాలు పాటించనివాడు, ఓ దుర్మార్గుడు మన యింట్లో ప్రవేశించాడు. వాడెవరో తెలుసుకోడం మన కర్తవ్యం కాదూ? ఇవాళ ఉషని మోసంచేసినవాడు రేపు..........

కౌము—తాతయ్యా! అంత గట్టిగా మాట్లాడకు! ఉష చెప్పనంటూవుంటే మన మేం చెయ్యగలము?

చయ—ఉషే చెప్పనక్కర్లేదు. కళ్లు జాగ్రత్తగా పెట్టుకు చూసుకుంటే మనకే తెలుస్తుంది. ఉషని ఎరుగున్న వాళ్లలో ఎవరైనా [illegible] పాపం లేదని వాదించేవా డున్నట్టయితే.....

విశ్వం—అహఁ. (కొంచెం దగ్గి) ఏమిటో అనుకున్నా. చయనులుగారికి నిగ్రహశక్తి ఎలాగయినా కొంత తక్కువే.

చయ—(నిర్ఘాంతపోయి) నామీద అనుమానమా? ఘోరం, ఘోరం!!

విశ్వం—ఏం? నామీద అనుమానానికి ఎంత హేతువుందో, మీమీద అనుమానానికీ అంతే హేతువుందిగా! అవకాశం అందరికీ సమానంగానే లేదూమరీ?

చయ—(ఇహ మాట్లాడలేక కూలబడిపోతాడు).

విశ్వం—ఉషకి పుట్టబోయే సంతానానికి తండ్రి ఎవరని తెలుసుకుంటే యేం, తెలుసుకోకపోతే యేం? ఇప్పు డేం చెయ్యాలో ఆలోచించండి ముందు.

అర—నాకర్తవ్య మేమిటో తెలియకుండావుందికదా నాకు!

విశ్వం—నీకర్తవ్యం ఎవరికి కావాలి? నీచెల్లెలి అవసరం ఆలోచించు.

చయ—ఎవరి అవసరాన్నిబట్టి వారు నడుచుకుంటూ కర్తవ్యం సంగతే స్మరించకపోతే నీతి ఏమయిపోయేటట్టు? మనిషిజన్మ ఎత్తడమెందుకు?

విశ్వం—నీతి అంటే స్త్రీహత్యా, మాతృహత్యానా? ఏపాపమెరగని పసిపిల్లకి శిక్ష విధించడమే నీతి అయితే నశించిపోయినా ప్రమాదం ఏమీ లేదు.

(జయనులు జవాబు చెబుదామని ప్రయత్నిస్తాడుకాని కౌముది అడ్డం తగులుతుంది)

కౌము—తాతయ్యా! నువ్వుకూడా వెళ్లి ఉషని ఇక్కడికి రమ్మని పిలుచుకురావూ? పాపం! అరవిందం ఒక్కడూ ఏమీ చెయ్యలేడు.

జయ—వెళ్లాలనే వుందికాని నిన్ను ఒక్కర్తెనే ఇక్కడ విడిచివెళ్లడానికి మనస్కరించడం లేదు. నువ్వు కూడా నాతోటి రావూ?

కౌము—(కొంచెం సిగ్గు తెచ్చిపెట్టుకుని) నేవుంటే అన్ని సంగతులూ మాట్లాడ్డానికి సందేహిస్తారు. నేవినకూడని సంగతులు చాలావున్నాయని అమ్మ అంటూవుంటుంది.

జయ—అవునవును, నువ్వు రావడ మూర్తే మంచిది కాదులే! నువ్వు మంచిచెడ్డలు చక్కగా తెలుసుకున్నదాని వమ్మా! (అని వెళ్లిపోతాడు)

కౌము—(విశ్వందగ్గిరగా వొచ్చి)నాకు గార్డియన్‌గా వుండడం నీ కిష్టమేనా?

విశ్వం—నీచేష్టలకి బాధ్యత వహించేందుకు ఇదివర కున్నవాళ్లు చాలక నన్నుకూడా నీచితాలోకి ఎక్కించాలా?

కౌము—వేళాకోళం మానుదూ కొంతసేపు.

విశ్వం—వేళాకోళం కాదు కౌముదీ! నీలో వున్న ఆకర్షణనించి తప్పించుకుందామని చిన్నప్పటినించీ ప్రయత్నిస్తూ నేవున్నాను. అడుగడుక్కీ నే వోడిపోతూనేవున్నా, చివరికి నీమాటే నెగ్గుతోంది, నీకోరికనిబట్టే నే నడుచుకో వలసొస్తోంది.

కౌము—పోదూ. నువ్వు మరీని....మన చిన్నప్పుడు.

విశ్వం—నువ్వేమీ జ్ఞాపకంచెయ్యక్కర్లేదు బాబూ, ఆరేళ్ల పిల్లప్పటినించీ నీవని ఆకర్షించడమేగా!

కౌము—నేనా నిన్ను ఆకర్షించినది? నువ్వేగా నావెన కాల తిరుగుతూ అదీ చేశాను, ఇది చేశాను- వాడిని తన్నాను వీడిని తన్నాను అని ప్రగల్భాలు కొట్టేవాడివి! పైగా అన్నీ అబద్ధాలు.

విశ్వం—ఏం చెయ్యను? నీ ఆకర్షణ అలాటిది! నా సాహసకృత్యా లేవో ప్రతిరోజూ చెబుతేనేగాని నీకు సంతోషం కలిగేది కాదు. నీచిరునవ్వుకోసం నేను నానా తగువులూ పెట్టుకుని తన్నులు తినేవాడిని, కొన్ని సాహస కృత్యాలు జరగనివి కల్పించిచెప్పాను. అవే నీ కెక్కువ రుచించడంచేత ఇహ తన్నులుకూడా తినడ మెందుకని అన్నీ కల్పించే చెప్పడం ప్రారంభించాను. అయితే నే చెబుతున్న వన్నీ అబద్ధాలని అప్పుడే కనిపెట్టా వన్నమాట!

కౌము—ఆ. కాని నువ్వెక్కడ చిన్నబుచ్చుకుంటావో నని పైకి అనేదాన్నికాదు. నిన్నేవిధంగానన్నా సంతోష పెట్టాలనే నాకుండేది, నువ్వు చెప్పిన అబద్ధాలన్నీ నిజాలని నే నమ్మినట్టు నటించి ప్రవర్తించినందువల్ల నీకు ఆనందం కలిగితే ఎందుకు ప్రవర్తించకూడదు ?

విశ్వ—చూశావా ? ఎనిమిదేళ్ల పిల్లకే ఎంత లోకజ్ఞానమో? నటన, ఆకర్షణ స్త్రీ పుట్టుకతో నేర్చిన విద్యలు. స్త్రీ మూర్తీభవించిన ప్రకృతి. గనక తన ప్రయోజనం నెరవేర్చుకోడంలో వెనకముందులు ఆలోచించదు, దేన్ని బలివ్వడానికయినా వెనకాడదు.

కౌము—సందు దొరుకుతే చాలోయ్. ఏవో వేదాంతం మొదలెడతావు. నీ వేదాంతం ఎవరికి గావాలి? నేనంటే నీ కిష్టంగా వుందేదా ?

విశ్వం—ఇష్టంగా వుంటేనేం? లేకపోతేనేం? కొండ చిలువ చుట్టేసుకున్న జంతువుకి కొండచిలువమీద ఇష్ట ముంటేనేం, లేకపోతేనేం? ఎంత ప్రయత్నించినా బయటపడ లేదుగా !

కౌము—ఓహో, ఇందుకా నన్ను మాటిమాటికీ కొండచిలువ కొండచిలువ అంటావు. కొండచిలువ ఇలా చుట్టేసుకుంటుందనా! (అని బాహువులు మెడకి పెనవేస్తుంది)

విశ్వం—కొంటెతనం మాని అలా కూచో. నీ ఆటలు ఇప్పుడు నాదగ్గిర సాగవులే. నువ్విలా చేశావని నే నెవరితోనైనా చెబుతా ననుకో. ఎవరూ నమ్మరు. పైగా నీమీద అపవాదు పుట్టించానని నామీద ఎదురుతిరుగుతారు. నామీద నువ్వేమన్నా చెప్పు-అందరూ నమ్మేస్తారు.

కౌము—అంతే కావాలి శాస్తి. అస్తమానమూ అందరికీ భయమెత్తే మాటలు మాట్లాడితే అంతే అవుతుంది. ఎవరేం అనుకుంటే ఏంగాని నన్నుగురించి నువ్వేమనుకుంటున్నావు చెబుదూ!

విశ్వం—నువ్వా ! అరవిందాన్ని కబళించేసి జీర్ణం చేసేసుకోడానికి సిద్ధంగా వున్నావు.

కౌము—అరవిందాన్నా! నిన్ను చూస్తే ఒక్కొక్కప్పుడు నాకు జాలేస్తుంది విశ్వం. ఎంతో తెలివయినవాడికి

మల్లే మాట్లాడుతావు. కాని కొన్నివిషయాలు నీకు అసలేమీ తెలియదు!

విశ్వం—అరవిందం నీమీద పద్యాలూ, పాటలూ రాసేస్తున్నాడు. ఇరవై నాలుగుగంటలూ నీమీదే ధ్యాస.... నాకు తెలియకపోడమేమిటి ?

(అంటూవుంటే చయనులుగారు, భార్య, అరవిందం తిరిగొస్తారు.)

భార్య—ఇప్పు డేమంటారు చెప్పండి? అమ్మా. ఎంత పెంకితనం! తప్పుపని చేసి, తగుదునమ్మా అని ఇంకా మొహ మెత్తుకు తిరుగుతా నంటుందీ ?

చయ—అనవసరంగా ఎందుకు కేకలేస్తావు?

అర—తప్పుచేసినప్పుడు అనవలసిందే లెండి. నామీద ప్రేమచేత మీరు అనకపోయినా లోకం వూరుకుంటుందా? ఉషని ఎక్కడికైనా తీసుకుపోతా లెండి.

భార్య—చేసినపనికి పశ్చాత్తాపపడి ఏడిస్తే అదో దారి! అయినా ఈడొచ్చిన పిల్లల్ని పెళ్లిలేకుండా వుంచకూడదర్రా అంటే వింటారా? చేసినదాని కిప్పుడు అనుభవించాలి.

విశ్వం—అవునమ్మా, పెళ్లంటూ అయిపోతే, మొగు డంటూ తెరచాటు వుంటాడుకనక, ఆపయిన ఏం జరిగినా ఇబ్బంది వుండదు. గౌరవాని కేమీ లోటుండదు.

భార్య—పోనీ! పందులు కన్నట్టు కనమను!

చయ—అతనితో ఎందుకు వృథా వాదం!

భార్య—ఏం? అతనంటే మాటకి జవాబుచెప్పడం భయమా?

చయ—వూరుకుందూ?

భార్య—వూరుకుంటేనే ఇంత మరీ పేట్రేగిపోయి నది. ఇంతమందీ కలిసి దానిచేత పేరు చెప్పించలేకపోయారు!

విశ్వం—పేరు చెబితే ఏంచేద్దురు?

భార్య—వాడి కిచ్చి పెళ్లన్నా తగలేద్దుం!

విశ్వం—ఏం అరవిందం? నీచెల్లెల్ని ఓదుర్మార్గుడికి ఓద్రోహికి, ఛండాలుడికి ఇచ్చి పెళ్లిచెయ్యాలని

విశ్వం—మరి! వాణ్ణి అన్నితిట్లూ తిట్టి ఇప్పుడు మళ్లీ వాడికే యిచ్చి పెళ్లిచేద్దామంటే అర్థమేమిటి? లేకపోతే వాడు నిజంగా దుర్మార్గుడు, దగుల్బాజీ, ఛండాలుడు కాదా?

అర—విశ్వం, నువ్వు ఒక్కనిమిషం వూరుకుందూ? నాకేం చెయ్యడానికీ పాలుపోకుండావుంది. పిల్లికి చెలగాటం, ఎలక్కి ప్రాణసంకటం.

(ఉష పైకొస్తుంది, రవికలగుడ్డ గిరవాటేస్తూ)

ఉష—మీరిచ్చిన గుడ్డ మీరే తీసుకోండి, నే వెళ తున్నా!

విశ్వం—ఉషా! ఒక్కమాటు లోపలికి వొచ్చికూచో. తిన్నగా సంగతి సందర్భాలన్నీ మాటలాడు.

ఉష—పొద్దుటినించీ అందరి మాటలూ వింటూనే వున్నా. ఇహ చాలు. నన్ను పోనివ్వండి,

విశ్వం—ఉషా! నువ్వేమీ తప్పుచెయ్యలేదు. నువ్వే దో మహాఘోరపాపం చేసినట్టు వీళ్లందరూ నిన్ను దండించ డానికి ప్రయత్నిస్తున్నారు. కాని భయపడకు. నిజంగా ఇప్పుడు తప్పు నిన్ను నిందిస్తున్నవాళ్ల దే!

ఉష—నేను తప్పుచెయ్యలేదని నీ కెలా తెలిసింది? ఎవరు చెప్పారు ?

విశ్వం—ఒకరు చెప్పేదేమిటి ఉషా! మాతృత్వం స్త్రీకి జన్మహక్కు. సంతానకాంక్ష స్త్రీకి సహజం. పురు షుడు నిమిత్తమాత్రుడు. నిమిత్తమాత్రుడయిన పురుషుణ్ణి భర్త అన్న పేరుతో ఆజన్మాంతం భరించా లన్నది సంఘం నిర్మించిన నీతి. అక్కర్లేదని నాసిద్ధాంతం. నాసిద్ధాంతం నువ్వు ఆచరణలో పెట్టి చూపించావు. నీధైర్యం ప్రశంసనీయం. నువ్వు వీరమాతవి. నీకు సహాయానికి ఏమీ లోటుండదు. నా సర్వసంపదలూ నువ్వు స్వేచ్ఛగా వినియోగించుకో వొచ్చును. ధనంతో సంఘాన్ని ప్రతిఘటించావా, నీ సిగపువ్వు తెంపలేరు ఉషా!

ఉష—ఛీ ఛీ. నువ్వేమిటో నిజం గ్రహించి నాపక్షం మాట్లాడుతున్నా వనుకున్నాను. నువ్వూ వీళ్లలాగే నేను చెడ్డదాన్నే అనుకుంటున్నావు. పైగా నీ నీచాభిప్రాయాలు నేను ఒప్పుకుంటున్నట్టుకూడా మాట్లాడుతున్నావు. ఇదివరకు అందరి మాటలూ భరించానుగాని నీసానుభూతిమాత్రం సహించలేను. నాకు వివాహం కాలేదని మీరందరూ ఎందు కనుకోవాలి? మీలో ఒక్కరయినా ఆసంగతి కనుక్కోడానికి ప్రయత్నించారా !

అర—నీ వివాహ మయిందా !

విశ్వం—ఇదోటా ?

భార్య—ఇదో కొత్త పన్నాగమా ?

ఉష—అబద్ధం చెప్పవలసిన అగత్యం లేదు నాకు. (లోపలినించి మంగళసూత్రం తీసి చూపిస్తూ) కళ్లారా చూడండి.



# చాకలివానిచే చింపబడ్డది!

## —ఇంకొకటి కొంటే ఎంత అవుతుందో చూడండి

బట్టలకు యిప్పుడున్నధరలతో చాకలివాడు తూట్లుపడేటట్లు బాదటం చూస్తే, డబ్బు అనవసరంగా పాడుచేయటమే. బట్టలు చాలకాలము మన్నునట్లు చూడవలెను. వాటినిగూర్చి తగు జాగ్రత్త తీసుకోవలెను. చాకలివాడు మోటుగా బండకేసి బాదటం యింకా అవసరంలేదు. బట్టలు ఎంత మురికిగానైనా వుండనీ, సన్‌లైటు సబ్బుతో మురికిని బహుసులువుగా పోగొట్టవచ్చును. సన్‌లైటు సబ్బుయొక్క స్వతసిద్ధమైనమురుగు సంగతి మీకు బహుశా తెలిసే వుంటుందిగా: మంచి బలముగల చాకలివాడు కఱ్ఱతోగాని రాతిమీద వేసిగాని బాదటం, వీటి అన్నిటికంటె సన్‌లైటు సబ్బుయొక్క మృదువైన నురుగులో యెక్కువగా మురికిని పోగొట్టేగుణమున్నది. ఈ క్రింద నుదహరించిన సన్‌లైటు "సబ్బు-రక్షణ" అను మార్గమును తెలిసికొని, వెంటనే మీ యింట్లో అమలులో పెట్టండి.



### మీ పనివాడికి సన్‌లైటు "సబ్బు-రక్షణ" విధము నేర్పండి

1. గుడ్డలను బాగా తడపండి. 2. తరువాత సబ్బు బట్టకు పట్టించండి. మరీమురికిగా వున్నచోట సన్‌లైటు బాగా పట్టించవలెను. 3. సబ్బు బట్టలకు బాగా అంటనివ్వండి. రాతికేసిగాని కఱ్ఱతోగాని బాదవద్దు. సన్‌లైటుయొక్క స్వతసిద్ధమైన నురుగు మురికినంతటిని వస్త్రమునుండి వదల్చును. 4. మురికి అంతయు పోయేటట్టు బట్టలను బాగావుసమండి. బాగా మురికిగావున్న బట్టకు ఇంకొకసారి సబ్బుపట్టించుట అవసరము.




# సన్‌లైటు సబ్బు బట్టలను కాపాడును



LEVER BROTHERS (INDIA) LIMITED

# మీరూ



# మీధనమూ



# భవిష్యత్తూ

“ నాడబ్బు నాస్వంతం. నాయిష్టం వచ్చినట్లు నేను దాని నెందుకు ఖర్చు చేసుకోకూడదు?” అంటారేమో. ఔను మీయిష్టమే. ఐతే, మీరు దానిని చెమట ఓడ్చి (కష్టపడి) సంపాదించి యున్నట్లయితే దానిని దండుగ చేసెయ్యాలని కోరరుగదా? అత్యవసరం కానప్పుడున్నూ, అత్యధిక ధరలు చెల్లించి కొనేటప్పుడల్లా మీరు మీడబ్బును దండుగ పెట్టడమే జరుగుతున్నది. వెలలు మళ్లీ మామూలు స్థితికి వచ్చేవరకు కొనకుండా ఆగితే మరీ మంచిది.

భవిష్యత్తును మరిచిపోవద్దు. యుద్ధం సమాప్తమై విజయలాభం కలిగినప్పుడు, భారతదేశం యుద్ధానంతర అభివృద్ధి కార్యాలకోసం యావచ్ఛక్తినీ సర్వసంపత్తినీ వినియోగించి శాంతికాలపు కళలను వృద్ధిచేసుకోవడం కోసం ఎంతయినా మూలధనం కావలసి యుంటుంది. మీరు ఇప్పుడు ఎంతకూడిక చేసి - ఏమి మిగిల్చి సంపాదించుతారో అది మీ భవిష్యత్తుకు గట్టి పునాదుగ వెయ్యగలదు.

## వీలైనంత ఎక్కువగా కూడిక చెయ్యండి. మిగిల్చినదంతా పెట్టుబడి పెట్టండి

(భీమా) ఇన్సూరెన్సులోను, ప్రభుత్వ ఋణాలలోను, దేశీయ సేవింగ్సు సర్టిఫికేట్లలోను, పోస్టాఫీస్ సేవింగ్సులోను, సేవింగ్సు బ్యాంకు అకౌంటులలోను, సహకార సంఘాలలోను డబ్బు పెట్టుబడి పెట్టడం మంచిది. మీ ధనం సురక్షితంగా భద్రంగా ఉంటుంది. వీటిలో వేసిన డబ్బుకు మీకు మంచి ఫలితం కలుగుతుంది. లాభం, వడ్డీ వస్తుంది.

దేశీయ యుద్ధరంగంవారు దేశీయులకు చేసే విజ్ఞప్తి.

AAA 1116 TG

భార్య—ఎవరితోటీ చెప్పకుండా రహస్యంగా స్వయంవరం చేసుకున్నావా అమ్మా! మొగుడెవరు?

ఉష—మీతో చెప్పవలసిన అవసరం లేదు.

విశ్వం—ఎవరయితేనేం? చయనులుగారూ, చెయ్యండి మంగళసూత్రానికి జోహారు!

ఉష—నామీద నిందారోపణ చేసి అవమానించిన సంగతి మరిచిపోను.

విశ్వం—చచ్చిన పాముని కొట్టి ఏం ప్రయోజనం ఉషా? మమ్మల్ని క్షమించు. కౌముదిని చూసయినా క్షమించు.

ఉష—కౌముదా? కౌముది మొదటినించీ సానుభూతి చూపిస్తూనేవుందనుకో. అయినా దాని కీసంగతి తెలుసుగా?

విశ్వం—కౌముదికి ఈసంగతి తెలుసా? అహా! ఎంత మోసం, ఎంత మోసం!! ఇహముం దెప్పుడూ ఏఆడదాని పక్షమూ మాట్లాడకుండా బుద్ధిచెప్పావు.

ఉష—ఇహ నే నిక్కడుండడం మీకూ, నాకూ కూడా కష్టంగా వుంటుంది. నే వెళతాను.

చయ—తెలియక మే మన్న మాటలకి క్షమించమ్మా!

భార్య—మీ అందరికీ వెఱ్ఱెత్తిందా ఏమిట్రా! ఎవరితోనూ చెప్పకుండా వెళ్లి పెళ్లి చేసుకొచ్చి మన్నందరినీ మోసంచేసినది తప్పు దానిదా, మీదా? మీరందరూ ఏదో ఘోరపాపం చేసినట్టు బతిమాలుకోడం మొదలెడుతున్నారేం?

విశ్వం—చూశారా చయనులుగారూ! స్త్రీమాయ. దీని ముందు పురుషమాత్రులం మనం ఎందుకు పనికొస్తాం? ఇప్పటికయినా గ్రహించారా? మనం వొట్టి కీలుబొమ్మలం బాబూ! వొట్టి కీలుబొమ్మలం!

[సశేషము]




ఉపాధ్యాయుడు — విద్యార్థి దృష్టిలో

# చెలీ!

= శ్రీ మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి =

విధి యను నైంద్రజాలికుఁడు విశ్వముపేరిటి మంత్రపింఛ మి
వ్విధముగఁ ద్రిప్పి నిన్ను భ్రమపెట్టుటగాని నిజానకున్నవే?
యుదయముఁ బొందు టస్తమయమొందుటలన్నవి యల్లప్రొద్దుకా
ల్కడపునె? యంతెయే మొఁగద! కాంత! సుఖమ్మునుగష్టమాత్మకున్.

ఏ యొకనాటికేనిఁ జెలి! యీ పవలన్నదె లేకయుండగా
రేయినడంగనున్నది.యి సృష్టికిమూలము సూర్యబింబమే
పోయెడికొక్కొ యొక్క మసిబొగ్గయి యందునిమిత్తమే యొకో
ఛాయగ మృత్యు వాతని నజస్ర మిటుల్ విడనాడకుండుటల్.

దేహమటన్న యీ ప్రమిద దీపముగా వెలుఁగన్ బ్రపంచక
స్నేహరసమ్ము లేనియెడ జీవమువృత్తియటన్న వత్తికే
దాహకమై సమస్తమును దగ్ధమొనర్చుటె కాదు తానునం
దే హరియించిపోవును జెలీ! వృథగాగ నివృత్తిపేరటన్.

కడచె గతంపుఁ జీకటులు కాంచు వివేకపు నేటి ప్రొద్దునం
బడసినయట్టి వెల్గున భవన్మతి పార్వణచంద్రబింబమై
వెడలగ భావవీథులను వేడుకవెన్నెల గాయఁ జొచ్చెడిన్
గడగుము చంద్రకాంతమటు ఖాయముతోడఁ గరంగిపోవఁగన్.

గంధము నప్పటప్పటికి గాలి యెటుల్ గ్రహియించివీడునో
బంధమునందుఁ జిక్కి యటు ప్రాణముతప్పకొనంగఁ జొచ్చు త
త్సంధినిమాత్ర మే నెఱుఁగఁజాలకపోతి నికేమి చెప్ప ఈ
రుంధనతోడనే గడచె రోజులు మాసము లేండ్లుపూండ్లునున్.

కరివలె మాటిమాటికిని కాల్విదలించునుగాని యంతలో
తిరిగి మనోహరీ! మకరితీరున బంధము వచ్చి పట్టెడిన్
విరవిరబోయి ప్రాణ మతివిహ్వలతన్ మొఱవెట్టినన్ బొరిం
బొరి ఫలమేమి? పట్టువిడుపుల్ గ్రహియింపగ నేరకుండినన్.

# మధురనేలిన తెలుగునాయకరాజులు



= శ్రీ దిగవల్లి వేంకటశివరావు =

సంగమరాజవంశీయులగు ఐదుగురు సోదరులు క్రీ. శ. ౧౩౩౬లో కర్నాటకదేశము మధ్య తుంగభద్రానదీతీరమున విద్యానగరము నిర్మించి విజయనగరసామ్రాజ్యమును స్థాపించినారు. ఇది రమారమి మూడువందలేండ్లు వర్ధిల్లినది. వీరు తెనుగువిభులని, ఇది తెలుగుసామ్రాజ్యమని అందరికిని తెలిసిన విషయమే. ౧౩౪౩ మొదలు ౧౩౭౬ వరకూ విద్యానగరమేలిన బుక్కరాయల మహామంత్రి మాధవవిద్యారణ్యులవారు సనాతన ధర్మోద్ధారణకు బద్ధకంకణులైనవారు. ఆకాలంలో మధురను మహమ్మదీయులాక్రమించుకొని యున్నందున బుక్కరాయలవారు తమ కుమాళ్లలో ఒకడైన కంపరాయ లనువారిని పారదోలడానికి దక్షిణ దిగ్విజయయాత్ర చేసి రమ్మని పంపించారు. అంతట కంపరాయలు తుండీరమునకు రాజధానియైన జింజిలో దండనాయకుడుగా నున్న గోపనార్యుని యొక్కయు, సాళువ మంగియొక్కయు సహాయముతో పడమర తిరువాంకూరునుండి తూర్పున శ్రీరామసేతువువరకు గల దేశమును జయించి మధురలోని సుల్తానులను తెగటార్చి దేశమును విజయనగరమునకు పరగణాగాచేసి కొంతకాలము తానక్కడనుండి దేశమును పరిపాలించినాడు. ఈసంగతి శాసనములవలన తెలుస్తున్నది. ఈయనసంతతివారుకూడా కొన్నాళ్లు పరిపాలించినారు. ఈవిశేషములు కంపరాయల భార్య రచించిన మధురావిజయ మనే సంస్కృతకావ్యములో వర్ణింపబడి యున్నది. తరువాత విద్యానగరము నేలిన చక్రవర్తులీ దక్షిణదేశమునకు రాజాధిరాజులుగానుండి, సామాన్య పరిపాలనము పూర్వ రాజవంశీయులైన పాండ్య చోళరాజులకే వదలి, వారివల్ల కప్పమును పుచ్చుకుంటూ, అప్పుడప్పుడు అజమాయిషీ నిమిత్తము రాజప్రతినిధులను పంపుతూవచ్చారు. ప్రౌఢదేవరాయ లనే రెండవ దేవరాయలవారి కాలంలో (౧౪౨౪-౧౪౪౬) అక్కన మాదన లనే ఇద్దరు అన్నదమ్ములు దక్షిణదేశానికి రాజప్రతినిధులుగా వచ్చి దేశపరిపాలన జరిగించారు. దేవరాయల తరువాత ఉత్తరాన మహమ్మదీయుల యొత్తిడివల్ల కొంతకాలము విద్యానగరసామ్రాజ్యము చిక్కులలో మునిగినది. సంగమరాజవంశమునకు బదులుగా సాళువరాజవంశమువారు పరిపాలకులైనారు. సాళువ నరసింహుని కాలములో వీరనరసింహుడనే యతనిని దక్షిణరాజ్య ప్రతినిధిగా పంపినారు. ౧౫౦౯ మొదలు ౧౫౨౯ వరకూ విద్యానగరము నేలిన కృష్ణదేవరాయలవారు ౧౫౧౨-౧౫౧౩ సంవత్సరములలో దక్షిణ దిగ్విజయయాత్ర చేసి శివసముద్రము, ఉమ్మటూరు, శ్రీరంగపట్నము, కొడగు, మళయాళము, చిత్తూరు మొదలైన ప్రాంతాలను తమవశము చేసికొన్నారు. దక్షిణదేశమును మూడుభాగములుగా చేసి నెల్లూరు మొదలు కొల్లడమువరకును గల సీమకు జింజిలోని కృష్ణప్పనాయకుని, కావేరిప్రాంత సీమకు తంజావూరిలో నున్న విజయరాఘవనాయకుణ్ని, తిరునల్వేలి ప్రాంతమునకు వెంకప్పనాయకుణ్ని అధికారులుగా చేసినారు.

కృష్ణదేవరాయలవారి కాలంలో చోళరాజుకూ, పాండ్యరాజుకూ తగాదాలు వచ్చి చోళరాజు పాండ్యరాజును పదభ్రష్టుణ్ణి చేయగా పాండ్యరాజు రాజ్యం అతని కిప్పించడానికి శ్రీకృష్ణరాయలవారు తమ తోశేఖానా (ధనాగార) అధికారిన్నీ, దక్షిణదేశరాజప్రతినిధిన్నీ, కాశ్యపగోత్రుడున్నూ అయిన నాగమనాయకుణ్ని పంపగా ఆయన చోళరాజును ఓడించి

పాండ్యరాజ్యమున్నూ, చోళరాజ్యమున్నూ కలిపి తానే ఏలసాగినాడు. అంతట పాండ్యరాజు మొర పెట్టుకోగా నాగమనాయకుని శిక్షించడానికి ఎవర్ని పంపుదామా అని కృష్ణరాయలవారు ఆలోచిస్తూ వుంటే నాగమనాయకుని కుమారుడైన విశ్వనాధనాయకుడే దానికి పూనుకొని తండ్రిని పట్టి తేగా శ్రీకృష్ణదేవరాయలవారు అతని రాజభక్తికి సంతోషించి అతనిని అనేకవిధాలుగా గౌరవించి నాగమనాయకుణ్ణి క్షమించారు. విశ్వనాధనాయకుడు మహాశూరుడై అనేకయుద్ధాలలో గెల్చినందువల్ల రాయలవారి అనుగ్రహానికి పాత్రుడైనాడు. ఇలాంటివాణ్ని దక్షిణదేశానికి సామంతరాజుగా చేస్తే తమ సామ్రాజ్యానికి అండగా వుంటాడని రాయలవారికి తోచింది. అంతట పాండ్యరాజుకు ఔరసుడు లేనందువల్ల ఆయనను ఒప్పించి విశ్వనాధనాయకుడికి పాండ్యరాజ్యాన్ని పట్టంకట్టి అతనికి 'దక్షిణసింహాసనాధిపతి' యనే బిరుదునిచ్చి మధురకు పంపించారు. విశ్వనాధుడు తన మంత్రులైన నియోగులను కంచికాపురస్థుడైన ఆర్యనాయక మొదలియారును, బిసపాకం కేశవప్పనాయణ్ని, ఇంకా ఇతర పరివార జనమును వెంటబెట్టుకుని మధురకుపోయి పరిపాలింపసాగినాడు. అప్పటినుంచీ మధుర నేలిన అతని వంశీకులందరూ పాండ్యమండలాధీశ్వరులని, దక్షిణసింహాసనాధ్యక్షులని బిరుదులు వహించి పరిపాలింపసాగినారు. ఈసంగతులు తంజావూరు ఆంధ్రరాజుల చరిత్ర యనే పురాతనమైన ఒక తెలుగు వచనగ్రంథంలో వర్ణింపబడియున్నవి. *

౧౫౩౦ మొదలు ౧౫౪౨ వరకూ విద్యానగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన అచ్యుతదేవరాయలవారి (కృష్ణరాయలతమ్ముడు) కాలములో దక్షిణమున తిరువాంకూరురాజు మధురనాయకునిమీద తిరగబడినందువల్ల రాయలవారు ౧౫౩౫ ఆ ప్రాంతంలో దక్షిణదిగ్విజయయాత్రచేసి తన తోడియల్లుడైన చినచెవ్వప్పనాయకుణ్ణి చోళమండలానికి రాజుగా చేశాడు. అతడును, ఆయనవంశీకులును తంజావూరును రాజధానిగా చేసుకొని పరిపాలింపసాగినారు. అంతట మధురనాయకులకూ, తంజావూరునాయకులకూ విరోధాలు, తగవులు, యుద్ధాలు బయలుదేరినవి.

యనంతరము చక్రవర్తియైన సదాశివరాయలవారికాలములో (౧౫౪౨ మొదలు ౧౫౬౭ వరకూ) కృష్ణదేవరాయలవారి అల్లుడైన అళియరామరాయలనే ఆరవీటి రామరాజు బలవంతుడై సామ్రాజ్యమును పరిపాలించినాడు. ౧౫౭౦ మొదలు ఆయనతమ్ములును, వారివంశీయులును చక్రవర్తులైనారు. రామరాయలు తన పితృవ్యపుత్రులైన రామరాయ విఠల చినతిమ్మనాయకులను దక్షిణదేశానికి రాజప్రతినిధులుగా చేశాడు. వారు దక్షిణమున తిరుగుబాటుచేసిన తిరువాంకూరు సింహళరాజులను ఓడించారు. తంజావూరు మధురజింజీల నేలే నాయకులు విజయనగర సామ్రాజ్యానికి సామంతులుగా నుండి దేశపరిపాలనము చేసేవారు.

ఇలాగ కంపరాయల కాలమునుంచి ఉత్తరమునుంచి దక్షిణమునకు తెనుగువారియొక్కయు, కర్నాటకులయొక్కయు వలస ప్రారంభమైనది. విజయనగర ప్రభువులు దండయాత్రచేసినప్పుడల్లా వారితో వచ్చిన పరివారజనములోని తెలుగువారు కొంద రిక్కడ స్థిరముగా నెలకొనసాగినారు. తెలుగుకుటుంబాలవారు క్రమక్రమంగా ఒకప్రవాహంలాగ దక్షిణదేశానికి వచ్చి నెలకొనసాగినారు. ఇలాగ వచ్చిన వారిలో అన్ని జాతులవారు, అన్ని వృత్తులవారు ఉన్నట్లు తెలుస్తున్నది. ౧౮౫౦ సంవత్సరం ఆషుమారు నాటికికూడా తంజావూరుజిల్లాలోని జనసంఖ్యలో ఒకటిన్నరలక్ష తెలుగువా రున్నారని ఆజిల్లామాన్యువలు వ్రాసిన గ్రంథకర్త వ్రాసినాడు. † అలాగే మధురజిల్లాలోని జనసంఖ్యలో మూడులక్షల తెలుగువారున్నారని ఆజిల్లామాన్యువలు

---

* బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ౧౯౧౪ లో ప్రకటించిన తంజావూరు ఆంధ్రరాజుల చరిత్ర.

† బ్రహ్మశ్రీ కురుగంటి సీతారామయ్యగారి తంజాపురాంధ్రనాయకరాజచరిత్ర.

రచించిన నెల్సను వ్రాసినాడు. వారిలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు అష్టాదివర్ణములవారు నున్నారు. తెలుగునాయకరాజ్యాలు అంతరించిన నూరేండ్లతరువాతకూడా ఇంత తెలుగుజనం అక్కడ నున్నదంటే అసలు వలసకు వెళ్లిన ప్రజలు ఎన్నిలక్షల మంది ఉంటారో ఊహించ వచ్చును.

## చరిత్రరచన

తంజావూరునేలిన నాయకరాజులు తెలుగువారే ననేసంగతి చిరకాలముక్రిందటనే తెలుగులో రచింపబడి బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారివలన ప్రకటింపబడిన తంజావూరు ఆంధ్రరాజులచరిత్రవల్లను, దక్షిణదేశ ఆంధ్రవాఙ్మయచరిత్రనుగూర్చి పలువురు వ్రాసిన వ్యాసములవల్లను, బ్రహ్మశ్రీ కురుగంటి సీతా రామయ్యగారు రచించిన తంజాపురాంధ్రనాయక రాజచరిత్రవల్లను అందరికిని బాగా తెలిసివచ్చినది. కాని మధురనేలిన నాయకులుకూడా తెలుగువారే ననే సంగతి అంతబాగా ప్రచురము కాలేదు. పైగా మన దురదృష్టవశమువల్ల మధురనాయకులనుగురించి ఇంగ్లీషులో వ్రాయబడిన గ్రంథములలోకూడా దీనినిగూర్చి వివరముగా వ్రాయబడలేదు. ౧౮౬౮ లో జె. హెచ్. నెల్సన్ వ్రాసిన మధురజిల్లామాన్యువలు పునర్ముద్రణము లేనందువల్ల దొరకడములేదు. ఆర్. సత్యనాథయ్యరు గారిచే రచింపబడి మద్రాసు విశ్వవిద్యాలయముచే ౧౯౨౪ లో ప్రకటింపబడిన మధురనాయకులచరిత్రలో మధురనాయకరాజ్యము తెలుగురాజ్యమే ననేసంగతి సరిగా వివరింపబడకపోగా తెలుగుపేర్లు అరవయుచ్చారణతో వ్రాయబడుటవల్ల మన మధురనాయకులు అరవవారేమోననే అపోహకూడా కలిగిస్తున్నది. మధుర నాయకరాజ్యమునకు మూలపురుషుడైన విశ్వనాథ నాయకుడు కాశ్యపగోత్రుడైన తెలుగువాడు. ఆయన పేరు మహారాజమాన్యరాజశ్రీ విశ్వనాథనాయని అయ్యలుగారుఅనిన్ని, ఆయనకుమారుడైన కుమారక్రిష్ణప్ప, లేక క్రిష్ణమ్మనాయకునిపేరు మహారాజమాన్యరాజశ్రీ క్రిష్ణమ్మనాయని అయ్యలుగారు అనిన్ని కేవలమూ జాతీయమైన ఈ తెలుగుపద్ధతిలోనే మధురదేవాలయం లోని సువర్ణపద్మసరోవరము దక్షిణప్రక్క గోడమీద వ్రాయబడినది. మధుర నేలిన విశ్వనాథ నాయకుని సంతతివారు పై విధమైన గౌరవ వాచకములోనే వ్యవహరింపబడినారు. ౧౬౦౧-౯ మధ్య మధుర నేలిన ముద్దుక్రిష్ణమ్మగారి పేరు ముత్తుక్రిష్ణప్ప యని, ౧౬౦౯ మొదలు ౧౬౨౩ వరకూ మధుర నేలిన ముద్దువీరప్పగారి పేరు ముత్తువీరప్పయనిన్ని వ్రాసినారు. ౧౬౨౩ మొదలు ౧౬౫౯ వరకూ మధుర నేలిన ప్రతిభాశాలి పేరు మహారాజమాన్యరాజశ్రీ తిరుమల శౌరినాయని అయ్యలు గారు అయి యుండగా సత్యనాథయ్యరు తిరుమలనాయకుడని వ్రాసి యూరుకున్నారు.

ఇలాగే ౧౬౫౯-౧౬౮౨ మధ్య మధుర నేలిన చొక్కనాథనాయకుని కుమారుడున్నూ, ౧౬౮౨-౧౬౮౯ మధ్య మధుర నేలిన తెలుగు ప్రభువున్నూ అయిన రంగకృష్ణ ముద్దువీరప్పనాయకుని పేరు ముత్తువీరప్ప యని వ్రాసినాడు. ఆయనయనంతరము ఆయన కుమారుడైన విజయరంగ చొక్కనాథుని బాల్యంలో ౧౬౮౯ మొదలు ౧౭౦౬ వరకూ మధురను పాలించిన ఆయన తల్లియైన మంగమ్మగారి పేరును మంగమ్మాళ్ అని వ్రాసినాడు. తెలుగు పేర్లు అరవవారు వ్రాయడంలో అవి విరూపం చెందడంలో ఆశ్చర్యం లేదు. అచ్చమైన తెలుగువాడున్నూ, అమాత్యుడున్నూ, తిరుమలశౌరికాలంలో గొప్ప దళవాయిన్నీ అయిన రామప్పయ్యగారి పేరు కొన్ని అరవశాసనములలో రామప్పయ్యరు అని మారింది. ఆయనను గురించి వ్రాయబడిన ఒక తమిళ పద్యకావ్యంలో రామప్పయ్యన్ అని మారింది. అయితే మంగమ్మగారి కాలంలో దళవాయిగా నుండి మధురరాజ్యాన్ని అతి సమర్థతతో పరిపాలించిన తెలుగు అమాత్యుడైన నరసప్పయ్యగారి పేరుమాత్రము మార్చకుండానే చరిత్రప్రసిద్ధమైనది. ౧౭౦౬ మొదలు ౧౭౩౨ వరకు మధురరాజ్యం పరిపాలించిన విజయరంగ చొక్కనాథునికి తెలుగుమీద కల్గె అభిమానమును గురించిగాని, ఆయనకాలంనాటి తెలుగు సాహిత్యాభివృద్ధిని గురించి కాని సత్యనాథ

య్యరుగారు వ్రాయనేలేదు. "నాయుడు, నాయని" అనే తెలుగు పదములే అరవములో 'నాయకన్' అనే రూపంతో ఉచ్చరింప బడుతున్నవనిన్నీ, ఇప్పటికీ మధుర రాజ్యంలోని కవరెయ్ అనే బలిజ కులాలవారు ఈ నాయక బిరుదమును వహిస్తున్నారనిన్నీ ౧౮౬౮ లో మధుర రాజ్య చరిత్రను రచించిన నెల్సను వ్రాసినాడు.

జింజి, తంజావూరు, మధుర రాజ్యాల నేలిన నాయకుల చరిత్రలోని అనేక విషయాలను గురించి చరిత్రకారులలో అభిప్రాయ భేదము లున్నప్పటికీ వీరు తెలుగువారనే విషయంలో మాత్రము అభిప్రాయ భేదములు లేవు. చరిత్రకారు లందరూ వీరు తెలుగు వారే నని అంగీకరిస్తున్నారు.

## మధుర రాజ్యంలోని తెలుగుజనము

౧౮౫౦-౫౧ కులములవారీ జనాభాలెక్కల వల్ల మధుర జిల్లాలో ౧౭,౪౪,౫౮౭ మంది ప్రజలున్నట్లున్నూ, ఇందులో ౩,౦౦,౦౦౦ మంది పరాయి జనము అయినట్లున్నూ తేలినది. ఇందులో బ్రాహ్మణులు, లబ్బీలు, క్రైస్తవులు మొదలైనవారి సంఖ్య చేరలేదు. వీరిలో చాలామంది తమిళులు కారు. బ్రాహ్మలలో నున్న పరాయిజనము చాలామంది తెలుగువారే. వీరిలో చాలామంది ప్రభుత్వంక్రిందను, జమీందార్ల క్రిందను వుద్యోగము చేస్తున్నారు.

యుద్ధాలలో మైసూరు మహారాష్ట్రి విజయనగర సేనాధిపతులతో వచ్చినవారు గాక మహమ్మదీయ దండయాత్రల సమయంలో చాలామంది బ్రాహ్మణ కుటుంబాలు దక్షిణాదికి పోయి తలదాచుకున్నారు. వీరు బయట అరవం మాట్లాడుతారు గాని ఇళ్లలో తెలుగే మాట్లాడతారు అని 'మధురరాజ్యము' అనే పుస్తకాన్ని రచించిన జే. హెచ్. నెల్సన్ ౧౮౬౮ లో వ్రాసినాడు. బ్రాహ్మణులలో తెలుగువారు గాక మహారాష్ట్రులుమొదలైనవారు కూడా వున్నారు. వీరు తమతమ తెగలలోగాక తమిళ బ్రాహ్మణులలో పెండ్లిండ్లు చేసుకోరు.

బ్రాహ్మణేతర కులాలలోని పరాయిజనంలో ఎక్కువమంది తెలుగువారే. పోర్చుగీసు జెసూటు క్రైస్తవులు అందరినీ కలిపి "బడగ"లనేవారు. కాని ప్రజలలోమాత్రం తాము అధికులమనే భావం తెలుగు కులాలవా రందరిలోనూ వ్యాపించియున్నది. తెలుగు వారిని 'వడుకను' లని అరవవారు పిలుస్తారు. 'వడుకను' అనగా ఉత్తరాది జనమని అర్థము. ఈ వడుకనులలో చాలామంది వైష్ణవులు. వారు జందెములు ధరిస్తారు. తమ శవములను దహనం చేస్తారు గాని పూడ్చరు. వారిలో ముఖ్యముగా (౧) కవరెయి, (౨) గొల్ల, (౩) రెడ్డి, (౪) కమ్మవారు, (౫) తొట్టియ లేక కంబలవా రనే అయిదు తెగ లున్నవి. ఈ చివరి మూడు తెగలు వ్యవసాయము చేసి జీవించే జనము. వారు మాట్లాడే భాష తెలుగు. వారి ఆచార వ్యవహారాలు అరవవారివాటికి భిన్నంగా వుంటవి. వారు అరవం మాట్లాడడం నేర్చుకున్నారు. వారిలో చాలామంది మొదట విజయనగరం సేనాధిపతులక్రింద సైనికులు గానో, పాళెగాళ్లగానో పనిచేసిన తరువాత సామాన్య రైతులైనవారు. కమ్మవారు తొట్టియనులలో నొక తెగవారు. రెడ్లు కేవలము వ్యవసాయము వల్ల జీవించే రైతులు. వీరు తమిళులకంటె బలిష్ఠులు. గొల్లవారిసంగతి చెప్పనక్కరలేదు. ఇక కవరె లనే వారిని "బలిజ" లనికూడా అంటారు. వీరి సంఖ్య చాలా ఎక్కువగా నున్నది. వీరిలో చాలామంది వివిధ వృత్తులు చేసుకుని జీవిస్తారు. కొంతమంది కేవలము గాజులు చేసి జీవిస్తారు. వీరిని గాజులసెట్లని అంటారు. నూలు వడకడము, రంగులు వేయడము, ముచ్చిపని మొదలైనవి చేసేవారిని 'నాయకు'లని పిలుస్తారు. వీరందరూ జందెములు ధరిస్తారు. వీరు గాక పట్టుసాలె, నూలు నేసేవారు, తెలుగుసాలెలు, మంగళ్లు, చాకళ్లు, మాలమాదిగలు కూడా చాలామంది మధుర జిల్లాలో నున్నారు. చెరువులు త్రవ్వే ఒడ్డె జనము నాయకరాజులతోనే వచ్చినట్లు తెలుస్తుంది. పుస్తకములకు అట్టలు కట్టి, కలములు చేసి, తోళ్లకు రంగులు వేసే ముచ్చీలు తెలుగువారే. *

* The Madura Country— by J. H. Nelson. Part II. p p. 80-88.

# మధురనేలిన తెలుగునాయకరాజులు

## విశ్వనాథ నాయకుడు

పాండ్యరాజుగాను, దక్షిణ సింహాసనాధిపతిగాను కృష్ణదేవరాయలవలన నియమింపబడిన విశ్వనాథ నాయకుడు మధురను రాజధానిగా చేసికొని ౧౫౨౯ మొదలు ౧౫౬౪ వరకూ పరిపాలించాడు. ఆయనతో పాటు పరివారము, సైనికులు, రాజ్యతంత్ర నిపుణులైన నియోగులు వేదశాస్త్రపారంగతులైన వైదికులు, కవులు, గాయకులు మొదలైన తెలుగువారు వివిధ కులాలవారు, వివిధవృత్తులవారు మధుర రాజ్యానికి వచ్చారు. వీరందరూ అక్కడ స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. పాండ్యరాజ్యంలో పూర్వకాపులైయున్న అరవప్రజలు అన్ని తెగలవారు, అన్నివృత్తులవారు విశ్వనాథునిపాల బడ్డారు. విజయనగర సామ్రాజ్యము విజృంభించినప్పటినుంచీ ధైర్యసాహసములుగల కన్నడ, తెలుగు నాయకులు కొందరు దక్షిణదేశంలోకి దండయాత్రలు చేసి దేశాక్రమణ చేసి అనేక భాగాలకు స్వతంత్ర ప్రభువులై అవతల జింజి నేలే నాయకులకు గాని, ఇవతల పాండ్య, చోళరాజులకుగాని లోబడక ఎవరికీ కప్పము చెల్లించకుండా వున్నవారున్నారు. విశ్వనాథుడి దక్షిణసింహాసనాధిపత్యము సుస్థిరంగా వుండవలెనంటే అరవలను, తెనుగువారిని, ఈనాయకులనుకూడా ఏదో విధముగా సమాధానపరిచి తన ప్రభుత్వానికి లోబరచియుంచాలి. ఇందు కత డొక ఉపాయం ఆలోచించాడు. మధురకోటకు ౭౨ బురుజులున్నవి. తనకు కనబడిన బలవంతులైనవారి కొకొక్కరి కొక్కబురుజును రక్షించే భారం మీదపెట్టి, వారు కొంతకప్పం చెల్లించేటట్లున్నూ, కొంతసైన్యం సిద్ధంగావుంచి అవసరమైనప్పుడు తనకు సహాయం చేసేటట్లున్నూ ఏర్పాటుచేసి ఒకొక్కరిని కొంత దేశభాగానికి అధికారిగాచేసి పాళెగారు అనే బిరుదమిచ్చి తానొక దర్బారుచేసి ఆసభలోకి వారి నాహ్వానించి వారికి ధనకనకవస్తువాహనాలు బహుమానంగా ఇచ్చి బిరుదములు, ప్రత్యేకసౌకర్యములనిచ్చి గౌరవించాడు. అంతట్ల ఈ ౭౨ పాళెగార్లున్నూ అప్పటినుంచి విశ్వనాథునికి నమ్మినబంటులై ఆయనకు సహాయంగా వున్నారు. ఈరాజకార్యములను చక్కబెట్టడంలో విశ్వనాథునికి ఆర్యనాయక మొదలియార్ అనే కంచీపుర కాపురస్థుడైన యుద్యోగి తోడ్పడ్డాడు. అతడు విశ్వనాథునికి దళవాయిగాను, ప్రధానామాత్యుడుగాను ఉండి అనేకయుద్ధాలలో జయముచేకూర్చి రాజకార్యాలను అతిసమర్థతతో చక్కబెట్టినాడు. విశ్వనాథుడు ౧౫౬౪ వరకూ ప్రజానురంజకంగా దేశాన్ని పరిపాలించాడు. విశ్వనాథనాయకుని వంశీకులైన నాయకరాజులందరూ ఆయనయందున్న గౌరవమును బట్టి తమ రాజశాసనాలలో తమపేర్లకు ముందాయన పేరుకూడా చేరుస్తూవచ్చారు.

విశ్వనాథనాయకుడు ఎప్పుడు మధురరాజ్యానికి రాజైనదీ సరిగా తెలియడంలేదు. కృష్ణదేవరాయలవారే విశ్వనాథనాయకుడికి మధురరాజ్యానికి పట్టంకట్టి దక్షిణదేశాధిపతిగా చేశారని తంజావూరు ఆంధ్రరాజుల చరిత్ర చెపుతున్నా కృష్ణదేవరాయలవారి అనంతరం ౧౫౩౦ మొదలు ౧౫౪౨ వరకూ విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన అచ్యుతదేవరాయలవారే విశ్వనాథ నాయకుణ్ని దక్షిణ సింహాసనాధ్యక్షునిగా చేసినట్లు 'పాండ్యరాజచరిత్ర' యనే గ్రంథంలోని ఈక్రింది పద్యం చెపుతున్నది :

" అచ్యుతరాయ లే యవనీశ మౌళికి
సరుదులౌ పలువగ బిరుదులిచ్చె
దక్షిణ సింహాసనాక్షీణ సామ్రాజ్య
ధౌరేయుఁడయ్యె నే ధరణివిభుడు
ఘనముగా విజయదుర్గను మహాలక్ష్మి నే
ధీరుడు తెచ్చి ప్రతిష్ఠఁ జేసె
మధురాపురంబున మహనీయ పాండ్యభూ
మండలం బేలె నే మహిపమౌళి
అతడు నృపమాత్రుఁడా మహాహవ జయాంక
భూవరా హోది బిరుదసంభూతకీర్తి
కార్తికీ చంద్రధవళితగగనవాటి
అలఘుడౌ విశ్వనాథనాయకకిరీటి, "

ఈపుస్తకం అడయారు గ్రంథాలయమునం దున్నది. దీనిని గురించి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిల వారు సత్యభామాసాంత్వన పీఠికలో వ్రాసియున్నారు.

కొన్ని కైఫీయతులలోకూడా అచ్యుత దేవరాయలవారే విశ్వనాథునికి మధురరాజ్యాన్ని పట్టం కట్టినట్టు వ్రాయబడినది. అయితే ఆకాలంనాటి శాసనాలలో మాత్రం విశ్వనాథుని పేరు మధురరాజుగా కనబడడంలేదు.

అచ్యుతదేవరాయలవారి శాసనాలలో విశ్వనాథుడు రాయలవారి "ఊడిగ"పు సేవకుడని యుదాహరింపబడినది. రాయలవారి సన్నిహిత భృత్యులలో సామంత మండలేశ్వరులు, సేనాధిపతులు, గొప్పసరదారులు, ఉద్యోగులు, ప్రభువులు అనేకులున్నట్లు శాసనాలవల్లనే తెలుస్తున్నది. అందువల్ల మన విశ్వనాథుడుకూడా అలాంటి ప్రభువై యుండేవాడనడానికి సందేహం లేదు. అచ్యుతదేవరాయల తరువాత ౧౫౪౩ మొదలు ౧౫౬౯ వరకూ విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన చక్రవర్తి సదాశివరాయలు. అయితే ఆయన పేరునకే చక్రవర్తిగాని నిజంగా ౧౫౬౫ వరకూ పరిపాలించినవాడు కృష్ణదేవరాయల అల్లుడైన అళియ రామరాజనే ఆరవీటి రామరాజుగారే. ఆయనతరువాత ఆయనసోదరులే చక్రవర్తులైనారు. ఈ రామరాజుగారి కాలంనాటి శాసనాలలోకూడా విశ్వనాథుడు మధురరాజుగా పేర్కొనబడలేదు. గాని అతడు చోళరాజ్యంలోని ఒక గొప్ప అధికారిగాను, రామరాజుగారి కార్యకర్తగాను, తిరువాది దేశమునకు అధికారియైన అమరనాయకుడుగాను పేర్కొనబడినాడు. అమరనాయకుడనగా కొంతదేశానికి, సైన్యమునకు అధికారియైన సామంతప్రభువు. కొన్ని శాసనాలలో రామరాయలవారికి, విశ్వనాథునికి ఆయురారోగ్య అయిశ్వర్యాభివృద్ధుల నిమిత్తము దానమిచ్చినట్లున్నది. దేశమంతా విజయనగర చక్రవర్తి పేరుతోనే పరిపాలింపబడుతూ వున్నందువల్ల శాసనాలలో చక్రవర్తి పేరేగాని సామంతమండలేశ్వరుని పేరు ప్రత్యేకంగా వివరింపబడకపోవడంలో ఆశ్చర్యంలేదు. అంతమాత్రంచేత ఆకాలంలో విశ్వనాథుడు మధురకు పరిపాలకుడుగా లేడని చెప్పడానికి వీలులేదు. ఇంతకూ చాలాకాలంవరకూ విశ్వనాథుడున్నూ, ఆయన వంశీయులున్నూ విజయనగర చక్రవర్తి రాజప్రతినిధులుగానే దక్షిణదేశాన్ని ఏలినారుగాని స్వతంత్రరాజులుగా ఏలలేదు. క్రీ. శ. ౧౫౬౦ నుంచి విశ్వనాథుని పేరుతోపాటు ఆయనకుమారుడైన కుమారకృష్ణప్ప పేరుకూడా కనపడుతూ వున్నది. ౧౫౬౪ లో ఈ కృష్ణప్పనాయకుడు పట్టాభిషిక్తుడైనట్లు మృత్యుంజయ పత్రములు చెపుతున్నవి. *

(సశేషము).

* Studies in the History of the third Dynasty of Vijayanagar—Dr. N. Venkataramanayya. pp 453-461.

## ఆంధ్రదేశంలోని అద్భుత జలపాతాలు



౨. ఎత్తిపోతల జలపాతము

పల్నాడుసీమలోనిది. ఇక్కడ విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి గొప్ప అవకాశమున్నది.



3. బగాగా జలపాతము

జయపుర సంస్థానములోని మరియొక జలపాతము. విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి దీని వైశిష్ట్యముకూడ మహత్తరమై యున్నది.

ఇంతవరకు ఏ తెలుగు చిత్రమునకు లభించని సన్మానము పొందిన చిత్రరాజము.




# భీష్మ

తారాగణం: కృష్ణవేణి * లక్ష్మీరాజ్యం
గౌరీనాథశాస్త్రి * సి. యస్. ఆర్.
శ్రీరంజని జూనియర్ * బలిజేపల్లి
పారుపల్లి సోదరులు * పి. వి. సుబ్బారావ్

తీగెల * వెల్లంకి * రామిరెడ్డి
సరితాదేవి * విజయ * చంద్రశే
వీరదాస్ భాగవతార్
మాష్టర్ కృష్ణా * కోటేశ్వరరావు.

ఈ క్రింది కేంద్రములలో దిగ్విజయముగా నడచుచున్నది.

| | | |
|---|---|---|
| బెజవాడ - మారుతీ | నెల్లూరు - వినాయక | కాకినాడ - ఎల్ఫిన్ |
| గుంటూరు - రాధాకృష్ణ | రాజమండ్రి - కృష్ణా | విజయనగరం - కృష్ణా |

త్వరలో: మిగతా కేంద్రములలో

| | |
|---|---|
| భీమవరం — వెల్‌కం | తెనాలి — సత్యనారాయణ |
| ఏలూరు — పాండురంగా | విశాఖపట్టణం — ? |

"శ్రీనివాస్ ఫిలిమ్సు రిలీజ్."

| కవులు : | డైరెక్టరు ; | ఫోటోగ్రఫీ : |
|---|---|---|
| బలిజేపల్లి "ఢంకా" | చిత్రపు నారాయణమూర్తి | కోట్నీస్ |

సౌండు ;—వాళ్కే   ఆర్టు :—శర్మ   మ్యూజిక్:—పెంచలయ్య, మోతీబాబు

DISTRIBUTORS FOR ANDHRA, ORISSA & BENGAL :

**CHAMRIA TALKIE DISTRIBUTORS,**

MADRAS — BEZWADA — SECUNDERABAD — GUNTAKAL.

# కలగూర గంప

## శ్రీ బి. వి. నరసింహారావు

ఈయన కృష్ణామండలంలోని కొత్తరంవాస్తవ్యుడు. కాని ప్రారంభవిద్యనుంచి పట్టభద్రస్వీకరణం వరకూ కాకినాడలోనే గడపినాడు అందుచేత యితడు కాకినాడకు దత్తుడైనాడు. హూణవిద్య నభ్యసించి హూణసాహిత్యకవనముయొక్క రాసిక్యము అలవరచుకొన్నాడు. నవ్యాంధ్రసాహిత్యము దోసిళ్ల జుర్రుకొన్నాడు. పురాణభారతగేయకవి జయదేవుని అష్టపదులకు, నారాయణతీర్థులవారి తరంగములకు తన శారీరము, శరీరమును ఒడుగుల్లువో జేసికున్నాడు. సహజస్వభావగరిమచేతనే యితనికి సాహిత్యము, సంగీతము అలవడినవి. ఇతనిలోని రాసిక్యత తన అభినయేచ్ఛకు, నృత్యలాఘవమునకును అనువైన మానసికపరిసరమును ఏర్పరుచుతూనేఉండును.

శ్రీ నరసింహారావు ఎంతైనా మంచి వినయసంపత్తి గలవాడు. ఎటువంటి సందిగ్ధసంఘటనలలోనైనా యువకోద్రేకంలో తనలోని అడకువ నేమాత్రమూ కుంటువడనీయడు.

పంచదశవర్షముల క్రిందట ఓనాడు తెనుగునాడున విలసిల్లే అభినయకళయొక్క భావిఉన్నతిగూర్చి సంభాషిస్తూ భావికాలపు వెలుతురు కనే కనులతో స్వర్గీయ శ్రీ కొంపెల్ల జనార్దనరావు ఆయుష్మంతుడైన శ్రీ నరసింహారావుపేరు నాకు మొట్టమొదట చెప్పి, యీతడు అభినయకళకు ఒక విశిష్టమైన విస్తృతస్థితి సంక్రమింపజేయగలడని ఆశీర్వాణి పలికినాడు. జనార్దనరావువంటి అమృతవాక్కు ఊరకపోలేదు.

ఈనాడు శ్రీ బి. వి. నరసింహారావు రగడు తేరిన రంగసామి అయినాడు. ఉదయశంకర్, గోపీనాథ్, రాగిణీదేవి, స్వర్గీయన ర్తకిపావ్లవా మొదలుగాగల విశ్వవిఖ్యాతనృత్యస్వాముల నాట్యభంగిమములు యీతనిలో చైతన్యము కలిగించి తన నాట్యవిన్యాసములకు ప్రభుత నిచ్చినవి.

"అనార్కలీ" నాటకములో నాట్యము ఆవశ్యకమై, ఆ భూమిక తాను ధరించుట అవసరమై, నృత్యము నేర్వ మొదలుపెట్టినాడు. నాటినుండి నాట్యములో ఎక్కువ కళాకుశలమైన విన్నాణాలు నేర్వవలె ననే ఔత్సుక్యం, లభించిన అవకాశములను చేజార్చుకోనీకుండా, నృత్య, గానాభినయములలో యీయనను నిష్ణాతను చేసింది. ఎందరో కళాభిజ్ఞులు నేర్వాలని ఉవ్విళ్లూరే నాట్యవిన్నాణాలు శ్రీ నరసింహారావు ఒక్కసారి తన నేత్రయుగళిలో ఒక్క మెళకువైన అరమోడ్పులోనే భావాన్ని ధ్వనింపజేసి, మన హృదయాలను స్వనితము చేయగలడు. భంగిమమున అతీంద్రియమైన భావలోకానికే ఆతడు కేలెత్తును; గానమున నరసింహారావు స్వరేశ్వరుని శిక్షణ పొందిన కిన్నెరాంగన.

శ్రీకృష్ణశాస్త్రిగీతాలు, ఎంకిపాటలు, అష్టపదులు, తరంగములు అభినయరూపకములుగా వాటిని మనకు ప్రవచించినపుడు, వాటిని చిత్రములుగా ధ్వనిలో పాదివి "వేయికేలాడగా వ్రాసివేసికొనును."

ఆతని శరీరము త్రిభంగపదవి అతిలలితముగా కూర్చు కొనగలదు. నాట్యభంగిమలు చైతన్యమై, స్థిరమై, ముద్రాంకితమై, తాల్యమునుండి. విశృంఖలమై ఎన్నో సౌందర్యప్రభలతో నేత్రోత్సవము చేయుచు మన కొక అలౌకికానందము పచరించును.

"ఆరాధన" అభినయముపట్టి మనకు రచించి ప్రదర్శించినప్పుడు ఎన్నో చిరుదీపికలు మెరసినట్లునూ, ఎన్నో చిరుఘంటికలు ధ్వనించినట్లునూ పొదగట్టి మనముకూడ ఒక్కసారి కలియుగముమాట మరచి వింతగా రాధికాకాంతల మైపోదుము.

శ్రీ నరసింహారావు నాట్యాభినయములలో పాశ్చాత్యనృత్యములోని లయ, మన పౌరాతన్య భరతశాస్త్రములోని రసధునీనృత్యకోలాహలము సమన్వయింపచేసిన స్థాయీభావరససిద్ధి తరుచై కన్పట్టు తుంది. ఆతని ప్రతిభంగిను ఒక భావస్నిగ్ధని రసైక చైతన్యస్థితి. మధురభావములకు ఆతని హృదయము వినమితలతికయై క్రుంగిపోతుంది. ఆ ఉద్విగ్నస్థితిలోనే ఆతడు నాట్యము మొదలుపెట్టి ఆ భావమును అతి లలితముగా భంగిమలలో రచించి వ్యక్తపరుస్తాడు.

ఎంతటివో లౌకికమైన అవసరపాశములు నిలు! నిలు! అని పలుపువేసి రాటకు కట్టి వుంచుతున్నా, గజ్జెలు కట్టుకుని, ఘుణంఘుణమ్మని చిందులు త్రొక్కుతూనే ఉంటాడు శ్రీ నరసింహారావు.

జనమంచి కామేశ్వరరావు.



# విమర్శనము



## దేవయాని - చిత్రాంగద

శ్రీ రవీంద్రనాథఠాకూరు బెంగాలినుండి అనువదింపబడిన నాటిక ద్వయము. అనువాదకులు : బెజవాడ గోపాలరెడ్డిగారు. ముట్నూరి కృష్ణరావుగారి తుదిపలుకులతో సహా. విశ్వభారతివారు అనుమతించిన అనువాదము. ప్రచురణ: గురుదేవగ్రంథమండలి, త్యాగరాయనగరు,మద్రాసు. వెలరూపాయిపావలా.

రవీంద్రుని రచనలలో 'చిత్రాంగద' విశిష్టము. సారస్వత పరమమాధుర్యము నీ పద్యనాటిక చదివిన ఆస్వాదింపగల్గుదుము. ప్రేమపరిణామము ఇందు నిరూపితము. ఇంద్రియ గ్రాహ్యమైన బాహ్యసౌందర్యమును, హృదయవేద్యమైన భావసౌందర్యమునుగూడ కవి ఈనాటకమున ప్రదర్శించినాడు. ప్రకృతియందు వ్యాపించియున్న సౌందర్యమును, జీవితముయొక్క శరద్వసంతములందలి సౌందర్యమును కవి ఈనాటకములోనికి ఆకర్షించి ప్రకటించినాడు.

ఇంతేకాదు. మానవుల ఈప్రేమ ఆంతర్యమును, దీని రహస్యమును గ్రహింప కుతూహలమేని 'చిత్రాంగద'ను అవగాహనము చేసికొనవలెను. జీవితమందు వాటిలు అల్పత్వములను, దారిద్ర్యములను నెట్టివేసి 'నేను ధన్యుడను'అని మర్త్యునిచే పలికించగల ఈప్రేమతత్త్వమును కవి ఇందు. నిరూపించినాడు.

ఐన, ఈనాటకమునకు అంతరార్థము ఉన్నదా, ప్రేమతత్త్వవిచారణకేనా చిత్రాంగద, అర్జునుడు, వసంతుడు, మదనుడు అను పాత్రలు, అందుకేనా ఈరచన అని ప్రశ్నించవచ్చును. కాని ప్రశ్నకు సమాధానము కొద్దిలో చెప్పుట కష్టము. కావ్యము వేఱు, తత్త్వవిచారణ వేఱు. అయినను ప్రపంచమునందు కవి ఏమి వర్ణించినను దాని జీవాంశము నేకదా మనకు ఇవ్వవలసినది? దాని సౌందర్యమదేకదా? అదే కదా దానియథార్థము, లేక తత్త్వము? కనుక ఈ దృష్టిలో, ఒకవిధముగా తత్త్వజ్ఞుడు కానిచో కవి ఎట్లగును ?

ఈవిషయమెట్లున్నను చిత్రాంగద అతి మధురమైన కావ్యము. భావబద్ధమైన కవి శబ్దజాల మిచట గాయకుని స్వరసంచారమువలె హృదయమున ప్రవేశించును. దీనిని చదివిన తరువాత మనము విన్నది సంగీతమా, లేక సాహిత్యమా అని భ్రమింపజేయును.

ఈనాటకమును, దీనితోపాటు 'వీడ్కోలుశాపము' అను దేవయానినాటకమును శ్రీ బెజవాడ గోపాల రెడ్డిగారు వంగమూలమునుండి అనువదించినారు. అనువాదకుని సామగ్రిలో మూలరచన యెడల ప్రేమ గౌరవము లుండుట ముఖ్యము. వీనివల్లనే శ్రీ రెడ్డిగారు ఈ అనువాదము చేయబూనినారు.

రవీంద్రుని ప్రశస్తకవితనుగూర్చి విని, లేదా ఆంగ్లమున చదివి, లేదా మూలవంగభాషలో చదువనేర్చి ముగ్ధులైనవారికి ఆయనగ్రంథానువాదములు కౌతుకము కలిగించును. ఇదివరలో వెలిసిన తెలుగు అనువాదములు స్వల్పమే. ఆయన ప్రశస్తకవిత తెలుగులో అవతరించలేదు. ఇప్పుడు శ్రీ బెజవాడ గోపాల రెడ్డిగారు ఈపనికి పూనుకొని ముందుకు వచ్చినారు.

అనువాద మసలు సుకరము కాదు. స్వతంత్రించి వ్రాయగలవానికికన్న అనువాదకునకు బహుళమైన

సంపత్తి అవసరము. ఇక కవిహృదయమెరిగి కవితను భాషాంతర మొనర్చుటకు కావలసినది చాలవకన్న సామర్థ్యము; ఉత్సాహముకన్న ప్రజ్ఞ.

వంగభాషలోని మూలమునందలి సంస్కృత పదములు చాలవఱకు అనువాదమున నిలిపినారు. సంస్కృతభాషాసంబంధముగల ఇతరభాషలవారికిని మూలమునందలి ఈ పదములు కొంతవఱకు సులభముగ బోధపడవచ్చును. కాని కవియొక్క తాత్పర్యము అనువాదమున వెంటనే స్ఫురించకపోయినను కొంచె మాలోచనమీదట ఊహించుకొనవీలగును. కవియొక్క మూలరచనయెడ గౌరవాతిశయముచేతనే అనువాదకు లిట్లు మూలమును తమ రచనలో కాపాడినవిషయము 'విన్నపము'లో ఇట్లు తెలిపినారు:

"మాతృకలోని సంస్కృతపదప్రయోగముల నిలుపవలెననుఆసక్తి, సులభగ్రాహ్యముగు ఆంధ్రమున వ్రాయవలెననెడి నా అభిలాష నాముందు ఉండినవి. ఆరెండింటిసమాధానమే నా ఈ ప్రస్తుత అనువాదము" అని. రెండునాటకములు చదివినమీదట రెడ్డిగారి రెండు లక్ష్యములకును తగినంత సమాధానము కుదిరినదా అని శంక కలుగును. మూలములోని పదములను అనువాదములో నిలిపినందున రవీంద్రునిసంస్కృత సమాసముల మాధుర్యము తెలియుచున్నది. కాని కొన్నిచోట్ల అర్థము, అన్వయము ఇందువల్లనే కుదురకున్నవి.

ఉపసంహారములో శ్రీ ముట్నూరి కృష్ణరావు గారు వ్రాసినట్లు "రెడ్డిగారు సాధ్యమైనంతవరకు రవీంద్రుని పదముల కూర్పును, ప్రయోగములరీతిని, చేయ్యాపై ఖరిని నిలుప ప్రయత్నించిరి. ఇందుమూలమున తెలుగు నుడికారమునకు కొంత కొరత వాటిల్లినను రవీంద్రుని పలుకుబడిని మన కొకింత స్ఫురింపజేయ గలుగుచున్నారు." కాని ఈ మాత్రపు ప్రవృత్తియేనా అనువాద లక్ష్యము? ఏనచో ప్రయత్నము అనువాద మార్గమున గాక అన్యథా [illegible] ఉదాహరణకు రెండు వాక్యములు చాలును.

"ఏ నీసంతానమును గర్భమున వహించి యున్నానో అది పుత్రుడైన ఆశైశవ వీరశిక్షణ నొసగి ద్వితీయ అర్జునునిగ జేసి అతనిని అతని జనకుని చరణములకడకు నేను పంపిన దినము నన్ను నీవు తెలిసికొనగలవు, ప్రియతమా"...

..."తన త్రిస్తనేత్రమాత్రమున పురుషుల పరాక్రమ శక్తిని, తప స్తేజమును పరాభూత మొనర్చు ముగ్ధ, మూఢక్షీణతనులత, పరావలంబిత, లజ్జాభయ లీనాంగియగు ఆ సామాన్యలలన ధన్యురాలు."

విశ్వభారతివారి అనుమతితో రవీంద్రుని రచనలను తెలుగుచేసి ప్రచురించుటకు శ్రీ గోపాలరెడ్డి గారు పనుకట్టినందున వా రికముందు ప్రచురించబోవు గ్రంథములు తెలుగులో రాణించవలెనను అభిలాషతో, రవీంద్రునియెడగల గౌరవముతో ఇంతగా విమర్శించుట అవసరమైనది. ఇది దిఙ్మాత్రము. ముందు ముందు అవగాహనయు, తెలుగు వ్రాయు నేర్పును ఎక్కువగా ప్రతిఫలింపగలవని ఆశ.

'సురుచి'

# గ్రంథ స్వీకారము

## Telugu Literature

ప్రాచీన, అధునాతన ఆంధ్రవాఙ్మయచరిత్ర పి. ఇ. యన్. ప్రచురణలలో ౧౫-వది. ఆంగ్ల గ్రంథము. రచయిత : పి. టి. రాజుగారు, యం. ఏ., పి హెచ్. డి., ఆంధ్రవిశ్వవిద్యాలయము, గుంటూరు. ప్రకాశకులు : ఇంటర్నేషనల్ బుక్ హౌసు లిమిటెడ్, ఆష్‌లేన్, బొంబాయి. వెల రూ. ౨-౮.

## ఆరాత్రి

నాటికలు, రచయిత : కౌజ. వెంకటపద్మనాభ రావుగారు. ప్రకాశకులు: స్వర్ణలతా గ్రంథమాల, కాకినాడ, వెల ౮ అణాలు.

## కన్నీటిచుక్కలు

కవితారచన. కవి : జోస్యము జనార్దనశాస్త్రి గారు, తెలుగు పండితుడు, మునిసిపల్ హైస్కూలు, తాడిపత్రి.







Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.

# ఆంధ్రగ్రంథమాల పుస్తకముల పట్టిక

| | |
|---|---|
| ఆంధ్రవిజ్ఞానసర్వస్వము (3 సంపుటములు) సంపు. 1 కి | రు. 10-0-0 |
| శ్రీ మహాఋషి నిఘంటిత యోగశాస్త్రము—కా. సూర్య నారాయణయోగిని ... | 5-0-0 |
| భగవద్గీత (సంస్కృ.)—జె. రామారావుగారి వ్యాఖ్యానముతో 1, 2, 3 సంపు॥లు మాత్రమే ఉన్నవి. సంపు. 1 కి ... | 1-8-0 |
| శతకకవుల చరిత్ర—వం. సుబ్బారావుగారు ... | 1-8-0 |
| పారిభాషికపదకోశము (ఇంగ్లీషులోని శాస్త్రీయపదముల తెలుగుపదముల నిఘంటువు) ... | 1-4-0 |
| ఆంధ్రవాఙ్మయసూచిక (ముద్రితాముద్రిత గ్రంథములపట్టిక) | 1-0-0 |
| శ్యామసుందరము—ఒం. సత్యనాథముగారు ... | 1-0-0 |
| జీవనప్రభాతము (న.)—కె. యన్. వెంకటరమణిగారు ... | 1-0-0 |
| భీష్ముడు (నాటకము)—పా. పిచ్చిరెడ్డిగారు ... | 1-0-0 |
| చంద్రహాసము (నవల)—జి. జోసఫుకవి ... | 0-12-0 |
| అవిమారకము (నాటకము)—మానపల్లి రామకృష్ణకవిగారు | 0-10-0 |
| కృషీవలవిజయము ... | 0-8-0 |
| వివాహతత్వము—బం. మల్లయ్యశాస్త్రిగారు ... | 0-8-0 |
| నిరుద్ధభారతము—మం. వెంకటశర్మగారు ... | 0-8-0 |
| శ్రీరామవిజయము (నాటకము) ... | 0-8-0 |
| ఆరోగ్యసాధనము— గాంధీమహాత్ముడు ... | 0-8-0 |
| గీతాబోధ— ... | 0-4-0 |
| ప్రార్థనగీతావళి ... | 0-4-0 |
| హాలికోద్ధారము—(ప్ర) శేషాద్రిశర్మగారు ... | రు. 0-4-0 |
| మానవస్వత్వములు—థామస్ పెయిన్ ... | 0-4-0 |
| హిందీతెలుగు బాలశిక్ష—పం. ఆ. శాస్త్రిగారు ... | 0-6-0 |
| ,, మొదటివాచకం ... | 0-6-0 |


మేనేజరు, ఆంధ్రగ్రంథమాల,

7, తంబుశెట్టి వీధి - - - జి. టి., మద్రాసు,